క. ఎవరైన నిది యతోంతము, ప్రవిమలమతి వినినవారు పఠియించిన ని
బ్బ్భవపటలధ్వాంతము విడి, శివకర మగు మోక్షలక్ష్మిఁ జెందుదు రనఘా!. 128
వ. ఇంత పల్కనేల వినుము. 129
మ. అతిశాంతాత్ములు మత్పదాబ్జయుగసేవాసక్తులున్ భక్తులా
తతవిజ్ఞానులు యోగులైన జనులన్ దర్శింపుచున్ సంతతో
ద్యతచిత్తంబున నాదుసేవ యనుచుం దద్భక్తి సేయన్ బర
స్థితమౌ మోక్షము వాని కెయ్యెడల నే దీపింతు హృద్వేదికన్. 130
తే. సంశయము లేదనుచు భానువంశతిలకుఁ, డనుజాతోడుతి నానతిచ్చిన తెఱంగు
శైలసుతతోడఁ బల్కెఁ గపాలపాణి, భూరికరుణాంతరంగ! కస్తూరిరంగ!. 131

శ్రీరాముని కడకు శూర్పణఖ వచ్చుట.

సీ. హరుఁడద్రితనయతో మరల నిట్లనియె నక్కాలంబునను మహాగహనమందుఁ
జరియించు నొకమహాసత్త్వయౌ రాక్షసలలన జనస్థాననిలయ కామ
రూపిణి యదియుం జెప్పగను దానొకనాఁటివేళ గోదావరీవిమలపులిన
తలమునఁ దిరుగుచు జలజవజ్రాంకుశాద్యనుపమశుభరేఖ లమరియున్న
తే. సర్వలోకనమస్కృతచరణయుగముఁ, గాంచి తత్పాదసౌందర్యఘనత కెంతొ
భ్రమసి యాజాడఁ జనుచెంచెఁ బంచవటికి, మెల్లమెల్లన రామసమీపముగను. 132
వ. ఇట్లు చనుదెంచి యచ్చట. 133
చ. కనియె రమాసతీశు జనకక్షితిపాలసుతాసమేతుఁ బా
వనఘనతాంగరాగు నభవప్రభు నిత్యనువర్ణవర్ణిసం
జనకజటాకిరీటధరుఁ జండపరాక్రముఁ దాటకేయ మ
ర్దను రతినాథసుందరు నిరామయుఁ బుణ్యవిశాలవక్షునిన్. 134
వ. మఱియును. 135
తే. అబ్ధిగంభీరు సర్వయోగ్యచలు సనుప, వాను నీలాంబురుహపత్రమహిత నేత్రు
సజ్జకంతు సమానుషు సకలశుభచయుని, రాము శ్రీవత్సచిహ్నాంకు రాముఁ గనియె. 136
వ. కనుంగొని కామవిమోహిత యై యారక్కసి రాఘవుం జేర నరిగి యిట్లనియె. 137
సీ. ఎవ్వరివాఁడ వీ వెవఁడ వీయాశ్రమంబున జటావల్కలంబులు ధరించి
యేల చరించెద వద్ది సాధించెద వెఱుఁగింపు నాకు నే నెవ్వ రాక్ష
సిని గామరూపిణిఁ జెప్పెదఁ బేరు శూర్పణఖ మహోత్సుక రాక్షసేంద్రుఁ
డయిన రావణునకు ననుజన్మ నిమ్మహావన మానిశాచరవల్లభుండు
తే. నా కొసంగెను మునిభక్షణంబె జీవ, నముగ నుండెద నదండకమునఁ దమ్ముఁ

దైన ఖరుతోడ నీతెఱం గానతిమ్ము, దెలియఁగను వేఁడెద వదాన్యతిలక! యనిన.

ఉ. దానికి రాముఁ డిట్లనియె దానవి! రామసమాఖ్యుఁడ న్నయో
ధ్యానృపనందనుండ జనకాత్మజ మత్ప్రియభార్య సీత యి
మ్మానిని లోకసుందరి సమంచితలక్షణుఁ డైన లక్ష్మణుం
డౌను గనీయుఁడౌ ననుజుఁ డారయ నాకుఁ ద్రిలోకసుందరీ!. 139

వ. సజ్జనుఁ డానతిఁ దలయిడి వనంబునకు వచ్చితి నిప్పు డెయ్యది నాచేత నీకుఁ జేయ వలయుపని దాని నెఱింగింపు మనిన నదియు రామచంద్రువాక్యంబులు విని కామార్తయై యిట్లనియె. 140

తే. రమ్ము నాతోడ రామ! వనమ్ములందు, శైలములయందు మరుకేళి సలుపు మిపుడు
నిన్ను విడఁజాలఁ గామంబు నిలుపఁజాలఁ, దడవు సేయకు మనిన నద్దాశరథియు.

వ. క్రీఁగంట జనకనందన నవలోకించుచు మందస్మితాననుం డై యిట్లనియె 142

సీ. కల్యాణి! యిదె నాకుఁ గాంత యున్నఁడు విడి యుండనియది యెట్టు లుందువీవు
సవతిదుఃఖముచేతఁ జనుము లక్ష్మణుఁడు నాతమ్ముఁడు మిగులసుందరుఁడు నీకుఁ
దగియుండు నాతని మగనిఁగా విహరింపు మనిని నద్దానవి యట్ల రామ
సోదరుకడ కేఁగి సుందర! మీయన్న యానతిచేఁ బతి వగుము నాకు

తే. వెడలుదము రమ్ము వల దింకఁ దడవు రమ్ము, యనినగతమోహుఁడగు రాఘవానుజుండు
దానిపలుకులు విని పల్కె మానవతివి, నీవు నీకును మేలైన నెలవు వినుము. 143

క. ఏ సీతావల్లభునకు, దానుఁడ ననుఁ జెందెదేని దాసి వగుదు వి
ట్లాసపడ కమ్మహామహుఁ, జేసికొనుము నీదు సేవఁ జేసెద నేనున్. 144

వ. నాకు భార్యవగుకంటె దుఃఖతరంబు లేదు వేగంబ యమ్మహాత్ముకడకు నడువు మతం డఖిలేశ్వరుం డగు రాజతిలకుండు గావున నీకును మంగళంబు చేకూరు ననిన నది యును దుష్టమానస యై మరల రాఘవుసమీపంబునకుం బఱచి క్రోధంబున ని ట్లనియె. 145

ఉ. ఏటికి నన్ను ద్రిప్పెద విటగతితో ననవస్థితుండ వై
మాటికిఁ జూడు మిప్పు డొకమాత్రన నోటికి ముద్దఁ జేతు నీ
బోటి నటంచు ఘోరునకు భూనుతిపై గమకింపఁ గోపి దో
హాటిని బట్టి ముక్కు చెవు లయ్యెడ లక్ష్మణుఁ డాత్తఖడ్గుఁ డై. 146

**శూర్పణఖ లక్ష్మణునిచేత భంగపడి ఖరదూషణాదులం జేరి మొఱవెట్టుట.**

వ. ఇవ్విధంబున. 147

క. అలఘుపరాక్రముఁ డగు రఘు, కులతిలకుఁడు లక్ష్మణుండు కొంకక సీతా

లలనావిభు నానతిఁ దన, చెలు వడఁచిన ఘోరరవము సేయుచు నదియున్. 148

వ. భయంకరంబుగ నెత్తుటం జొత్తిల్లు మేనితోడఁ బరుషాక్షరంబులు పల్కుచు నేడ్చుచుం బారి ఖరునికాల్వ్రనం బడిన నది యేమి యని ఖరతరాక్షరుండగు నా రాక్షసుండును. 149

చ. ఎవఁడు యమాలయంబునకు నేఁగుతలంపునఁ గ్రొవ్వి నీకు నేఁ
డవమతిఁ జేసెఁ బల్కు మిపు డార్చెద నంతకతుల్యుఁ డైన ని
క్కువ మన నాత్మపాచరియుఁ గొంకక యిట్లనె తోడ లక్ష్మణుం
డవనితనూజయు న్నడువ నాయతబాహుఁ డొకండు లీలతోన్. 150

వ. దండకం బెల్ల నిర్భయంబు సేయుచు గోదావరీతటంబున నిలిచియున్నవాఁడు వెండియు. 151

ఆ. వాఁడు రాఘవుండు వానిపంపున వాని, యనుజుఁ డిట్లు చేసి యనిపె నన్ను
నీవు కులజుఁ డౌట నిక్కంపుఁ బోటరి, వైన వానిఁబింక మార్చి రమ్ము 152

వ. లెమ్ము వారలం దెమ్ము తద్రక్తపానంబు చేసి యాసుగుర్త్మగులం దినియెదఁ గాదేని.

క. మృతి నొందెద నన ఖరుఁ డు, గ్రత నప్పదునాల్గువేల రక్కసుల నతి
ప్రతిభుల సన్నద్ధులకై, యతిశీఘ్రమె వెడలుఁ డనుచు నానతి యిచ్చెన్. 154

వ. ఇట్లు భీమకర్ములగు రక్కసులం గొనుచు నాహవకాంక్షచేత ఖరుండును త్రిశిరుండును దూషణుండును దండనాయకులై నానాప్రహరణాయుధంబులు కరంబులం బట్టి యుక్కెపెట్టి నార్చుచు రామనివాసంబు చేరం జనుదెంచు సమయంబునఁ దత్కోలాహలశబ్దం బాకర్ణించి భగవంతుండగు రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని యిట్లనియె. 155

చ. కనుఁగొను లక్ష్మణా! దివిజకంటకు లల్లదె యేఁగుదెంచుటల్
మనపయిఁ బోరు గల్గు నిఁక మార్కొని యుక్కడఁగింపఁ గోరెదన్
జనకజఁ దోడుకొంచు నొకశైలగుహన్ భయమందకుండ నీ
వునిచి ధనుర్ధరుండ వయి యుండుము చూడుము మత్ప్రతాపమున్. 156

వ. ఇయ్యెడ నొండు పల్కంబోలదు నామీఁద యాన గల దనిన సౌమిత్రియు వల్లె యని జనకతనయం దోడుకొని గహ్వరంబుకడకుం జనియె నంత. 157

సీ. శ్రీమంతుఁడగునట్టి రామచంద్రుండును బరికరం బెల్ల నేర్పడఁగఁ గట్టి
యతినిష్ఠురంబగు నాత్మకోదండంబుఁ గొని యక్షయశరంబు లెనయునట్టి
కవదొనల్ మూఁపున ఘటియించి సన్నద్ధుఁడై నిల్వ నప్పిశితాశనులును
బలువిడి నొకపెట్టఁ బఱతెంచి చిత్రవిచిత్రాయుధములును శిలలు పాద

ఉ. ఆతనిచేత నీల్గిన ననంతసుఖావహమౌ వికుంఠరా
జ్యాతిశయంబుఁ గాంతు నిపు డాతనిఁ గ్రుంగిన దైత్యరాజవి
ఖ్యాతిఁ దనర్తు భక్తిమెయి నాభగవంతుఁడు వేగఁ గావఁడే
నీతెరు వొప్పఁ జెందెద నసురేతరవిగ్రహు రామవిగ్రహున్. 182

తే. అనుచుఁ బరమాత్ము సచ్చిత్తు నప్పరేశు, జానకీనాథు నెఱిఁగి రాక్షసవిభుండు
దలఁచె విద్వేషబుద్ధిచేఁ దత్పదంబుఁ, జెందెద నటంచును మహాశిఖరితనయ!. 183

వ. అనుచు మఱల గోరాజకేతనుం డిట్లనియె సవ్యాసంబున నిశాసమయం బెల్ల విచారించి ప్రభాతం బగుడు రథారూఢుండై యొక్కకార్యంబు మనంబున నిశ్చయించి బుద్ధిమంతుండగు రావణుండు మహోదధికవ్వలిదరిని వెలయు మారీచుమందిరంబునకుం జనియె నచ్చట వాఁడును మునితెఱంగున జటావల్కలధారుండయి నిర్గుణుండును గుణభాసకుండును నగు పరమాత్మను హృదయంబున ధ్యానింపుచు సమాధివిరమంబునఁ దనయింటికి వచ్చినరావణుం గనుంగొని సత్వరంబున లేచి యాలింగనంబు గావించి విధ్యుక్తంబుగఁ బూజించి తనచేత నాతిథ్యంబు నొంది సుఖంబుననం గూర్చుండిన యప్పఙ్క్తికంఠుతోడ నిట్లనియె. 184

క. ఒంటరివై రథమున మా, యింటికి వచ్చుటలు నిశ్చయింపఁగ మదిలోఁ
గొంటఁదగనిదుఃఖం బొక, టంటినచందంబు దోఁచు నమరవిరోధీ!. 185

తే. అయిన నెఱిఁగింపు మతిగోప్యమయినఁ జేతు, నీకుఁ బ్రియముగఁ దానన్నింతరైనఁ
గలుష మొందక యుండంగ వలయు ధర్మ, పథము దప్పకయుండఁగవలయు ననిన.

వ. రావణుం డిట్లనియె. 187

సీ. వినవయ్య! యొకరాజు వెలయు సాకేతాధిపతి యభిధానంబు పఙ్క్తిరథుఁడు
సత్యపరాక్రమశాలి యాతని కగ్రతనయుండు రామాభిధానుఁ డట్టి
వనచరప్రియుఁ బోవఁబనిచెఁ గాననమున కమ్మేటియును దండ్రియాజ్ఞఁ బూని
యతివతోడను దమ్ముఁడౌ లక్ష్మణునితోడ నరుదెంచి పంచవట్యాశ్రమమున

తే. ఘోరవిపినంబునను నిల్చె నారఘూత్త, మునిసతీమణి లోకమోహిని విశాల
నయన యొగసీత యనఁగ నాహ్వయముతోడఁ, బరఁగు జనకునిముద్దుఁగూఁతు రని వింటి.

ఆ. ఆతఁడు నిరపరాధు లగునట్టి మారాక్షసులను భీమవిక్రముల నడంచె
ఖరు నడంచె దోషవిరహితుఁడయిన శూర్పణఖముక్కుచెవులు బలిమిఁ గోసె.

వ. వెండియు. 190

ఆ. ఇన్ని చేసి భయ మొకింతయు లేక యా, దుష్టచిత్తుఁ డిపు డభీష్టలీల
వనమునందు నున్నవాఁడఁట నీసహా, యమున వానికాంత నపహరింతు. 191

వ. రాఘవుఁడు లేకయుండవలయుఁ గావున నీవును మాయామృగాకారంబున రామల
క్ష్మణుల నయ్యాశ్రమంబు వెడలింపు మంతట నై దేహిం గొనిపోవఁ దావత్ప
ర్యంతంబు నాకు సహాయంబు బొనరించి పూర్వప్రకారంబున సుఖంబుండుమనిన
నిట్లు భాషించుదశాననుం గనుంగొని విస్మితుండై మారీచుం డిట్లనియె. 192

శ్రీరాముని మహిమ మారీచుఁడు రావణుని కెఱింగించుట

క. విను మెనఁ డిటు నీనాశముఁ, గనుఁగొని యీమాఱు ఘోషకమగు వాక్యం
బనుకూలపఱచె నధ్యుం, డును దండ్రిఁడు వాఁడు మిత్త్రుఁడును నగు నీకున్ 193

ఉ. ఆవసుధేశు పేరు వినినంతనె తల్లడ మంగు గుండె నా
కీపఱ కున్న దేమి యున నెతఁడు బాల్యమునందుఁ గౌశికుం
బ్రోవఁగ నేఁగుదెంచి యొకభూరిశరంబున నన్నుఁ జిమ్మినం
జేవ దొలంగి కూలితిని సింధువునన్ శతయోజనంబులన్. 194

చ. అదిమొదలేను జాలభయ మందుచు రామకృతంబు మాటికిన్
మదిఁ దలపోయుచున్ భువనమాన్య రఘూత్తము నన్ని వేళలన్
హృదయమునం గనుంగొని య దేమనవచ్చును రాక్షసేంద్ర! య
వ్విదితుని పిన్ననాఁటి భుజవిక్రమ మియ్యెడ నొప్పియుండదే. 195

వ. వెండియు. 196

సీ. దండకంబున నవ్విభుం డొంటివేళలఁ బూర్వవైరము మనంబునఁ దలంచి
చని తీక్ష్ణశృంగుఁడన్ మునివేషినై చు మత్సదృశు లనేకులు తగిలిరాఁగ
జనకజాసహితు లక్ష్మణసేవ్యమాను నారఘునందనుని సత్వరంబుతోడ
నేను దాఁకిన నమ్మహాత్ముం డలిగి యొక్కశరము నాపై వైవ శరనిపాత
ఆ. భరముచేత నురము పరియలై చిరచిరఁ, దిరిగి వారిరాశిదరిని గూలి
నాఁటనుండి యివ్వనంబున నున్నాఁడ, నిల్లు వదలి మిగులఁ దల్లడమున. 197

క. ఏవేళ మదిని రామ, త్మావరు మఱపు గనఁ గూర్మిసర్పము గళమం
దావృతమా నరుసకుఁ బలె, రావణ! కంటికిని నిదుర రా దింతైనన్. 198

వ. మఱియును. 199

ఆ. రాజరత్నరమణిరథముఖ్యరేభాదు, లగు పదాళి వినినయపుడు రాముఁ
డని యెదిర్చె ననుచు బెదరు దోఁచును గాన, విడితి బాహ్యకార్యవితతి నెల్ల.

వ. మఱియు నితరంబు మాని యారామచంద్రు ననుధ్యానంబును మనంబునఁ జింతసంబు
సేయుటచేత నిద్రాంతుండనయిననుఁ స్వప్నదేశంబున నారాఘవుండు సమాగతుం
డగున ట్లగు టావేళ నవ్విభుం గాంచి బెగ్గిలి మేల్కాని విగతనిద్రుండనౌదు దశ

కంధరా! నీవును రామచంద్రునెడ నాగ్రహంబు మాని గృహంబునకుం జనుము. ప్రయత్నంబునం బెక్కుదినంబులు రాక్షసకులంబు రక్షింపు మవ్విభుండు మనంబునం దలంచెనేని మన మెల్ల నశియించుట నిక్కంబు గావున. 201

ఆ. నీకు హితములుగను నేను బల్కినపల్కు, లాదరించి హరి పరాత్మునందు
వైరబుద్ధి మాను మారఘుపుత్త్రుండు, పరమకారుణికుఁడు భక్తివలన. 202

వ. అదియునుం గాక మునివాక్యంబులవలన నిక్కార్యం బశేషంబు నెఱింగినవాఁడ నెట్లనినఁ దొల్లిటియుగంబునఁ బరమేశ్వరుండగు హరి బ్రహ్మదేవుచేత నర్చితుండై నీ కిద్ది యీప్సితంబు దాని నొనరించెద ననిన నాచతురాననువలన నరవిందలోచన! మహాప్రభూ! నీవు భూతలంబున మానుషదేహంబున దశరథాత్మజభావంబు నొంది తడవుసేయక లోకకంటకుండగు దశకంఠుం బరిమార్పు మనుచుఁ బల్కంబడి యున్నాఁడు. 203

శా. మాయామానుషమూర్తిచేత మనలన్ మర్దింప నారాయణుం
డీయారణ్యమహీతలంబునకు నేఁ డేతెంచె నిక్కంబు తం
డ్రీ! యీమాటలు నమ్మి యుల్లమని మారీచుండు పల్కంగ దై
తేయాధీశుఁడు మించుకోపమున సందీప్తాత్ముఁడై యిట్లనున్. 204

క. ననుఁ ద్రుంపఁగఁ బరమాత్మయ, వనజజుచేఁ బ్రార్థనంబు వడసి మనుజుఁడై
వసుపడిన నేల విడుమను. ఘనతరబాణముల మేను ఖండింప కిలన్. 205

వ. కావున నతిప్రయత్నంబున. 206

ఆ. అవనితనయఁ దెత్తు నవ్విభుచే నీల్గి, పరమపదముఁ గాంతు వెరవ కీవు
మృగము వగుచు నతని మృగశాబకాక్షి నా, కందఁజేసి సుఖము నందియుండు.

వ. అటుగాక యాహవంబున నారామచంద్రు నేన జయించితినేని నిర్భయుండనై జానకిం గైకొందు మఱియు నియ్యెడ. 208

ఆ. అద్ద మాడవలవ దగు సత్యసంకల్పుఁ, డీశ్వరుండు విష్ణు మేల కలుగు
నమ్మహానుభావుఁ డాత్మఁ దలంచిన, కార్యమునకు వేగఁ గదలు మిపుడు. 209

వ. వెడలి నీవును జిత్రమృగరూపధరుండవై యాశ్రమంబున కతిదూరంబుగ సలక్ష్మణుండగు రాఘవుం గొనిపోయి విడిచి పూర్వప్రకారంబున సుఖంబుండు మియ్యెడ నెయ్యదియైన నించుక నాకు భయంబు గలుగునట్లు పలికితివయేని యీసమయంబున నిన్నీకరవాలంబుచేత నఱికివైచెద నిస్సంశయం బనిన మారీచుండును దద్వాక్యంబు లాకర్ణించి తనమనంబున నిట్లని చింతించె. 210

తే. మించి నను రాఘవుఁడు సంహరించె నేని, యపుడ ముక్తుండ నౌదు భవార్ణవమున

నటులఁ గాకున్నఁ బలుకష్టుఁడైన వీని, చేతఁ జచ్చిన నిరయంబు సిద్ధమనుచు. 211

వ. రామచంద్రునిచేతన మరణంబు నిశ్చయించుకొని వేగంబ లేచి రావణుం గనుంగొని లంకేశ్వరా! నీయాజ్ఞ యొనరించువాఁడ ననుచుఁ బలికి యంత యరదం బెక్కి రామాశ్రమాభిముఖుండై చను దూరంబున. 212

## మారీచుఁడు మృగరూపంబున సీతకు గనపడుట.

సీ. జాంబూనదంబుతో సరియైన దేహంబునందుఁ దెల్లనిరౌప్యబిందుకలును
మణిఖురంబులు నీలమాణిక్యనయనముల్ సద్రత్నతుల్యవిషాణములును
ముద్దుగులుకెడు పిన్నమొగమును మెఱుపులగమి మించు తనుకాంతి నమరి సీత
కనుపడునట్లు మాయామృగాకారుఁడై యవ్విపినంబున నాఖులుండు

ఆ. నిలుచు నురుకునటులు నిటులుగంతులువైచుఁ, బారిగఁ జుచు బెదరుఁ బొంచు దుముకు
మఱియుఁ దత్స్వభావమార్గముల్ చూపుచు, భ్రాంతిపఱచె రాముకాంత నపుడు.

క. అనుచు మహాదేవుఁడు మా, వనిత కెఱింగించె లోకపావనమగు రా
మునిచరిత మఖిలమునిజీ, వన గంగాజనకచరణ వైభవరంగా. 214

వ. మరల నిశాకరకళావతంసుం డగేంద్రనందనతోడ నిట్లనియె రావణచేష్టితం బిట్టిద గువేళ రామచంద్రుండును. 215

ఉ. ఆవిధ మంతయుం దెలిసి యయ్యవనీసుతతోడ నిట్లనెన్
ఓవనజాక్షి పక్తిముఖుఁ డొయ్యన భిక్షునిభంగి రాఁగలం
డీవును నీస్వరూపముగ నిచ్చట ఛాయను డించి భక్తిచేఁ
బావకునందు నిల్వు మొకవత్సరకాలము నంతమీఁదటన్. 216

వ. కల్యాణీ! రావణవధానంతరంబునఁ బూర్వోక్తప్రకారంబుగ నన్నుం జెందెద వని పలికిన. 217

క. విని రామోక్తక్రమమున, నొనరించి హుతాశునందు నొగి లీయం బ
య్యెను నట మాయాసీతయుఁ, గనుఁగొనియెఁ గురంగశాబకం బతివేడ్కన్. 218

వ. ఇటుల మాయాకల్పితంబగు నామృగంబు నిరీక్షించి నవ్వుకొనుచు రామచంద్రుం గదిసి వినయాన్వితయయి యిట్లనియె. 219

చ. కనుఁగొను రామచంద్ర! యదె కాంచనరత్నకురంగశాబకం
బనువుగ సంచరించెను దయామతి నన్ గరుణింతు వేనిఁ జ
య్యన నది తోడితెమ్ము నిసనమ్ములు విల్లును బూని యేఁగుచో
ననుజునితోడ నిట్లనియె నాదశకంధరవైరి పార్వతీ!. 220

వ. లక్ష్మణా! నీ విక్కడ నేమఱక సాధ్వియు ననిందితయును మత్ప్రాణవల్లభయు

నగు సీత నతిప్రయత్నంబునం గాచియుండుము మాయావంతులును ఘోరరూపు
లును నగుచు నివ్విపినంబున. 221

తే. కలరు రాక్షసు లతిఘోరకర్మశాత్ము, లనిన నోయన్న! నీ వేమి యాజ్ఞనట్లు
చనఁదలంతువు వీఁడు రాక్షసుఁడు మృగశ, రీర మూనె నిజంబు మారీచుఁ డిచట.

వ. కాదేని యిట్టివిచిత్రరూపంబు సాధారణమృగంబుల కెవ్విధంబున సంభవించు ననిన

క. మారీచుఁ డైనఁ ద్రుంచెదఁ. గూరిమి సారంగ మైనఁ గొనివచ్చెద నం
భోరుహలోచన కిచ్చెద, ధీరత నిలు మనుచు రాము దేవుం డంతన్. 224

వ. లోకమోహినియును జగత్స్వరూపిణి యగు మాయ యేవిభు ననుసరించి యుండు
నట్టి నిర్వికారుండును జిదాత్మయుఁ బూర్ణుండును నయ్యు మాయామృగంబునకు
వెనుదగిలె నట్లగుట కెయ్యది హేతు వనిన భక్తులయం దనుకంపాసహితుండు భగ
వంతుం డను వచనంబు సత్యంబు సేయ నది మాయ యని యెఱింగియు సీతాప్రి
యార్థం బా శ్రీహరి మృగయావ్యాసంబు వహించె నట్లుంగాక మఱియొండువిధం
బయినఁ బూర్ణకాముఁడు విదితాత్ముఁడు పరమాత్మయు నగు రామచంద్రునకు
మృగంబుతోడుతను స్వప్రియ యగు సీతతోడుతయుం బనియేమి యివ్విధంబున.

సీ. తొడరి యైంద్రశరాసతుల్యమౌ బాణాసనముఁ బూని యారఘునందనుండు
వెనుదగులఁగ మృగంబును నటునిటుఁబోవు నిలుచు నిత్తెఱఁగున నిలువనీక
నడవు లనేకముల్ గడచిపోవఁగ నిజంబుగ రక్కసుండని బుద్ధిఁ దెలసి
సాగ్రహంబున నొక్కయంబకంబు బఱపింప వాఁడును దల రెండు వ్రయ్య లగుచు

తే. నోయి! లక్ష్మణ! పలుబాహుయుగళ గూలి, పోయితిని గావుమోయి! రావోయి! యనుచు
రాముగతిఁ గూసి యమ్మహారణ్యమందుఁ, బడియెఁ దొంటినిశాటరూపంబుతోడ.

వ. అప్పుడు. 227

మ. అవనిన్ బంచమహాఘవంతుఁడును దేహత్యాగకాలంబునం
దెవనిన్ నోట వచించి తత్సదృశుఁడై యేపారు నాజానకీ
ధవు నీక్షింపుచుఁ దచ్ఛరాళిహతుఁడౌ దైత్యుండు తద్రూపవై
భవముం జెందుట చిత్రమే మదిఁదలంపన్ బర్వచంద్రాననా! 228

తే. అట్లుగావున వానిదేహంబునందు, నుండి జగమెల్ల నీక్షింపుచుండ రాము
నందుఁ జొచ్చె మహత్తరమైన తేజ, మొకటి యమరులు విస్మయ మొంది రపుడు.

వ. మఱియు నవ్విబుధులు తమమనంబుల. 230

సీ. ఏమి యొనర్చె వీఁడేమిఫలం బందె బహుపాతకియు మునిభక్షకుండు
నైన దీనికి విస్మయం బందఁగాదు రామప్రభావం బీక్రమంబు నిక్క

మెట్లన్న వీఁడు మున్నీ రాఘవునిచేత శరతాడితాంగుఁడై సంస్మరించు
కొనుచు మహాభయంబున గృహవిత్తాదికం బెల్ల విడి హృదయంబునందు

తే. నంచితధ్యానమున రాము నుంచి విగత, సకలకల్మషుఁడై యంత్యసమయమందు
రాముఁజూచుచు రాముచే నావిగాము, నందుఁ జొచ్చెను సంతతానందుఁడగుచు.

వ. కావున. 232

ఆ. బ్రహ్మకులజుఁడైన రాక్షసుండైనను, పాపి యైన ధర్మవాపి యైనఁ
గానలేఁడుఁ దలఁచి కాయంబు విడిచెనా, తత్పదంబుఁ జెందుఁ దథ్య మిదియు.

వ. అనుచుఁ దమలోన సంభాషించుకొనుచు దేవతలు దివంబునకుం జని రంత రామచం
ద్రుండును నిజస్వాంతంబున వితర్కించె నియ్యసురాధముండు మ్రియమాణుండగు
వేళ నూరకుండక హాలక్ష్మణా! యనుచు దుర్వాక్యంబు మొఱఁగి యొకరగె నదియు
మద్వాక్యసదృశంబు గావునఁ జెవులం బడిన జనకినందన యేమగునో యనుచుఁ
జింతాపరీతాత్ముండై దూరంబుననుండి మరలె నప్పుడు దురాత్ముఁడగు మారీచుండు
పల్కినవాక్యంబును బర్ణశాలాప్రదేశంబున. 234

చ. విని మిథిలేశపుత్త్రి యతివిహ్వలయై వెత నొంది లక్ష్మణుం
గని వడి నేఁగు లక్ష్మణ! వనంబున దైత్యునిచేతఁ బీడనొం
దెను భవదగ్రజుండు చనుదేరదె లక్ష్మణ! యంచు నిన్నుఁ బి
ల్చెను వినలేవొ శీఘ్రముగ లెమ్ము సహాయివిగమ్ము యన్నకున్. 235

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 236

తే. దేవి! యది రాఘవుసెలుంగుతీరు గాదు, నిక్క మెవ్వఁడో యొకయామినీచరుండు
మరణకాలంబునం దట్లు మొఱఁగి నమనె, రాముఁడేమి మొఱలుంగుట లేమి వింత.

ఆ. అమ్మహానుభావుఁ డాగ్రహించిన నిమి, షంబులోన జగంబులెల్ల
సమయఁజేయఁ జాలు సాధ్వి యవ్విభుఁ డెట్లు, దీనవచన మాడఁబూను నోటు.

## లక్ష్మణుని సీత కఠినోక్తులు పలుకుట.

వ. అనిన జానకియుఁ గన్నుల బాష్పకణంబులు దొరఁగఁ గోపంబున లక్ష్మణుం గనుం
గొని యోరి! దుర్బుద్ధి! లక్ష్మణా! రామనాశాభికాంక్షుండవగు భరతునిచేతం బ్రేరి
తుండవై నీవును నన్నుఁ జావుఁగోరుచు రామచంద్రుండు నశియించినవెనుక నన్నుం
గొనిపోవుటకునై వెనుతగిలి సేవకుచందంబున నున్నవాఁడ వయ్యెదవో స్వభార్యా
హరణోద్యుక్తుండవగు నిన్నెన్నండును నారాఘవుం డెఱుంగఁడయ్యె నైనను. 239

క. కానిమ్ము రాఘవాన్యుని, నే నంటెద నే దురాత్మ! నిన్నైనను నిక్
బైనము చేసిన భరతుని, నైనను నీతోడుఁ గాక యట్లగునే నిక్. 240

వ. అనుచుఁ గరంబు లెత్తి యాననంబు మోఁదుకొనుచు రోదనంబు సేయుచుం దొడంగిన
నమ్మాటలు విని లక్ష్మణుండును గర్ణంబులు మూసికొని జాలిదుఃఖితుండై నన్ను నిత్తె
ఱంగునం బలికితివి గావునఁ జండీ! నిన్నుం గాల్పక నాశంబు నొందంగల వనుచుఁ
బలికి యమ్మహావనంబున నలుదిక్కులం బరికించి 241

క. వనదేవతలారా! కనుఁ, గొనరమ్మా దోస మెఱుఁగఁ దూరితవచనముల్
గని పల్కినైన మీ రి, వ్వనితను గాపాడుఁ డనుచు వగపున నపుడున్. 242

వ. రామచంద్రున కెదురుగ మెల్ల మెల్లన చనుచుండె నది సందుచేసుకొని దండకమం
డలుధరుండై. 243

క. ఆసమయంబున భిక్షువు, వేసమున దశాననుండు వెసఁ జనుదేరన్
భూనుత పూజ యొనర్చి సు, ఖాసన మిడి మధురఫలము లర్పించి తగన్. 244

ఆ. విశ్రమింపుఁ డిచట వేగంబ మత్ప్రభుఁ, డేఁగుదెంచుఁ దావకేప్సితంబు
లొసఁగు నన దశాస్యుఁ డొకకొన్ని యద్దేవి, పలుకు లాలకించి తలఁపుతోడ. 245

మ. వనితా! యెవ్వరిదాన వీవు విభుఁ డెవ్వం డీవనాంతంబునన్
దనుజావాసమునం జరించెదవు నీతత్త్వం బెఱుంగింపు మొ
య్యన సాకల్యముగాఁగ నంత విని నాదౌ వాస్తవం బెల్ల నీ
కును విస్తారము సేతు నన్న మది నక్రూరాత్ముఁగా నెన్నుచున్. 246

వ. ఇమ్మానితోడం బల్కినఁ బ్రత్యవాయం బేమి యనుచు సీతాసతి యిట్లనియె. 247

సీ. యమివర్య! వినుము మహాత్ముండు శ్రీమంతుఁ డలరు నయోధ్యాపురాధిపుండు
దశరథుం డనుమేటి ధరణీశుఁ డమ్మహానాథుని కగ్రనందనుఁడు రామ
చంద్రాభిధానుండు సర్వలక్షణలక్షితుం డేను నమ్మహాత్మునకు ధర్మ
పత్నిని జనకభూపాలనందనను సుదాఖ్యసీత యనంగ నలరు సతిని

తే. కనుఁగుఁదమ్ముఁడు లక్ష్మణుం డనఁగ భ్రాతృ, వత్సలుం డొప్పు నమ్మహీవరుఁడు తండ్రి
యాజ్ఞఁ దల నిడి యీదండకాటవికిని, వచ్చినారు నితాంతప్రనాను లగుచు

వ. పదునాలుగేఁడులు నిలుచువారలింక భవద్వృత్తాంతం బెఱుంగ నానతిం డనిన
నప్పౌలస్త్యుం డప్పతివ్రతాతిలకంబుతోడ నిట్లనియె 249

ఉ. ఏ దశకంధరుండ దనుజేశుఁడ వైశ్రవణుండ నిప్పుడున్
మోదముతోడ నీపయిని మోహము నాఁగఁగలేక వచ్చితిన్
నాదగు భార్యవై వనములన్ గల దుఃఖముఁ బాయు మానిమ
న్యాదల నిల్చు రాముఁ గవయన్ సుఖ మేమి శుభాంగి! నీ కిటన్. 250

వ. నన్నుం గూడి యఖిలభోగంబు లనుభవింపు మనిన వైదేహియు నమ్మాటలు విని
భయంబు నొంది యొక్కించుక యిట్లనియె. 251

చ. దనుజ! కృతఘ్న! గ్రుంగుటకుఁ దల్చెదొ రాఘవసాయకానలం
బున శలభంబుమాడ్కి సురపుంగవుమానిని బోలె నొండొరుల్
వనుఁ దనువంటనేర్తురె తక్షణం బిట నిల్వకు భానువంశవ
ర్ధనుఁడు సుతీక్ష్ణుండగుచుం దాఁకి నినుఁ బడవైచు భూస్థలిన్. 252

వ. ఇవ్విధంబున నన్నుం బల్కెదవేని నీవును శీఘ్రంబ రామసాయకంబులవలన విభి
న్నుండవై మేదినిం గూలంగల వనిన రావణుండు సీతావచనంబులు విని క్రోధ
మూర్ఛితుండై పదితలలును నిరువదికరంబులునుం గలుగు మహాపర్వత సన్నిభంబగు
నిజస్వరూపంబు గనుపఱచి. 253

తే. కాలమేఘంబొకో యనఁ గనుల కెఱుట, నిలువ నిలువంగలేక భూస్థలిని వ్రాలె
జనకనందన యంత రాక్షసుఁడు ధరణి, నాత్మనఖములఁ బెకలించి యతిరయమున.

వ. కదల్చి బాహువుల నెత్తుకొని తనయరదంబునకుం బఱచి యందు. 255

క. జలజాక్షి సత్సఖీమణిఁ, గలకంఠి సుమధ్యఁ బఙ్క్తికంధరుఁ డప్పుడున్
నిలిపి పయోధరపథమున కలవడి నిజరథముఁ దోలి యవలీలఁ జనెన్. 256

వ. ఇట్లు మహావేగంబున లంకాభిముఖుండై యరుగువేళఁ బరమసాధ్వియగు నవ్వైదే
హియుఁ గడుభయంబు నొంది యయ్యరణ్యం బంతయు నవలోకించుచు దీనవదన
యై హాహాకారంబులు సేయుచు సకలలోకనాయకుండగు నిజనాయకు నుద్దేశించి.

### రావణుని జటాయువు వడ్డగించుట.

సీ. హా రామ! రామ! దైత్యాధముం డిట్టు నన్నుఁ గొనిపోవఁగను గనుంగొన వదేమి
యని విలపింప నయ్యాక్రందనంబును విని జటాయువు రోషవివశుఁ డగుచు
నోరి నిశాట! నీపాలుట యెచటికి నాముందఱను లోకనాథుఁడైన
యారామచంద్రుభార్యను వారు లేకున్న యపుడు బల్దొంగవై యపహరించి

ఆ. యాధికమంత్రపూతమైన పురోడాశ, మధ్వరమున శునక మపహరించు
కరణిఁ బోకు పోకు పరిమార్తునని యగ, శ్యంగసంగతుఁడు విహంగముండు. 258

ఉ. తాఁకె నిశాతతుండమునఁ దద్రథ మెల్లను నుగ్గునుగ్గుగా
వీఁక నొసర్చి యద్దనుజవింశతిబాహువులన్ బదంబులన్
వేకదలంగఁ దన్ను నవివేకత వాఁడును బోక కాలద
ర్వీకరరోష మొప్ప నెదిరించె రథం బటు త్రిప్పి యుద్ధతిన్. 259

ఉ. భూసుత డించి ఖడ్గ మొగిఁ బూని తదుజ్జ్వలపక్షయుగ్మమున్
భాసురలీలఁ ద్రుంప గతపక్షధరాధరమట్లుఁ గూలె నా
భాసురబుద్ధిమంతుఁడగు పక్షికులేంద్రుఁడు ప్రాణమాత్రుఁడై

యాసురవైరియుఁ మఱల నన్యరథంబున నెక్కి నిల్వకన్. 260

వ. రక్షించువారు లేక రామ రామా! యనుచు దుఃఖింపుచున్న జనకతనయం గొని
పత్త్రరథంబునం జనియె నాసమయంబున నప్పక్షిం దర్శనియును. 261

తే. హా జగన్నాథ! హా రామ! హా సమస్త, లోకపాలన! నను గొని యీక దనుజుఁ
డరుగుచున్నాఁడు నేను నీయట్టి విభునిఁ, గలిగియు ననాథగతి నిట్లు నిలువవలసె.

తే. చూడకున్నాఁడ వీరాక్షసునకుఁ జిక్కి, చాల దుఃఖించు నన్ను భూపాలతిలక
రాక్షసునిచేత నపహృతురాలనైన, ధర్మపత్నిని విడిపింప ధర్మమయ్య!. 263

వ. అనుచు సౌమిత్రిం దలంచి. 264

తే. ఓమహాభాగ! లక్ష్మణ! యోగుణాఢ్య!, నీవు నా చేతవాక్ఛరనిహతి నొంది
తైన నియ్యెడ రక్షించు టర్హ మని తలంపు నాతప్పు లెల్ల మన్నింపు మఱఁది.

సీ. అనుచు దుఃఖింపంగ నద్దశాస్యుండును రామాగమనశంకచే మనస్స
మానవేగంబున మైథిలిఁ గొని విహాయసమునఁ బఱవ రామాంగనయును
గ్రిందఁ జూచి గిరీంద్రముం దైగుగుచు వానరోత్తము లుండ నిజోత్తరీయ
మర్ధఖండము చేసి యాభరణాదికం బంగఁ జుట్టి మదీశుఁడైన రాఘ

తే. వునకు నెఱిఁగించువారుగావుత మటంచు, వారినడుమను వైచె రావణుఁడు నంతఁ
దనప్రయత్నంబు నిర్విఘ్నతను వహించె,ననుచు నుప్పొంగి యవ్విహాయసమువలన.

తే. ఉదధి లంఘించి లంక కింపొదవ నేఁగి, యట నశోకవనంబున నతిరహస్య
దేశమున నుంచి రాక్షసస్త్రీల మాత్ర, భావ మెఱుపంగఁ బాలింపఁబనిచె నపుడు.

తే. భూమినందనయును గృశీభూత యగుచు, మాటిమాటికి రామ! రామా! యటంచుఁ
జాల దుఃఖంబునను మోముఁ జందురుండు, గందు గన నిల్చె రాక్షసీబృందమందు.

వ. మఱియును. 269

క. అతిదీనయుఁ బరికర్మక, హితయును నతివిహ్వలాతిహితయై మిథిలా
పతిమాఁతు నిలిచె నని తన, సతితోడుతఁ జంద్రమౌళి సంభాషించెన్. 270

వ. అనుచు మఱల భగవంతుండగు మహాదేవుండు శైలకన్య నవలోకించి యిట్లనియె
నంత నిచ్చట రామచంద్రుండును మాయావియుఁ గామరూపధరుండును నగు
రాక్షసుని సంహరించి నిజాశ్రమంబు చేరుటకు మరలి ముందు దూరంబుననుండి
యతిదీనవదనుండయి మొగంబు గంద నరుదెంచు లక్ష్మణుం గనుంగొని మహామతి
యగు రాఘవనందనుండు తనచిత్తంబున నిట్లని తలంచె. 271

చ. ఇతఁ డిటు మాయసీత నొకయింత యెఱుంగఁడు మత్కృతంబు ప్రా
కృతుఁడును బోలె సీతని శోకించుక వంచనసేయు దుఃఖసం
యుతగతిఁ గాంతు నిత్తెఱఁగు నొందక యింట విరక్తి నుండినన్
హతమగు నెట్లు ఘోరమనుజాశనకోటు లిలాతలంబునన్. 272

వ. కావునఁ గాముకుం డెట్లు విలపించు నట్లు లేనును దుఃఖసంతప్తుండ నయి విలపిం
చితినేని యందఱుఁ గ్రమంబున దుఃఖించెద రంత ననురాలయంబునకు సీతం
బనిచి 273

క. సమలంబుగ రావణు నం, తకనికటస్థునిఁగఁ జేసి ధరణీసుత మా
మకకల్పితాగ్నిమందిర, నకుటిలగతిఁ గొని యయోధ్య కనుగమనింతున్. 274

వ. ఏనును. 275

క. వనజజుఁడు వేఁడ నుదయిం, చిన నాఁడ మనుష్యతనువుచే నిలఁబెఁ గా
వునఁ గొంతకాల మిత్తెఱఁగున నుండెద నెవ్వరైనఁ గోరినభక్తిన్. 276

వ. ఇట్టిమాయామనుష్యుండనయిన నాదుచరితంబులు వినిరేని వినిపించిరేని దాఢ్యభ
క్తిమార్గానువర్తులకప్రయత్నంబున ముక్తి సిద్ధించు ననుచు నిశ్చయించి చనుదెంచు
లక్ష్మణుం గనుంగొని యిట్లనియె. 277

తే. ఘోరకాననమున నాదుకూర్మిగరిత, నేల విడివచ్చితివి రాక్షసాలిచేత
నాజనకపుత్త్రి యింతకు భోజనమున, కపహృతప్రాణ గాకున్నె యనిన నపుడు.

వ. పరమాత్ముఁ డగు నారామచంద్రుని భాషణంబులు విని లక్ష్మణుండును బాష్పాకులి
తేక్షణుండై భక్తిపలవ శిరంబు వంచి నమస్కరించి కరంబులు మొగిడ్చి యిట్ల
నియె. 279

చ. దనుజుఁడు మీరెలుంగు క్రియఁ దా మొఱఁగన్ విని మిమ్ముఁ గూడఁ బో
మ్మనుచును నన్నుఁ బల్కె విను మన్నయెలుం గది గాదటంచు నే
నును బహుభంగులం దెలుప నొచ్చుచు నానన మెల్ల మోఁదుకొం
చనినతెఱంగు మీసముఖమందు నవాచ్యము రాఘవేశ్వరా!. 280

వ. ఏనును గర్ణంబులు మూసికొని యచ్చట వెడలి నిన్నుం గనుంగొన వచ్చితి ననిన
మిక్కిలి యనుచితంబు సేయంబడె ననుచు రామచంద్రుం డిట్లనియె. 281

లక్ష్మణుఁడు పర్ణశాలలో సీతనువిడిచి వచ్చుటకు రాముఁడు దుఃఖించుట.

మ. చనునే యొంటిగ డించి వచ్చుట మహీజ న్నీకు ఘోరాటవిన్
వనితాబుద్ధి యెఱుంగవే యకట! యవ్వామాక్షి యేమయ్యెనో
యనుచున్ దుఃఖముతోడుతన్ మరలి దైత్యా! యిట్లు నందెచ్చితే
యనుచున్ స్వాశ్రమభూమిఁ జేరి యటకన్యన్ లోకమాన్యుం డగన్. 282

వ. కనుంగొనం జాలక చాల విలపించుచు సీతాసతిం దలంచి. 283

తే. ఎచటి కేఁగినదానవో యిందువదన!, తొంటిగతిఁ బర్ణశాలయం దుంట మాని
గాక నను మోహకలితునిగా నొనర్ప, లీల డాఁగితివో వనశైలములను. 284

వ. అనుచుఁ జింతింపుచు బహుభంగులం బలుకుచు నెచ్చటనుం గనుంగొన నోపక 285

సీ. గహనదేవతలార! కానరే మీరైన నెందుండు నేఁడు రాకేందువదన
మృగపక్షివృక్షపన్నగసమూహములార! మత్ప్రియాంగనపోక పలుకఁగదరె
యనుచు నెమ్మదిలోన నమ్మానిని దలంచి యోసీత యోబాల! యోసుమధ్య!
యో ప్రాణవల్లభ! యోకుందరదన! యోచంద్రాభవదన! యోజాతరూప

తే. వర్ణబింబాధర! సుమధ్య! వనజనయన!, రత్నమయకుండల! యటంచు రావదేమి
యనుచు సర్వజ్ఞుఁడయ్యు రామావనీశుఁ, డెఱుఁగనట్టుల వెదకె నయ్యిందుముఖిని.

వ. వెండియు సర్వదృశుండును సర్వవ్యాపకుండును మహానందమయుండును దుఃఖావి
షయుండును నిష్కలుండును నిరహంకారుండును నిత్యానందుండును నయ్యు. 287

క. "హా సీతే! హా బాలే!, నా క్వగతాసి" యనుచు "ననుజ" యనుచుఁ దా
నాసక్తి లేక యుండియు నాసక్తునిభంగిఁ దిరిగె నతిదుఃఖితుఁడై 288

వ. ఇట్లు మాయామయుండై జనించినకతన నద్దాశరథియును. 289

తే. ఆఁపఁజాలని చింత నయ్యడవియందు, సక్తుఁడునుబోలె దిరిగె విరక్తుఁడయ్యు
మూఢులకుఁ దోఁచునిబ్భంగి మొనసితత్త్వ, విదులకెఱుఁగంగఁబడగుతద్విధము తరుణి.

వ. ఇవ్విధంబున లక్ష్మణుతోడుత రామచంద్రుం డవ్విపినంబున నాత్మసతి నన్వేషిం
పుచుం జని చని. 291

క. ఒకచోట విఱిగి కూలిన, ప్రకటశరాసరథకూబరంబులు గని పా
దకమలధౌతమహీపా, తకుఁ డగు సీతావిభుండు తమ్మునితోడన్. 292

చ. కనుఁగొని వీఁడు భూతనయఁ గైకొనిపోవఁగ వీనిఁ గూల్చి తాఁ
గొని చనె నొండొకం డనుచుఁ గొంతసమీపముఁ జేరి శోణితం
బునఁ దనువెల్లఁ గ్రుంగి ధర మూర్ఛితుఁ డౌ విహగేంద్రుఁ గాంచి ల
క్ష్మణ ధరణీజ మ్రింగి చనఁ జాలక నిల్చెను వీఁడె కంటివే. 293

వ. వొసలోన నమ్ములు దీసి 294

ఉ. తెమ్ము శరాసనమ్ముఁ గడతేర్తు ననన్ ఒకయించుకంతవా
క్యమ్ముఁ దెమల్చి యోదశరథాధిపనందన నీస్వకార్యముం
దిమ్మెయి నైతి బాణమున నేయకు నన్ను జటాయువండ్రు జీ
వమ్మున నుంటి నిచ్చట భవత్సతి వార్తవ మెల్లఁ బల్కఁగన్. 295

క. కొనిచనియె రావణుం డను, దనుజుఁడు పోవంగనీక తలపడి యేనున్
వినువీథిఁ బోర వాఁడా, సనరథభుజశాఖ లెల్లఁ జక్కాడి తుదిన్. 296

ఆ. తత్కరాసిచేత దళితపక్షుండనై, పడితి నిపుడు నీదుపాదదర్శ
నంబు దొరకె నతివిధంబును బల్కితి, నింక నిలువఁజాల నేను రామ!. 297

వ. జగన్నాయకా! కనుంగొనుము ప్రాణంబులు పరిత్యజించెద ననినఁ గంఠగతప్రాణుండును దీనుండును నగుచు నవ్విహంగపుంగవుం గాంచి రామచంద్రుండును మిగుల దుఃఖంబున వెడలు కన్నీటికాలువలు నిజదేహనీలశైలంబునం బ్రవహింప దానివహామంగళాకరంబులగు తనకరంబుల సంస్పృశించి యిట్లనియెఁ. పక్షిసత్తమా! శుభానన యగు నాదుభార్య నెవ్వండు గొనిచనియె సవిస్తరంబుగఁ దద్వృత్తాంతంబు మాకెఱింగింపు మక్కార్యంబుకొఱకు నీవు నిహతుండవైతివి గావున నాకుఁ బ్రియబాంధవుండ వగుదు వనిన జటాయువు వదనంబున రుధిరంబుఁ గ్రక్కుచు గద్గదస్వరంబున నిట్లనియె. 298

ఆ. భీమవిక్రముండు రామ! రావణుఁడను, రక్కసుండు జనకరాజతనయఁ
దనరథమున నునిచి దక్షిణాంబుధిత్రోవఁ, బఱచె నింకమీఁదఁ బలుకఁజాల. 299

వ. నీముందఱ ప్రాణంబులు విడిచెదం గైకొనుము నేఁ డంత్యకాలంబు సమీపించిన నాకు దైవయోగంబునఁ బాపగహితుండవైన నీవు దర్శనం బొసంగితి వింకఁ బరమాత్మవు విష్ణుండవు మాయామానుషశరీరుండవు గావున నేతాదృశమహాజనభాగధేయుండవగు నిన్నుం బ్రాణప్రయాణకాలంబున నీక్షించుటవలన భవభయముక్తుండనైతి నసంశయంబు రఘుసత్తమా! రామా! సంతతకల్యాణకరంబులగు భవత్కరంబుల మరల నన్ను సంస్పృశింపుము పరమపదంబునకుం జనియెద ననినఁ బరమదయాస్వాంతుండగు సీతాకాంతుండును బెద్దతడవు విస్మయంబు నొంది యవ్విధంబు సేతు ననుచుఁ దనకరంబున నతనికరంబు సంస్పృశించె జటాయువును బ్రాణంబులం బాసి భూతలంబునం బడియె నంత. 300

సీ. దాశరథియుఁ దద్విధంబున కెంతొ బాంధవుభంగి మిగుల సంతాప మొంది
కనుల బాష్పజలంబు గ్రమ్మ దేరఁగ లక్ష్మణునిచేత వలయునింధనచయంబుఁ
దెప్పించి యప్పక్షిదేహంబును వహించి జలమునఁ గ్రుంకి చింతించు నమ్మ
హావనంబునఁ దనయనుజాతో నొకమృగంబును వైచి దాని ఖండనముచేసి

తే. గఱికచే మినిమిగలిగిన మెరకభూమి, యందు వేర్వేఱఁ బరిపరిచందములుగ
మాంసఖండంబు లునిచి సమస్తపక్షి, గణము కిడఁదృప్తుఁ డగుఁ గాక ఖగవిభుండు.

వ. మఱియును సకలలోకంబులు గనుంగొనుచుండ మత్సాయుజ్యపదం బీజటాయువునకుఁ బ్రాపించుంగాక యని యానతిచ్చిన నప్పు డవ్విహంగపుంగవుండు. 302

మ. పరమార్తాండశతాభమై వెలయుదివ్యస్యందనం బెక్కి శం
ఖరథాంగాబ్జశరాసహస్తుఁ డగుచుం గంధర్వరూపాఢ్యుఁడై
హరిభృత్యుల్ ఇరువంకలందు నసమాన్యప్రక్రియన్ గొల్వ నా
ఖరవిధ్వంసనమునంగటన్ నిలిచె లోకం బెల్ల వీక్షం గనన్. 303

వ. ఇట్లు కిరీటహారభూషణంబును బీతాంబరకలితంబును నమలంబును నగు దివ్యరూపంబు ధరియించి మునిగణస్తూయమానుండై రాఘవుం జేరవచ్చి సంతసింపుచుఁ గృతాంజలిపుటుండై యిట్లని వినుతింపం దొడంగె. 304

## శ్రీరాముని జటాయువు స్తుతియించుట.

ఉ. ఓరఘువంశనాథ! జగదుద్భవసంక్షయహేతుభూత! ల
క్ష్మీరమణీకటాక్షహృత! మేఖలయజ్ఞజముఖ్య! దుఃఖసం
సారపయోధితారణలసత్స్వపదాంబుజపోత! భోగిరా
డ్హారవిభూషణాద్రివరజాహృదయాలయ నీకు మ్రొక్కెదన్. 305

సీ. అవికృతభవభవనాతిదూర! భవాతిదూరమానసమునిస్తూయమాన!
సితజలరుహనేత్ర! స్మితరుచిరవికాసితాననాబ్జ! సకాయకాంబకాశ!
సురుచిరశతకోటిసుందర! యతినాథ చిత్తాలాంతఃపద్మనిత్యసదన!
శతపథగోచర! సద్భావనాదూర! రఘుపతిమూర్తిధర! సురవరద!

ఆ. యగణితగుణ! మందరాచలధర! వేద, సులభ! యప్రధృష్యసుఖ! సురేంద్ర
వినుతిపాత్ర! భువనవిశ్రుత! నీ కిదె, వందనంబు మోదమున రామ!. 306

క. త్రిభువనకమనీయాకృతి, నభయదుఁడవు గురువులకును నాదిగురుఁడవై
యిభరాజవరద! నీ విలఁ, బ్రభవించితి యమరనాథు ప్రార్థనకతనన్. 307

ఉ. దానవదేవమానవనతస్వపదాంబుజ! యాప్రమేయ! సం
తానమహీరుహాశ్రయ! కృతఘ్నవిదూర! పరాత్మభూతమా
నీ సనుతేంద్ర! నీలమణినీల! దినేశకులీనముఖ్య! చం
ద్రానన! రామభద్ర! కమలాప్తతనూభవ వాంఛితప్రదా!. 308

చ. పరఁగ మయూఖమాలి జలపాత్రలయందును దోఁచుమాడ్కి శం
కరవిధివిష్ణుభేదములఁ గన్పడె దీవు గుణప్రియుండవై
గురుతరమైన నీమహిమకుం గమలాసనముఖ్యులోడి యెం
డెలుఁగక వేదపాఠముల నెల్లప్పుడుం భజియింతురో హరీ!. 309

చ. అనుదినమున్ భజింతు వికచాంబురుహాయతనేత్రుఁ జారుచం
దనమిళితాంగుఁ జక్రధరనందకపద్మకరు న్నిరాత్మకాం

చనసవరత్నభూషణుఁ బ్రసన్నముఖాంబుజా ధర్మవస్త్ర స
జ్జనవనికావసంతు శుభసాధను నీలఘనాభదేహునిన్. 310

వ. అనుచు నివ్విధంబున నుతియింప నజ్జటాయువునకు రఘూత్తముండు ప్రసన్నుండై
పక్షివల్లభా! నీకు భద్రం బగు విష్ణుండనగు నాదు పరమపదంబునకుం జనుము. భూతి
లంబున. 311

తే. ఇంపుతోడుత నీస్తోత్ర మెవ్వఁడయిన, వినిన వ్రాసినఁ జదివిన విహగవర్య
ప్రాప్యు లగుదురు నాదుసారూప్యపదవి, నిజము మద్భక్తిఁ జెలువందు నీవపోలె.

క. అనిన జటాయువు రాఘవు, ఘనతరవాక్యముల కలరి కమలజముఖ్యుల్
వినుతించు పదవి నొందెను, వనితా! రఘునాథుకరుణ వశమే పలుకన్. 313

వ. అనుచుఁ దుహారాచలకన్యకతోడ శుభ్రాంశుమౌళి యవ్వలివృత్తాంతం బిట్లనియె
నంత రాఘవుండు సీతాన్వేషణతత్పరుండై మరల దుఃఖంబు నాశ్రయింప దుర్గ
మంబగు నవ్విపినాంతరంబున సంచరింపుచు నొక్కెడ నద్భుతాకారుండును
జతురాదివివర్జితుండును సర్వసత్త్వవిహింసకుండును నై యోజనంబు పొడవునఁ
గరంబులు సాఁచి మధ్యభూచరిష్ణుఁడగు తమ్ముఁ గబళింప గమకించు కబంధనామ
నిశాటుం గాంచి తోడ వచ్చు తమ్మున కిట్లనియె. 314

సీ. దానవుం డిదె సుమిత్రాపుత్త్ర! కంటివే యురమందు వదనంబు కరము లివియ
యురుదీర్ఘములు మధ్యఁ జరియించువారలఁ దినుచుండు మనము నేఁ డనువు దప్పి
చనుదెంచితిమి వేఱె చనుభంగిఁ గనుపింప దేమిసేయుదము వీఁ డిపుడు మ్రింగు
నన లక్ష్మణుం డిట్టు లనియెఁ జింతిలనేల తునుము వీనికరంబు ననిన ఖడ్గ

తే. మునను దక్షిణహస్తంబు దునిమివైచె, నట్ల రెండవకరముఁ జక్కడచె లక్ష్మ
ణుండు వాఁ డంతవిస్మితాత్ముండు మోద, భరితుఁడును నౌచు నిట్లని పలికెఁ జెలియ.

వ. అహహా! మద్బాహుహాననంబు చేసె నెవ్వండొ దివంబున నిలింపులలో వాఁడగు
ననిన రాజీవనయనుండగు రామచంద్రుం డిట్లనియె. 316

తే. విను మయోధ్యాఖ్యపట్టణమునకు మేటి, పుణ్యచరితుండు దశరథభూవరుండు
అవ్విభున కగ్రసుతుఁడ నే నగుదు రామ, నామధేయుండ లక్ష్మణనాముఁ డితఁడు.

వ. బుద్ధిమంతుండు నాకుఁ దమ్ముండు సీత మత్సతి జనకనందన త్రైలోక్యమోహిని
యేను సానుజుండనై మృగయావినోదార్థంబు వెడల నెవ్వండొ యొక్క యంతరం బపే
క్షించి మత్కాంతారత్నంబు గొని పలాయనుండయ్యె నంత నేమును దలోదరిం
గానక నిఖిలకాననంబులు వెదకుచు నీకరంబులం జిక్కి ప్రాణరక్షకుం దఱిగివైచి
తిమి. వికృతరూపంబుం దాల్చి యున్నవాఁడ వీవెవ్వండ వనినఁ గబంధుఁ డిట్ల
నియె. 318

### కబంధుఁడు తనశాపనిమిత్తము శ్రీరామునితోఁ జెప్పుట

సీ. ధన్యుండ నైతి సీతారామ! భవదీయచరణారవిందసందర్శనమున
మును రూపవిభ్రమమ్ముల నన్యనారీమనోహరుండను నౌచు నొరులచేత
వధ్యుండఁ గాకుండ వరము ఘోరతపంబునను మించి నీరజాసనుని వలనఁ
బడసి గంధర్వాధిపతినై చరింపుచు మహితు నష్టావక్రమౌనిఁ గాంచి
ఆ. నవ్వఁ గోపమునను నక్తంచరుఁడ గాఁగ, శాప మిచ్చి యేను సన్నుతింపఁ
గరుణఁ జేసి ముందు కమలాప్తకులమందు, దశరథునకు నగ్రతనయుఁ డగుచు. 319
వ. తనకుఁ దానై రామనామంబున 320
క. త్రేతాయుగమున హరిసం, జాతం బగునతఁడు నీభుజంబులు ద్రుంపన్
ఈతనువు వీడి గంధ, ర్వాతిశయుం బొదవు సౌఖ్యమగు నీ కనియెన్. 321
వ. తపంబున విభాసితప్రభుండగు నమ్మునివిభుండు ప్రసన్నుండై యిట్టిదుర్భరంబగు
శాపం బొసంగి యంతర్ధానంబు చేసె నేనును రాక్షసుండనై యుంటి నంత నొక్క
నాఁడు. 322
చ. హరిహయుఁ డేగుదేఁ గవయన్ నను వజ్రముఁ బూని వైవ వా
గ్వరునివరంబుచేత మృతిగానక కూయిడ దీర్ఘహస్తముల్
శిర ముదరంబునం గలుగఁ జేసిన నేనును నాఁటనుండి మ
త్కరయుగమధ్యభూస్థలిని గల్గు మృగాళి జనాళి ద్రుంచుచున్. 323
చ. తినుచును నుండ నీవు జగతీవర! నన్ గృపఁ జేసి నేఁడు మ
త్తనువు ఘనంబున న్నిలిపి దగ్ధ మొనర్పుమ యేను నంత నీ
వనితతెఱంగుఁ బల్కెద ధరిత్రిం బన శ్వభ్రముఁ ద్రవ్వి యందు నిం
ధనములు నింపి తత్తనువుఁ దమ్మునిచే దహియింప వాఁడునున్. 324
వ. ఆదేహంబు వెడలి కందర్పసదృశాకారుండై. 325
తే. వివిధభూషణములు దాల్చి భవవిరాము, రాము రఘుకులకలశాబ్ధిసోముఁ గాంచి
ప్రేమ సాష్టాంగదండప్రణాముఁ డగుచు, వినుతి యొనరింపఁ దొడఁగె నిట్లని మృగాక్షి.
సీ. వాఙ్మానసములకు వచియింప నూహింప నలవిగాక యనాదివైన నిన్ను
మన్మానసంబు సంభ్రమముగ స్తోత్రంబు సేయంగఁ దలఁచు రాజీవనయన
వరఁగ హిరణ్యగర్భమున విరాట్టన వెలయుదేహద్వయములకు వేఱ
యైన యవ్యక్తదేహం బది దృగ్రూపము సూక్ష్మమును నీవ మనుజనాథ!
ఆ. గానుపించు నిజ్జగంబు జడంబు న, నాత్మకంబు గాన నంటకుండ
వేఱె యున్న నీదువిధ మెఱుంగఁగ మనం, బెట్టులోపు మాయ నెట్లు పాపు. 327

వ. బుద్ధియు నాత్మాభాసయు రెండునుం గలుగుటవలన జీవత్వంబు గలుగు నా బుద్ధ్యాదులకు బ్రహ్మయు సాక్షియగునట్టి నిర్విషయుండును నిర్వికారుండును నఖిలాత్మయు నగు బ్రహ్మమందు నఖిలంబును నజ్ఞానవశంబున జీవుం డారోపించు నీదు సూక్ష్మదేహంబు హైరణ్యగర్భంబును స్థూలదేహంబు విరాట్టును ననం బరఁగు భూతభవ్యభవిష్యద్రూపంబుగఁ గానుపించు జగదాకారంబును స్థూలంబగు బ్రహ్మాండకోశరూపంబును మహదాదితత్త్వావృతంబును సప్తోత్తరగుణసంయుతంబును నీకు స్థూలంబును నగు విరాడ్దేహంబు ధారణాశ్రయంబై యుండు లోకంబులు నీ యవయవంబులనం బరఁగు నెట్లనినఁ బాతాళంబు పాదమూలంబును బార్ష్ణిప్రదేశంబు మహాతలంబును రసాతలంబు నంగుళంబులును తలాతలంబు జానువులును సుతలం బూరువులును వితలంబు కటిప్రదేశంబును నతలంబు జఘనంబును భూమి నాభియును నురస్స్థానంబు జ్యోతిర్మండలంబును గ్రీవంబు మహత్తును సత్యలోకంబు శీర్షంబును నింద్రాదిలోకపాలురు భుజంబులును దిశలు కర్ణంబులును నశ్వినులు నాసికంబును వక్త్రంబు వీతిహోత్రుండును గన్నులు సవిత్రుండును మనంబు చంద్రుండును భ్రూభంగంబు కాలంబును బుద్ధి వాక్పతియు రుద్రుండహంకారరూపంబును వాక్కులు ఛందంబులును యముండు దంష్ట్రాప్రదేశంబులును నక్షత్రంబులు రదనంబులును నిఖిలమోహకారిణి యగు మాయ హాసంబులును సృష్టి యపాంగమోక్షణంబులును ధర్మంబు ముందును నధర్మంబు వెనుకయు నిమేషోన్మేషంబులు దివారాత్రంబులును సముద్రసప్తకంబు జఠరంబును నాడులు నదులును జ్ఞానశక్తి మహిమయు నిట్టిది నీదు స్థూలదేహం బగు మఱియును. 328

ఆ. సుభగమైన నీదు స్థూలదేహం బెవ్వ, రాత్మ నిలిపి కొలుతు రట్టివారి
కగును ముక్తి ధర ననాయాసమున నింకఁ, గోదువలేమి కలుగుఁ గువలయేశ. 329

వ. ఎవ్వండైనఁ బ్రేమరసంబున నీ స్థూలవిగ్రహబాధకుం డయ్యె నేని పులకాంకితదేహుండును ముక్తుండును నగునట్టి నీదు స్థూలవిగ్రహంబున నశ్రాంతంబుఁ దలంతునైన నిప్పుడు. 330

తే. శరశరాసనములు దాల్చి శ్యామలాంగ, మును జటాకల్పితకిరీటమును వెలుంగ
ననుజాతోఁ గూడి నిజభార్యనరయు నీదు, విగ్రహంబేను దలఁతు హృద్వీథి రామ!.

వ. మఱియును. 332

క. వారాణసీపురంబున, సారంగధరుండు నతనిసతియును నిన్నున్
శ్రీరమ్యతనువు దలఁచుచుఁ, దా రతిమోదమున నిలిచెదరు సంతతమున్. 333

తే. మతియును ముముక్షు లగునట్టి మానవులకుఁ, దారక బ్రహ్మవాచ్యమై తనరు మీదు
మహిత నామంబు రామ! రామా! యటంచుఁ,గరపు గంగాతటంబునందుకంటె రామ!.

వ సంతుష్టమానసుండై యెల్లెడల శివుండు నిల్చుఁ గావున నిశ్చయంబుగ నీవు పరమా
త్మవు మాయచేత నారూఢులై యుందఱును నీదుయాథార్థ్యం బెఱుంగఁ జాలరు
మతియును 335

క. నీకొఱకు వందనం బగుఁ, గాక గుణాతీత! లోక కారణ దేహ
నీక సమర్చిత! సానుజ!, సాకేతపురీశ! భక్తజనభయ నాశా!. 336

తే. త్రాహి మాం రఘునందన! దనుజహనన!, భక్తనందన! శత్రుతాపత్రయోగ్ర
పాపకేంధన! వ్యాతిభవబంధన! గిరి, నందనాకృతనిత్యవందన! యటంచు. 337

వ. వెండియు. 338

తే. జానకీవల్లభాయ రాక్షసముదాట, వీకుతారాయ వేధసే విష్ణవే ప
రాత్మనే తే నమో౽స్తు మాం నావృణోతు,దివ్యమాయా త్వదీయా యనంగనపుడు.

వ. కరుణించి రఘుభూనాథుం డిట్లనియె. 340

సీ ఘనుఁడ వన్నిట దివ్యగంధర్వ! సంతుష్టుఁడను నైతి నీదైన వినుతి కిపుడు
యోగిగమ్యంబౌ మగుజ్జ్వస్థానంబునకు నేఁగు మెవ్వరైనను దినంబు
భక్తితోడుత నీవు పల్కినయియ్యాగమో క్తమా స్తోత్రంబు నుచ్చరింప
జపియింప నాదునుజ్ఞానసంపన్నులై భయము లెల్లను నీటఁ బాఱఁదోలి

తే. యవ్యయానందమత్పదప్రాప్తి లగుదు, రనుచు రఘునందనుం డన్నయట్లు తనదు
పొలఁతితోడుతఁ బన్నగభూషణుండు, పలికి పలుకంగఁ దొడఁగెనవ్వాలితెఱంగు.

వ. ఇట్లు గంధర్వుండు సంప్రాప్తపదుండై చనుచు రఘునందనుం గనుంగొని. 342

క. దేవ! పురోభాగంబునఁ, దావకపదకమలభక్తితత్పర శబరీ
స్త్రీ వెలయు వేగఁ గనుఁగొను, మావనిత సవిస్తరముగ నంతయుఁ బలుకున్. 343

ఆ. అనుచుఁ బల్కి తాను నర్కసన్నిభమగు, వ్యోమయాన మెక్కి రామనామ
జపమహాత్త్వమునను సాశ్చర్యుఁడై విష్ణు, పదము నొందె నజ్జపత్రనయన!. 344

వ. అంత రాఘవులును సింహవ్యాఘ్రాదిదూషితంబగు నవ్విపినంబుఁ గనుంగొనుచు శబ
రీతపోవనంబుఁ జేరవచ్చి రప్పుడు రామచంద్రుం గాంచి యవ్వనితయు. 345

## శబరి శ్రీరాములఁ జూచి స్తోత్రము చేయుట.

మ. అతివేగంబున నేఁగుదెంచి కనులం దశ్రుల్ వడిం జార స
మ్మతిఁ దత్పాదయుగంబుపై నొరఁగి నేమంబే యటంచున్ సుఖ

స్థితులం జేసి పదాబ్జములఁ గడిగి తత్సింధూరవర్ణాంఘ్రిసం
ప్లుతతోయంబులు దాల్చె మస్తకమునన్ బుణ్యంబు లంచున్ గడున్. 346

తే. వివిధకుసుమంబులను యథావిధిని బూజ, లప్పుడొనరించి యమృతతుల్యంబు లగుచు
రాఘవార్హంబ లొనఁగూర్చి రహిఁ జెలంగు, ఫలములను దృప్తి యొనరించి పలికె నిట్లు.

వ. రఘుశ్రేష్ఠా! తొల్లి యియ్యాశ్రమంబున మద్గురువులగు మహర్షులకు శుశ్రూష
యొనరింపుచుండుదు వారును ననేకవర్షసహస్రంబులు చనినపిమ్మట బ్రహ్మలోకంబు
నకుం జనుచు నన్నుం గనుంగొని సనాతనుండును బరమాత్ముండు నగు నారాయ
ణుండు రామనామంబున దాశరథియై యిప్పుడు చిత్రకూటనగంబున నిల్చియున్న
వాఁడు రాక్షసవధయును ఋషిపరిపాలనంబునుం గావింప నిచ్చటికిఁ జనుదెంచు
వాఁడు. తావత్పర్యంతంబు నేకాగ్రచిత్తంబున స్థిరవై కళేబరంబు రక్షించుకొని
యుండు మవ్విభుం గాంచి నమస్కరించి తత్పదంబు నొందెద వనుచు బ్రహ్మలో
కంబునకుం జనిరి. యేనును నాఁటనుండి భవదీయసందర్శనాకాంక్షిణినై ప్రతీ
క్షింపుచు నుంటి. నేఁటికి మద్గురుభాషితంబు సఫలంబయ్యె. వారలకుం జూడఁగల్గని
నీదుపుణ్యమూర్తిఁ గంటిఁ గృతార్థనైతి మఱియును. 348

చ. వనితను మూఢచిత్తను భవత్పరిచారకభృత్యభృత్యులం
దనఘ! శతాయుతాంశలను నైనను బోల్పఁగరానిదాన నే
మని నుతియింతు వాక్కునను స్వాంతమునం దెలియంగఁ బోల నీ
వనుపమతేజ! సన్ గరుణ నాదిఁ బ్రసన్నుఁడ గ్రమ్ము రాఘవా!. 349

వ. అనినఁ గరుణించి భక్తివైరాగ్యయుక్తంబుగ రఘునందనుం డిట్లనియె. 350

సీ. వినుము మత్సంతుష్టి యొనరింప శాస్త్రమ్ములు గావు కారణమ్ములు దలంప
మద్భక్తి యదిగాక మనుజుఁ డెన్నియొసర్పఁ గనుపింప మద్భక్తి గలుగకునికి
నది యొకింత యెఱుంగునటు సేతు సజ్జనసాంగత్య మొకటి నిశ్చయము రెండ
వది మత్కథాలాప మొదవుట మూఁడవయది మద్గుణోరణ మరయ నాల్గ

తే. వది గుణవ్యాఖ్యపరుఁ డౌట లరయ నైద, వది సదాచార్యసేవ చెల్వగుట యాఱ
వదియు యమనియమాదుల నొదవి యుంత, మాయయనిబుద్ధిఁ దలఁచుట మానవులకు.

వ. మఱియుఁ బుణ్యశీలత్వంబును నిష్ఠయు నాఱవసాధనం బనం బరఁగు సప్తమం
బగు మన్మంత్రోపాసనంబును మద్భక్తజనుల మన్నించుటయు సర్వభూతంబుల
మన్మతియు నగు భక్తి జనియించిన మత్తత్త్వానుభవుండగు రామతత్త్వానుభవసిద్ధి
యగువానికిఁ దజ్జన్మంబుననే ముక్తి సంభవించుఁ గావున మద్భజనంబు మోక్ష
ప్రదంబు నిశ్చయంబు ప్రథమసాధనంబగు సాధుసాంగత్యంబు గలిగినఁ గ్రమం
బున నన్నియుం గల్గు నీకు మద్భక్తియు దర్శనంబునుఁ గలుగుటవలన ముక్తియుం
గల్గినయది మఱియును. 352

ఆ. మది నెఱింగెదేని మద్భాగ్యతెఱఁగు నీ, వెఱుఁగఁ బల్కు మెవ్వఁ డింత వైర
మేల దలఁచె నెచటి కెత్తుక చనియె నేఁ, డనిన శబరి యిట్టు లనియె నపుడు 353

సీ. దేవ! జగన్నాథ! భావనాతీత! నీ వెఱుఁగనున్న పదార్థ మేమి గలుగు
నైన లోకంబుల ననుసరించితి గానఁ బలికెద నిపుడు నీభార్య తెఱఁగుఁ
బౌలస్త్యుఁ డనువాఁడు పటుపరాక్రమముఁ గొని లంక కరిగె భూతనయ నిడియు
పంపాసరోవరప్రాంతంబునను ఋశ్యమూకం బనఁగ శైల మొకండు గలదు

తే. గలఁ డందు సుగ్రీవు డను ప్లవంగప్రభుఁడు, అన్న యగు వాలికోడి యయ్యచల మతఁడు
మౌనిశాపంబుచేతను రాని తెఱఁగు, దెలిసి నలువురు మంత్రులు గొలువ నచట. 354

క. కావున నీ విచటికిఁ జను, భూవల్లభ! కార్య మెల్లఁ బొందగు నేనున్
బావకుఁ జొచ్చి రఘూత్తమ!, నీవిమలపథంబుఁ గాంతు నిలు మిం దనుచున్ 355

వ. కళేబరత్యాగపర్యంతంబును ముహూర్తం బనుగ్రహింపు మనుచు హుతాశనుం
జొచ్చి నిముసంబున నవిద్యాకృతబంధనం బెల్ల దహించి రామచంద్రప్రసాదంబున
నతిదుర్లభంబగు మోక్షంబుఁ బ్రాపించె మఱియును 356

ఆ. ఎద్ది దుష్కరమగు నీశుఁడౌ రఘునాథు, పదము నమ్మి కరుణఁ బడసినట్టి
యధమజాతికైన నరయ నాశబరియె, సాక్షి జనులు దెలియ శైలతనయ! 357

వ. అదియునుం గాక. 358

ఆ. విప్రుఁడైన మనంబు వేదవేద్యుఁడగు, వనరుహాక్షునందు నునిచెనేని
ముక్తిఁ జెందు భక్తియు క్షిప్రదాయిప,ద్మాక్షుకల్పతరువునందు నిజము. 359

వ. పుణ్యులును శ్రీరామచింతకులును నగువారలు ముక్తులు గావున. 360

చ. నరునకు ధారుణీస్థలి ననంతసుఖావహ మౌను రాజశే
ఖరుఁ డగు రామచంద్రుపదకల్పమహీరుహభక్తి పుణ్యు లి
ట్లరసి సుమంత్రతంత్రవివిధాజ్ఞత లెల్లను బాఱఁదోలి భా
స్కరకులవర్యు నీలఘనకాయు రఘూత్తముఁ గొల్వఁగాఁ దగున్. 361

క. అని శివుఁ డంబిక కెఱిఁగించి,నగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును నాకుఁ బల్కె వినుఁడం, చని యెను సూతుండు శౌనకాదిమునులకున్. 362

స్రగ్విణీవృత్తము
రమామానినీనాథ! రమ్యప్రభావా!
సముద్యద్దయా! దీనసారంగరక్షా!
హిమక్షోణిభృన్నందనేశాప్తతేజో
రమాధామ! శ్రీరంగరాజాభిధానా. 363

గద్య. ఇది శ్రీమారుతోటముక్తీశ్వరప్రసాదలబ్ధ కవితాపవిత్ర కోటమరాజు భాస్కరమంత్రిపుత్త్ర నాగయామాత్య ప్రణీతంబయిన శ్రీమదధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబునం దారణ్యకాండంబు సర్వంబు నేకాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## కిష్కింధాకాండప్రారంభము.

---



రంగనాయక! యశ
శ్శ్రీరంగ! కృపాంతరంగ! సింధుసుతావ్యా
త్తాసరసభృంగ! భవార్ణవ
తారకనిజనామ! రంగధామ! మురారీ. 1

వ. దేవా! యవధరింపుము శైలరాజతనూభవం గనుంగొని భోగిభూషణుండు మరలఁ బల్కిన తెఱంగు సూతుండు శౌనకాదుల కిట్లనియె నట్లు దాశరథులు క్రోశమాత్ర విస్తీర్ణంబును నగాధామలోదకంబునునతంబును నుత్ఫుల్లాంబుజకహ్లారకుముదోత్పల మండితంబును హంసకారండవాకీర్ణంబును జక్రవాకోపశోభితంబును జలకుక్కుట కోయష్టికక్రౌంచనాదోపనాదితంబును నానాపుష్పలతాఫలనగావృతంబును బద్మకింజల్కవాసితంబును నగుచు సజ్జనచిత్తసమానంబగు నమలోదకంబునఁ జెలువొందు పంపానామసరోవరంబునుం గాంచి తజ్జలంబులు స్పృశించి కొన్నిజలంబులు గ్రోలి విగతశ్రములై చల్లనిగాలి వీవ శీతలపథంబున ఋశ్యమూకంబు తెరువుఁబట్టి చను చున్నయెడ నలువురు మంత్రులతోడఁ దద్గిరిమూర్ధంబున నుండి. 2

మ. వరకోదండశిలీముఖాంకుల జగద్వంద్యప్రతాపాఢ్యులం
జిరదాంతాత్ముల వల్కలాభరితులన్ శ్రీమంతులం గాంచి భా
స్కరసూనుం డతిభీతచిత్తుఁ డగుచున్ శైలాగ్రముం జేరి సం
గరశూరుండగు మారుతాత్మజుని వీఁకం జీరి పల్కెం దగన్. 3

చ. పవనతనూజ! నీవు నొకబ్రాహ్మణడింభకుభంగి నేఁగి యా
హవజయశీలు లాహరిపరాక్రము లెవ్వరొ వాలి పంప న
న్నవమతి సేయ వచ్చిరొకొ యంత యెఱింగి విరోధులైనఁ గ
న్గవలను సైగసేయుమ సుముఖత్వము గల్గిన నవ్వు మేనునన్. 4

వ. ఇట్లయిన నిశ్చయం బెఱింగెద. 5

## —శ్రీరాములకడకు హనుమంతుఁడు వచ్చుట.—

క. అని పలుక వటునితెఱఁగున, జని వినయముతోడ వారిచరణములకు వం
దన మాచరించి మారుత, తనయుం డిట్లనియె ముకుళితకరాంబుజుఁడై. 6

మ. ధరణీభారముఁ బాపి భక్తులకు మోదం బివ్వ సాక్షాత్పరా
త్పరు లిబ్భంగిఁ జరింతు రాఢ్యులు జగత్ప్రాధాన్యులున్ మాయచే
నరులై యుండిరి సర్వభూతముల హృన్నాళీకమందుండు న
న్నరనారాయణు లట్లుగానితెఱఁగైనం గాంతి యిట్లొప్పునే 7

వ. మఱియును. 8

మ. పురుషవ్యాఘ్రులు వీరసమ్మతులు సత్పుణ్యు ల్జగత్కర్తలి
ద్ధరణిన్ క్షత్రియవేషధారు లగుచున్ ధర్మేతరధ్వంసన
స్ఫురణ న్వచ్చితి రంచుఁ దోఁచెడుఁ దనుస్ఫూర్తుల్ మహాంభోదముల్
సురధాత్రీధరమున్న దల్చెడుకళాసోముల్ యశస్సోములున్. 9

వ. ప్రధానపురుషులును జగత్కారణులును జగన్మయులును లీలలభంగి సర్గస్థితిలయం
బులు సేయువారలును నగు భంగి నాకుం దోఁచెడు ననిన విని రామచంద్రుండు
లక్ష్మణున కిట్లనియె. 10

క. విను మితఁడు శబ్దశాస్త్రము, గనె నపశబ్దం బొకింత గనుపింపదు ప
లికిన పల్కుల నని రాఘవుఁ, డనియెను బవనసుతుతోడ నంబుదవేణీ. 11

ఉ. ఏ రఘువీరుఁడన్ దశరథేశ్వరపుత్త్రుఁడ దండ్రిపల్కునన్
గౌరవ మొప్పఁ దమ్ముఁడును గాంతయుఁ గూడఁగ దండకాటవిన్
జేరి నిశాచరాధమునిచే సతిఁ గోల్పడి కాననంబులన్
జోరుని భూసుతన్ వెదకుచుం జనుదెంచితి మెవ్వ రీవనన్. 12

వ. విజ్ఞానగరిష్ఠుం డగురఘుశ్రేష్ఠుపలుకులకు మారుతాత్మజుం డిట్లనియె. 13

సీ. వినవయ్య రఘునాథ! వనచరశ్రేష్ఠుండు సుగ్రీవుఁ డనఁగల్గు సుభగుఁ డతని
సతిని నిష్కారణం బతనియన్న హరించుచును నూరువెడల ద్రోబ్బిన నెదుర్ప
లేక యిచ్చట ఋశ్యమూకాద్రియం దున్నవాఁడు నల్వురు మంత్రివరులుగూడ
నతనికి సఖుఁడ నే నంజనీగర్భసంజనితుండ పవననందనుఁడ నాదు
తే. పేరు హనుమంతుఁ డండ్రు యంభోరుహాక్ష, తగును సఖ్యంబు నీకు నాతనికిఁ జూడ
నీదు భార్యాపహారిని నేఁడు ద్రుంపఁ, దోడగును రమ్ము రామ! నాతోడ నిపుడు. 14

క. అనిపలికిన రాఘవుఁ డిటు, లనె కపివర! యేఁగుదెంతు నధికప్రీతి
న్ననరింతు నీప్సితం బిన, తనయున కని పలుకఁ బవనతనయుఁడు భక్తిన్. 15

తే. స్వస్వరూపంబు ధరియించి సకలలోక, నాథుఁడగురామునకు మ్రొక్కి నాదుమస్త
కంబుపై నెక్కుఁ డిదె వాలికతన నవిజూఁ, డున్నశైలంబు జేర్తు నంచనన్న నపుడు.

వ. అనుమతించి తమ్మునితోడ రామచంద్రుఁడు స్కంధారోహణముఁ జేసె నంత వాయు
నందనుండును విహాయసంబున నేగనిమిషంబున గిరిమూర్ధంబు జేరి యచ్చట నొక్క
మహీరుహచ్ఛాయ రామలక్ష్మణుల నునిచి తానును సుగ్రీవసమీపంబునకుం జని
కృతాంజలి యై యిట్లనియె. 17

ఉ. లెమ్ము భయమ్ముఁ గేల సుఖలీలను వారలు రామలక్ష్మణుల్
సమ్మతి నీకు వారలకు సఖ్యముఁ బొల్పడఁజేసి తట్లు ని
క్కమ్మది యగ్నిసాక్షిగను గాఁదగు నంచన వేగ భానుజుం
డమ్మనుజేంద్రు లున్నయెడ కప్పుడు వచ్చె హిమాద్రివందనా. 18

వ. అప్పుడు హనుమంతుం డొక్కభూరుహశాఖవిఱిచి రామలక్ష్మణులకు బదపీఠంబు
గావించె నవ్విధంబ యాలక్ష్మణుండు నొనరించె నిట్లందఱు సుఖాసీనులై యుండిరి.
లక్ష్మణుం డయ్యవసరంబున వనవాసాభిగమనంబును సీతాహరణంబును నాదిగాఁ
గలవృత్తాంతంబు పల్కిన సుగ్రీవుం డిట్లనియె. 19

ఉ. ఏ నొనరింతు భూతనయ నెన్నివిధంబులఁ గాంచుభంగిఁ ద
ద్దానవుఁ ద్రుంచి యింకొకవిధం బొకనాఁ డిట మంత్రివర్యులన్
నేనును నిల్చియున్నతఱి నెవ్వఁడొకో కొనిపోవ రామరా
మా ననుఁ గావు మంచు భయ మందుచు నేడ్చుచు నంబరంబునన్. 20

ఆ. చనుచు మమ్ముగాంచి వనిత నిజోత్తరీ, యంబుఁ జించి భూషణంబు లునిచి
చుట్టి వైచె నివియ చూడుఁడు మీయవి, యవునొ కావొ యనుచు నప్పుడు చూప.

వ. గుహాంతరనిక్షిప్తంబు లగుసీతాభరణంబులు దెచ్చి చూపిన రామవిభుండును హృద
యంబున నిడుకొని ప్రాకృతునిచందంబున. 22

క. హా సీత హా మహీసుత, హా సరసిజనేత్రి యనుచు నతిదుఃఖమునన్
గానిలినొందఁగ లక్ష్మణుఁ, డాసమయంబునను శోక మడఁచుచుఁ బలికెన్. 23

ఉ. ఏటికి చింత రామధరణీశ్వర! వేగ సురారిఁ ద్రుంచి నీ
బోటిని గాంతు వీప్లవగపుంగవుతోడున నంచుఁ బల్కన
మ్మాటకు భానునందనుఁడు పల్కె రఘూత్తమ! యగ్నిసాక్షి ము
మ్మాటికి నేను దానవుని మార్కొని ద్రుంపుదుఁ దెత్తు భూసుతన్. 24

క. అనిపల్కి వేగ పవనజుఁ, డొనరించె హుతాశు నప్పు డురువిక్రము ల
య్యినకులుఁడు నినతనూభవుఁ, డనఁవుగఁ గూర్చుండి రగ్ని కభిముఖు లగుచున్. 25

వ. ఇట్లు కూర్చుండి యకల్మషు లగు రామసుగ్రీవులు బాహుదండంబులు సాచి పరస్ప
రాలింగనంబులు గావించి రంత సుగ్రీవుండు వందనం బొనరించి పరమసఖుండ
వగు రామచంద్రా! వాలిచేసిన యపకృతి యెఱింగించెద. తొల్లి మయపుత్త్రుం
డును పరమదుష్టుండును నగు మాయావి యనురక్కసుండు కిష్కింధానగరంబు
నకు జనుదెంచి రోదోంతరంబు నిండ సింహనాదంబు చేసి వాలి నాహ్వానంబునకుఁ
బిల్వ నతండును క్రోధతామ్రాక్షుండై పఱతెంచి దృఢముష్టి వానివక్షంబుఁ
బొడువ వాఁడును నిలువలేక పఱచిన వాలియు నేనును వెనుదగుల భీతుండై
యొక్క శైలగుహఁ జొచ్చె నంత రోషంబు విడువక వాలి నన్నుం గనుంగొని. 26

ఉ. వాని వధించి వచ్చెద నవార్యపరాక్రమ నిల్వు మంచు న
ద్దానవుతోడ నేఁగె నట దాఁకొన మాసమునిండ రక్తముల్
ఫేనము మెండుగా వెడల బెగ్గిలి వాలి యడంగె నంచు లో
నూనిన చింతతోడ శిలయొక్కటి యగ్గుహవాతమూఁత గాన్ 27

క. ఉనిచి పురంబున కప్పుడు, చనుదెంచి యెఱుంగఁ బల్క సతులును బురుషుల్
ఘనశోకకలితులై రట, వనచరపతి లేక యున్న వనచరమంత్రుల్. 28

క. నను నధిపుఁ జేసి రేనును, జన కొన్ని దినంబు లట్లు సలిపితి నంతన్
దనుజునిఁ బొరిగొని విలయా, ర్కగతిఁ జనుదెంచి వాలి క్రూరత నన్నున్. 29

వ. అరిందమా! పటురోషంబున పరుషవాక్యంబు లాడి. 30

సీ. భర్త్సించి తనదు దుర్భరముష్టిహతులచేఁ బొడిచి యన్నగరంబు వెడలద్రొబ్బ
నతిభయంబున భువియంతయుఁ జరియించి మునిశాపమునఁ జేరకునికి దెలసి
యిమ్మహీధరముపై నిటు వసియించిన నదిమొదల్ వాలి మత్సుదతిఁ గూడి
సకలభోగములచే సంతృప్తుఁడై యుండు నేనిరాశ్రయుఁడనై యింతిఁ గోలు
తే. పోయి రఘునాథ! దుఃఖసంపూరితాంత, రంగుఁడను నేఁడు నీపాదమంగళాభి
దర్శనంబున దుఃఖము దఱిగి సంత, సంబు నొందితి నన రామచంద్రుఁ డపుడు.

చ. వెఱవకు మర్కపుత్త్ర! యిఁక వేగె యనన్ జనిలేదు వాలినిన్
బొరిగొని రాజ్యమున్ సతిని బొందఁగఁ జేతు నటన్న రాఘవా!
తరమె వధింతు నంటివి కృతాంతునికైనను వాలిదార్ఢ్యమం
తఱిమితఱియే బలాఢ్యులు నఖాగ్రులు గారె తలంప వాలికిన్. 32

## సుగ్రీవుండు శ్రీరాములతో వాలిసామర్థ్యము సెప్పుట.

వ. బలవత్ప్రధానుండవగు రఘునందనా! వాలి దేవతలకును దురాసదుం డతని బలం
బెఱింగించెద నొకనాఁటి నిశాసమయంబున మహాకాయుండగు దుందుభియను

దుష్టాసురుండవు మహాకాయుండై కిష్కింధానగరంబునకుం జనుదెంచి సమరంబు
సేయ భీషణంబుగ వాలి నాహ్వానంబు చేసిన విని పరమకోపనుం డగుచు 33

క. చనుదెంచి తద్విషాణం, బనువుగ నొకచేతఁ బట్టి యావానిఁ జరచి త
న్నిన జీరజీరఁ దిరుగుచు ని, మ్మునియాశ్రమమందుఁ బడియె మునినుతచరితా!. 34

వ. దూరపాతంబున దేహంబు వగిలి వనంబెల్ల రుధిరప్లుతం బైన మతంగమునీంద్రుం
డును గ్రోధఘూర్ణితుండై. 35

క. ఇదిమొదలు వాలి యిచటికిఁ, బదపడి చనుదెంచెనేని భగ్నశిరుండై
తుదిముట్టు ననియె నిటు రాఁ, దదితెలిసి రెుఋంగువాఁడ నదియే నొకఁడన్ 36

వ. కాన భయవర్జితుండనై యుంటి నీ విప్పుడు. 37

ఆ. సర్వలోకమం బఖర్వపరాక్రమ!, కాంచు మాహిషంబుఁ గదలుపంగ
నోపదేని వాలి నుక్కడంచెద వంచు, నమ్మెదనిన నగుమొగమ్ముతోడ. 38

వ. పాదాంగుష్ఠంబున. 39

తే. భూధరముఁబోలు నాదైత్యుభూరికాయముఁ, జిమ్మ నదియును శతయోజనమ్ము లరుగ
సాధు వనుచును నిజమంత్రిజనులు దాను, సంతసమ్మున మించె భాస్కరసుతుండు.

వ. మరల భక్తపరాయణుండగు రామచంద్రునకు నిట్లనియె. 41

చ. కనుఁగొను సాలసప్తక మఖండపరాక్రమశాలి వాలి తా
ననువుగఁ బట్టి పర్ణముల నన్నిటిఁ గోయును నొక్కచేత నీ
వును నొకసాయకంబున మహోజ్జ్వలతం ధరఁ గూల్చెదేని ని
న్ననువుగ నమ్ముదుఙ్ దనుమ నొగువు వాలి నటంచు నెమ్మదిన్. 42

మ. ఇటుపల్కం బటుకార్ముకంబున శరం జేపార సంధించి ది
క్తటభీమంబుగ నేయుఁ దచ్ఛరము తత్సాలంబులం ద్రెంచి మి
క్కుటమా రాముబలం బహీంద్రునకుఁ బల్కం బోవుమాడ్కిన్ మహా
స్ఫుటిమై శైలము భూమి గాఁడిచని శుంభద్విక్రమప్రక్రియన్. 43

తే. మరల రాఘవుతూణీరమధ్యతలము
నందు నిల్చిన రవిజుఁ డానందుఁడగుచు స
విస్మయుండగు నౌచుఁ గేల్మోడ్చి వివిధగతులఁ
బొగడఁ దొడఁగెను రఘునాథు నిగమవినుతు. 44

సీ. నరవరోత్తమ! జగన్నాయకుండవు నీవు మత్పూర్వకృతపుణ్యమహిమచేతఁ
గలిగె నీస్నేహంబు ఘనులు నిన్ భజయింతు రీశ! సంసారనివృత్తికొఱకు
మోక్షప్రదాయివౌ ముక్తీశ నినుఁ గాంచి చనునె భవాబ్ధిలో మునుఁగ బుద్ధి

తే. జలటితభూమిని రవిరశ్మిజాల మెల్ల, జలము భంగిని దోఁచెడుసరణి జగము
లెల్ల నీయందె భ్రాంతిచే నెఱుఁగఁబడును, గాని సర్గుణుఁడవు బుద్ధిఁ గనుఁగొనంగ.

వ. నుతియుం దేవా! యివ్విధంబున ద్వ్యత్యాభావుండవగు నిన్ను నెవ్వ రెఱుంగంజాల
రైనను నిపుణులగువారలు భవద్దివ్యలీలావతారంబులు దలంచెదరని ముక్తులగుదు
రింక మూఢకంబునకు మార్గంబు గోరని యుండెకుభంగి నాత్మకుఁ గామక్రోధా
దులు పరిపంథులై సమయంబు నిరీక్షింపుచుండు నిట్టిహృన్ను సమస్తజగత్పావనం
బగు భవన్నామంబు జపియించుచు హరికిరీటసుందరస్ఫుర్త్తి చేయుకౌస్తుభాలంకృతం
బును సర్వప్రహారణాయుధంబు నగు భవద్విగ్రహంబు హృత్కమలమధ్యంబునం
దలంచుచు భవత్పూజాపరిలిప్తులై భవచ్చారిత్రంబులవలన నాసక్తులై వినుచు నీక
భక్తులగువారలతోడ సాంగత్యంబు నెఱపుచుఁ గాలంబు జరుపు పుణ్యాత్ములు
సంసారమహార్ణవంబు గోష్పదంబులీలం దాఁటి భవత్సాన్నిధ్యంబు నొందెద రిది
నిజంబు రఘునందనా! యేనును నిరంతరంబు నీగు సగుణస్వరూపంబు నారాధించి
భవపాశంబులవలన విముక్తుండనై సకలదేవతాపూజ్యుండనుగ భువనత్రయంబుల
సంచరించెద నిప్పుడు. 337

క. నీ వొనరించిన కార్యము, దేవహితము కుంభకర్ణుఁ దెగటార్చుటచే
నీవసుధాభారము సగ, మావులయ్యె చనియె జనకజాధిప! రామా!. 338

తే. ఇంక సౌమిత్రి రేపు దైత్యేంద్రపుత్త్రు, నింద్రజిత్తుని బరిమార్చు నెల్లిగాక
యావలను మీరు దశకంఠు నడఁచఁగలరు, సురలు నేనును దివినుండి చూడఁగలము.

తే. జానకీనాథ! కరుణింపు చనెద నిప్పు, డనుచు నారాసుచంద్రుచే సధికములగు
మన్ననలు గాంచి సురసేవ్యమానుఁ డగుచు, నరిగె నారదముని బ్రహ్మపురమునకును.

వ. అంత రావణుండును. 341

చ. తనయనుజుండు బాహుబలదర్పసముగ్రుఁడు కుంభకర్ణుఁ డి
ట్లని రఘునాథుచేఁ దెగుట లంతయుఁ జారులచే నెఱింగి హా
యనుజ! మనుష్యమాత్రుని శరావళి నిన్నిటు చేసెనే యటం
చును ధరణీస్థలిం బడఁగఁ జూచి తదాత్మజుఁ డింద్రజి త్తనెన్. 342

ఉ. నీమదిఁ జింత యేల రజనీచరవల్లభ! యేను గల్గ నా
రాముఁ డనంగ నెంత మది రంజిల నిల్వు మిటన్ నికుంభిలా
హోమ మొనర్చి కార్ముకము నుగ్రశరంబులుఁ దేరుఁ గొంచు సం
గ్రామ మొనర్చి వానరుల రాఘవులన్ బరిమార్చి వచ్చెదన్. 34

వ. ఈసమయమున దాహుతాశను మెప్పించి రథాదికంబులుఁ గొనియెద. 34

ఆ. అనుచుఁ బలికి తాను వానరాఖ్యయుఁ జేరి, రక్తగంధమాల్యరాజి మెఱయ
ఘోరమైన యన్నికుంభిలాహోమంబు, సేయఁ బోదఁగెఁ గుహినశిఖరితనయ! 345
వ. అంత నివ్విధంబు నెఱింగి విభీషణుండు రఘునాథునకు నెఱింగించువాఁడై సమీపంబునకుం జని యిట్లనియె 346
సీ. మనల జయింప హోమము సేయుచున్నవాఁ డింద్రజిత్తుఁడు రాఘవేంద్ర! చూడు
విఘ్నంబు గాకుండ వెస వ్రేల్చెనేని సురాసురాదులకైన నాఁగఁబోఁడు
కాన నాతోడ లక్ష్మణు నాయితముచేసి పంపు మీతఁడు వానిఁ ద్రుంచుటకును
బలవంతుఁ డన రామభద్రుఁ డెంతయు సంతసము నొంది యోవిభీషణ! మదీయ
తే. జయము గోరెద వతియు క్తిశాలి వీవు, పిన్నవాఁ డగు లక్ష్మణుఁ డెన్న నిప్పు
డేను జనుదెంతు వాని మాయింప మీఁద, గెలుకొల్పెద నస్త్ర మాగ్నేయ మనుచు.
తే. కాలరుద్రోపమానుఁడై కార్ముకంబు, గొనిన రఘునాథుతోడ నిట్లనె విభీష
ణుండు జగదీశ! పేఁడు చావండు నితర, జనుఁ జేతను నెటు లన్న వినుము తెలియ
క. పదునాల్గు వత్సరంబులు, నిదురయు నాహార మెఱుఁగనట్టి జనులచేఁ
దుదిఁ గాంచు ననియె: గమలజుఁ, డది గావున వాని నడఁప నగు లక్ష్మణుండుక్.
వ. ఎట్లనిన మీ రయోధ్యాపట్టణంబు వెడలిన నాఁటి మొదలు భవత్సేవాపారతంత్ర్యంబున నాహారనిద్రలు మఱచియున్నవాఁ డిదియుఁ గాక సమస్తధరాధరుం డగు భుజంగవల్లభుం డీనును నెఱుంగుదుఁ గాన ననుజ్ఞ యిమ్ము వాని వధించి సంప్రాప్తవిజయుండై చనుదెంచు నిదియునుంగాక. 350
ఉ. నాయక సర్వభూతములపాలన లీలయ పోలెఁ జేయు నా
రాయణమూర్తి వీవు భుజగాధ్యుఁడు లక్ష్మణుఁ డిట్లు మాయచే
నీయవనీభరం బడఁప నిచ్చ జనించితి రయ్య రామభూ
నాయక! సర్వభూవలయ నాటకసూత్రధరా! మహాప్రభూ!. 351
వ. అని యివ్విధంబున విభీషణుం డనియె నను చు శివాశివసంవాద ప్రకారంబు 352
ఉ. నీలఘనాభిదేహా! రజనీచరబంధపయోధిమందరా!
పాలితభక్తలోక! నిజపాదపయోరుహజాతదేవగం
గాంబుహారీవిలాస! వరకాంచనచేల! రథాంగహాస్త! తాం
బూలమిళన్ముఖాంబురుహా! భూరిపరాక్రమ! రంగనాయకా!. 353
మాలిని. వనరుహదళనేత్రా! వార్ధికన్యాకళత్రా, మునిజనహృతశోఖా! మంజుభాషావిశేషా!
ఘనకనకశరాసా! కాలమేఘావభాసా!, దినకరనిభతేజా! ధీర! శ్రీరంగరాజా!.
గద్య. ఇది శ్రీమోరుగంటికులము శ్రీకృష్ణప్రసాదలబ్ధకవితావివిత్రకోటమరాజుభాస్కరమంత్రిపుత్ర నాగయామాత్య ప్రణీతంబైన శ్రీనుదధ్యాత్మరామాయణం బను మహాకావ్యంబునందు యుద్ధకాండము ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## యుద్ధకాండము - ద్వితీయాశ్వాసము.



లక్ష్మీవర! బలభి
న్నీలవినీలస్వరూప! నీళాధాత్రీ
లోల! మహామునిసముదయ
పాలా! రంగాభిధాన! భక్తాధీనా!. 1

క. శ్రీనారాయణ! కమలామానససరసీజమిహిర! మందరధర! దా
త్రీనాథ! పక్షిముఖముఖ, దానవకులభీమ! రంగధామ! మురారీ!. 2

వ. దేవా! యవధరింపుము హిమాచలకన్యకాకాంతత్సంబున నం గనుంగొని గంగాధరుం డిట్ల
నియె నట్లు రఘువల్లభుండు స్వకార్యానుగతంబులుగాఁగ విభీషణుండు పలుకు
మృదుభాషణంబులకు సంతసించి యేనును మేఘనాదుమాయావిత్వంబును బ్రహ్మా
స్త్రసైన్యంబును మన లక్ష్మణుం శరాసనకౌశలంబును నాయంగుల భక్తియుఁ
దత్స్వరూపంబును నెఱుంగుదు నైనను భావికార్యగౌరవంబున నూఁకయుంటి
ననుచు సుమిత్రానందనుం గనుంగొని విజ్ఞానగరిష్ఠుండగు రాఘవేశ్వరుం డిట్లనియె.

ఉ. తమ్ముఁడ! మేఘనాదు బలదర్పము దూలఁగఁజేసి కీర్తి గై
కొమ్ము భవత్సహాయముగఁ గ్రోల్పులిమూకలభంగిఁ గీశసై
న్యమ్ము జాంబవంతుఁడును నట్లు విభీషణుఁ డాత్మమంత్రివ
ర్గములతోడ రాఁగలఁడు గన్పఱచున్ సుగవైరిమర్త్యముల్. 4

వ. అని పల్కిన 5

తే. అవ్విధంబున నాత్మబాణాసనములు, లక్ష్మణుండు విభీషణుం డాత్మనంబ
కొనిరి సౌమిత్రి యంత రాఘవికదాజ్ఞ. ...లకు వందన మొనరించి పలికె నిట్లు 6

ఉ. ఓనరనాథ! మచ్ఛరము లుగ్రశరాసము వీడి యంత్యకా
లానలవృత్తిఁ బాఱి దనుజాంగముఁ జొచ్చి పగిల్చి దుస్సరా
పానవిస్రబ్ధత రుధిరపంకము భోగవతీజలంబులన్
స్నానమొనర్చి పాయు దివిజప్రకరంబు నుతింప నిప్పుడున్. 7

ఆ. అనుచుఁ బలికి రాఘవానుజ్ఞ వడసి పెం, పమర నింద్రజిద్వధార్థ మపుడు
వెడలె లక్ష్మణుండు వివిధసైన్యములచేఁ, బవనజుండు వెంటఁ దవిలి నడువ. 8

వ. అసమయంబున నిజమంత్రిసమేతుండై కరాగ్రంబున గదాదండంబు వెలుంగ విభీ
షణుండును భల్లూకవర్గంబుతోడ జాంబవంతుండును గూడ నడచి రిట్లు గగన
పథంబు విహంగరాజసమానవేగులై చనిచని భుగభుగాయమానంబులుగఁ బొగలు
వెడలు నికుంభిలాదేశంబు గాంచి యాహవంబునకు సన్నద్ధులై రంత విభీషణుండు
సుమిత్రానందనున కిట్లనియె. 9

సీ. చూడు మల్లదె మహాసురయోధనికరంబు దృఢయత్నమున నొందు ధీరవర్య!
వీరిఁ ద్రుంపక కాని వెస నింద్రజిత్తుండు గనుపింపఁ డదిగానఁ దనకకుండు
మన విభీషణుమతి కనుమతించి మహోగ్రకోదండ మటు కేలఁ గొని తదీయ
సైన్యవర్గముమీఁద శరవర్ష మునరింపఁ దొడఁగె వానరులును గడఁగి శైల

తే. పాదపంబులు గొని వారి బడలుపఱుపఁ, గడఁగి రంతట వారు ముద్గరశరాసి
సాధనంబుల మరలి యాశైలచరుల, సంధు లగలంగ మొత్తను సాఁగి రపుడు. 10

వ. ఇవ్విధంబున నుభయసైనికులుం దలపడి పిరుతివియక సంప్రహారశబ్దం బుడిగిపోరం
దొడంగి రందు శాఖామృగసైన్యంబుల బలం బగ్గలం బయిన 11

చ. బలురజనీచరు ల్ధరణిపైఁ బడ మేఘనినాదుఁడు స్వకీయం
భిల యటు మాన్పి కార్ముకము భీకరసాధనపఙ్క్తిఁ గొంచు ను
జ్జ్వలముగు తేరిపై నసితశైల మొకో యన నెక్కి వచ్చి తా
నిలిచె స్వకీయసైన్యరజనీచరపర్వ్యులు సేద దేరఁగన్. 12

వ. ఇట్లు నిలిచి సుమిత్రానందనున కిట్లనియె. 13

తే. ఓయి! లక్ష్మణ' నీ వెంగుఁ బోయె దింక, మేఘనాదుఁడు వీఁడు నీమెదడు వ్రేల్చ
నగ్నియందున నని గదాహస్తుఁడైన, తనకుపినతండ్రిఁ గాంచి యిట్లనియెఁ గనలి.

మ. తగురా నీకు విభీషణా! యిచట జాతంబై మముంబోంట్ల మొ
త్తఁగ నేతెంచితి వేల మాట లికఁ బుత్రద్రోహి! నీకంతమున్
దగ వ్రేయం బగదీరు నే యనుచు నాదితోయ్యపమాన ప్రభున్
జగతీనాయకుఁ గాంచె వాయుజఘనస్కంధస్థితున్ లక్ష్మణున్. 15

ఇంద్రజిల్లక్ష్మణుల యుద్ధము.

ఆ. ఇట్లు గాంచి కన్ను లెఱ్ఱసేసి మహాప్ర, మాణధనువుఁ గొంచు మహితరవముఁ
జేసి లక్ష్మణా! మహాశనితుల్యంబు, లివియ కపిబలములఁ దవిలి చంపు. 16

చ. అనుచు మహోగ్రసాయకము లాత్మవలీముఖసైన్యపఙ్క్తిపైఁ
బనుపఁగఁ గ్రూరపన్నగముభంగిని లక్ష్మణుఁ డూర్చు లుచ్చుచున్

గనలి శరాస మెత్తి ఘననాదుని మేనను బంపవాప ముం
చిన రథమధ్యమందున విచేష్టితుఁడై పడె నాఁడు శైలజా!. 17

వ. ఇవ్విధంబున. 18

క. ఆరామానుజశరముల, చే రహిఁ దూలుచును గొంత సేపటికిని వి
స్ఫారవిలోచనుఁడై నిజ. ఘోరశరాసనము గొంచుఁ గ్రూరత్వమునన్. 19

ఆ. ఓరి! లక్ష్మణా! మదుజ్జ్వలకార్ముక, శక్తి నీవు మొదటి సమరమునను
దెలియ విప్పుడు నీకుఁ జెల్లంబు సేసెద, ననుచు సాయకంబు లందపర్చి 20

సీ. ఉరుతరంబుగ నాఱు నొక్కటి శరము లుగ్రత లక్ష్మణుని మేను గాఁడ నేసి
తీక్ష్ణధారలు గల్గు దృఢతరాంబకంబులు పది వాయుజుని మేనఁ గుదులు కొల్పి
యశనితుల్యములైన యమితసాయకములు చొనిపి విభీషణుతనువు నొంచి
యడ్డులేక చరింప నవ్విధం బంతయు లక్షణవంతుఁడౌ లక్ష్మణుండు
తే. గాంచి నాయంతవాఁడను గల్గి వీని, ప్రాభవము చెల్ల నిత్తునే బహుళపఱతుఁ
గాక యని ఘోరమగు సాయకముల వాని, చాపదండంబు నడుమన భంగపఱచె. 21

క. గురుతరసాయకములు పైఁ, బఱచి తనుత్రాణ మెల్ల భగ్నము సేయన్
దఱచగు రోషమునను ఘను, డరుసర్వము చించె నట్లు వాఁడిశరములన్ 22

వ. ఇవ్విధంబున రఘుసుతతనుత్రాణంబులును భిన్నంబులైన నోటుపాటులేక పరస్పర
జయైషణంబుల శరసంధానమోక్షణంబు లెఱుంగరాకుండ వలయాకారంబులై
కోదండంబులు మెఱయ రుధిరధారలు గ్రమ్ముదేర దేహకాంతులు నిదాఘసమయ
మధ్యందినమార్తాండమండలంబు ననుకరింపఁ గాలభుజంగంబులభంగి నిట్టూర్పులు
నిగుడించుచుఁ గృతప్రతికృతులు నై జయాపజయవివర్జితులు నై యన్యోన్యమర్మ
చ్ఛేదకరంబులగు నారాచంబుల నిశాచరనాథనందనుండును సుమిత్రానందనుం
డును బెద్దతడవు సమరంబు సలిపి రాసమయంబున 23

చ. దశరథరాజనందనుఁడు తార్క్ష్యని యైనశరంబు తేసి యా
దశముఖపుత్త్రుఁ గార్ముకపతాకతురంగము లెల్ల ధాత్రిపై
యసము దొలంగఁ గూల్పఁగ సురారితనూభవు డొండుచాపమున్
గుశలతఁ దాల్చి పైనవనఁ గొంకక లక్ష్మణుఁ డాశరాసమున్. 24

ఆ. తొంటిభంగి మూఁడుతూఁపుల ఖండించుచుఁ, బగకుభిండివాలపట్టసాది
సాధనంబు లన్నిశాచరుఁ డేసింపఁ, దునిమె లక్ష్మణుండు తొగనవియ. 25

వ. ఇట్లెన్నిసాధనంబులు పట్టిన నన్నియును సుమిత్రానందనుండు నడుమన ఖండింప
నింద్రజిత్తుండును గ్రోధతామ్రాక్షుం డయి యొండుశరాసనంబు చేకొని

క. నాలుకలు దెఱచు క్రూర, వ్యాళము లన ఘోరశరము లాలక్ష్మణుపైఁ
గీలుకొలిపి వానరులను, దూలఁగ నిశితాంబకములఁ దొడరించెఁ జెలీ. 27

వ. ఇవ్విధంబునఁ దనదుచేతుపతీఁట వోవఁ బ్లవంగయూథపులం బరిమార్చుచు విజృంభించిన 28

ఆ. ఇట్లు తనదు సైన్య మెల్ల నొంప్పుచు నమో, ఘప్రతాపుఁ డగుచు గండుమీఱు
మేఘనాదుఁ గాంచి మించుకోపంబున, లక్ష్మణుండు శత్రుశిక్షణుండు. 29

వ. విజయశీలంబగు కార్ముకంబు కేల నంది యైంద్రాస్త్రంబు సంధించి లక్ష్యంబు దనుజరాజనందను కంఠప్రదేశంబున దృఢతరంబుఁ జేసి రాఘవేంద్రుచరణకమలంబులు స్మరియింపుచు సజ్జనహితంబుగాఁగ నిట్లనియె. 30

ఆ. దశరథాత్మజుండు ధర్మాత్ముఁడేను సత్య, సంధుఁడేని సమస్తజగములందుఁ
దెలియ జనుల కప్రతిద్వంద్వుఁడైన నో, సాయకంబ! వీనిఁ జక్కడంపు. 31

క. అని యాకర్ణాంతంబుగ, ధనువుఁ దిగిచి యేసె రాముతమ్ముఁడు లోకం
బునఁ గ్రూరుఁడైన ఘననా, దునిఁ ద్రుంపఁగ నంత నదియు దుష్కరజవియై. 32

క. చని రత్నకుండలోజ్జ్వల, మును మణిమయమకుటకిరీటమును నై వెలుఁగొం
దిన మేఘనాదు శిరమును, దునిమి ధరాస్థలిని గూల్చెఁ దోయజనయనా!. 33

వ. తత్సమయంబున. 34

తే. సంతసంబున దేవతాసముదయములు
పొగడఁ దొడఁగిరి సౌమిత్రిభుజబలంబు
హర్షమును నొందె భగవంతుఁడగు మహేంద్రుఁ
డమరఋషియుక్తుఁ డగుచు శీతాంశువదన!. 35

వ. మఱియు నమరాలయంబున దుందుభిధ్వనులు చెలంగె గగనతలం బెల్ల నైర్మల్యత వహించె విశ్వంభరయు స్వాస్థ్యకస్థిరాభిధాన యయ్యె నంత గతప్రాణుండై పడియున్న దాశకంఠిం గనుంగొని లక్ష్మణుండును జయలక్ష్మీసమేతుండై తనదుశంఖంబు పూరించుచు నష్టహారావంబునకు విగతశ్రములగు జాంబవదాంజనేయవిభీషణప్రభృతి మిత్రవర్గంబులను దక్కిన సైన్యంబులనుం దోడ్కొనుచు మాయావిలక్షణుండును నారాయణుండును నగు శ్రీరాఘవేశ్వరా! భవత్కటాక్షంబున మేఘనాదుం బరిమార్చి సుఖంబునం జయందెంచితి ననుచు ననేకవిధంబుల వినుతి గావింప నమ్మహానుభావుండును. 36

సీ. అతికృపాదృష్టిచే నాలింగన మొనర్చి శిరము మూర్కొని నీవు చేసినట్టి
కార్యంబునకు వేడ్కఁ గంటి లక్ష్మణ! దాశకంఠి కూలఁగఁ గూల్చె గడుబలము

నేవిధంబునఁ ద్రుంతు వీవటంచును మూఁడహోరాత్రములనుండి యుంటి నిట్టు
లింకఁ బుత్త్రుఁడ పోవు పెటిఁగి గుహఖంబున రాఁగలం డనికి నారావణుండు

తే. నేను ద్రుంపంగఁగలనంచు నిట్టుపలుకఁ, బంక్తిముఖుఁడంతఁ దనపుత్త్రుపాటెఱింగి
హా సుతా! యంచు మూర్ఛిల్లి యవని వ్రాలి, కొంతసేపటి కమ్మూర్ఛ కొంత దెలిసి.

వ. పుత్త్రమోహంబునఁ దత్పరిభావంబు లుగ్గడించుచు. 38

సీ. మేఘనినాద! నీ విటు లమిత్రులచే సమరంబునందు దు
ర్వైఖరిఁ జెంద నన్యగవల్గుబవా రెవరయ్య యింకఁ దం
త్రీ! ఖచరాళి స్వర్గమునఁ బ్రీతిఁ జరింపఁగఁ గల్గె నీభుజా
శాఖలు ఖత్మణాస్త్రపలుచండకుఠారము ద్రుంప నక్కటా!. 39

వ. అనుచు నవ్విధంబున సహింపరాని పుత్త్రశోకంబున. 40

ఆ. దీనివలన నిట్టి తెఱఁగు నాకుఁ దటస్థ, మయ్యెఁ గాన దీని నఱుతు ననుచు
సీతపైకిఁ దామసించి ఖడ్గముఁ బూని, చనఁగ వానిఁ గాంచి జనకిజయును. 41

వ. శోకభయంబులు నిక్కటిల్ల నచ్చటి దనుజకాంతామధ్యంబున నొదిగి యుండె నంత
దశాననునకుఁ బరమసచివుండును బుద్ధిమంతుండును శుచియు మేధావియు నగు
సుపార్శ్వుం డను నిశాచరసత్తముండు చనుదెంచి వారించి యిట్లనియె. 42

తే. వేదవిద్యావ్రతస్నాత వాదజపిత, వధికగుణుఁడవు వైశ్రవణానుజుఁడవు
నిర్మలుఁడ వెన్నఁగ స్వకర్మనిష్ఠితుఁడవు, తగదు స్త్రీవధ నీకు దైత్యప్రధాన! 43

క. ఏము సహాయముగా నా, రాముబలం బెల్ల గెలువు రాముని బల మిం
కామీఁద నీదె కాదే, యామానవతీలలామ నేటికిఁ జనుముఁ. 44

తే. అనుచుఁ బలుకంగ రావణుం డానుపార్శ్వ, వాక్యములచేత మరలి సౌవర్ణమణిమ
యాంచితంబగు తనగృహం బపుడు చేరి, మఱలి గుర్విద్ధితో సభ కరుగుదెంచి 45

## రావణాసురుఁడు రెండవనాఁడు యుద్ధమునకు వెడలుట

వ. నిఖిలమంత్రివర్గంబుం గూడుకొని యాలోచనంబుచేసి శలభంబులు శలభంబులం
గూర్చుకొని దవానలంబుపైఁ గవియుచందంబున హతశేషులగు నిశాచరవల్లభుల
నందఱ నాయితంబుగం జేసి నియోగించి తానును దీప్తిమంతంబగు నొక్కరథం
బెక్కి సకలశస్త్రాస్త్రంబులును గరంబులం బట్టి యామినీచరులు మాతంగతురం
గాదివాహనంబు లెక్కి తోడ నడువఁ బ్రళయకాలమహామేఘంబుభంగి గర్జనంబు
సేయుచు లంకానగరంబు వెడలి దాశరథుల సైన్యంబులఁ దాఁకి మాఱులేని పరాక్ర
మంబున విజృంభింప రఘునాయకుండును. 46

సీ. అశనితుల్యములైన యంబకంబుల వానిసైన్యంబులను నెల్ల దైన్యపఱచి
దశకంఠుచేతి కోదండంబు లెల్లను ఖండించి పత్త్రంబు గాఁడఁ జెక్కు-
బాణంబు లడరింపఁ బసచెడి వాఁడును నిర్గతదార్ఢ్యుఁ డగుచు లంకాపురంబుఁ
జొచ్చి హా దైవమా! సోఁకుమూకల కెంతపాటు వచ్చెను రామభద్రుచేతఁ
తే. గిరమూర్తుండును నిష్కాంత చేసె వాయు- నందనుఁడు వీరి నందఱ డింపుపఱతుఁ
గాక యనిశుక్రమందిరాంగణమునకరిగి యొలమినప్పుడు శుక్రుఁగని మ్రొక్కి యిట్లనియె.

ఉ. దేవ! సమస్తబాంధవులుఁ దీఱిరి శ్రీరఘునాథుకార్ముకా
శీవిషతుల్యబాణముల నిగ్గను నిల్వఁగ నేమిసేతు నా
కీవిధి మారు గల్గ జనియించుట లొప్పునె యన్న సత్కృపా
వ్యాప్తచిత్తుఁడై పలికె నాకవి పద్మపలాశలోచనా! 48

క. విను పఙ్క్తివదన! హోమం, బొనరింపు మవిఘ్నమైన నుద్భవమగుఁ గాం
చనరథము శరశరాసన, ఘనపఙ్క్తియు వానిఁ గూడి గడఁగుము రిపులన్. 49

వ. ఇంతలోన విఘ్నంబయ్యెనేని సబాంధవంబుగ నీవ నశియింపుదు వనుచుఁ దద్వి
ధానం బంతయు నుపదేశమిచ్చి దివ్యంబులగు మంత్రంబు లొసంగిన దశాననుం
డును నతిత్వరితంబునం జని పాతాళసదృశం బగు నొక్కగృహంబు నిర్మించి
యయ్యభిచారంబునకు వలయు నుపకరణంబు లెల్ల సమర్థంబులు గావించి పురద్వా
రంబులు మూయం బనిచి యొక్కపాషాణంబు తద్గృహద్వారంబున నిడి తానును
మౌని యై నిశ్చలచిత్తుండై యనలంబున భార్గవోక్తప్రకారంబుగ హోమంబు
వేల్వం దొడంగె నాసమయంబున. 50

క. భుగభుగ మని పొగ లెగయఁగ, నొగిఁ గన్గొని యావిభీషణుఁడు రాముఁ డెఱుం
గఁగ నిట్లనెఁ గనుఁగొను మో, జగదీశ్వర! రావణుండు సలిపెడువిధమున్. 51

సీ. మనుజేంద్ర! హోమధూమసమూజ మదె యది సాంగమైనను వీఁ డసాధ్యుఁ డగును
గానఁ దద్విఘ్నంబు గావింప హరివీరులను వేగఁ బంపు మీ వనిన నర్క-
పుత్త్రుసమ్మతి వాయుపుత్త్రాంగదాదులఁ బటుపరాక్రములను బనుప వారు
ప్రబలి లంకాపురప్రాకారములు దాఁటి పదికోటులు ప్లవంగపతులు రావ
తే. ణాలయముఁ జొచ్చి తద్రక్షకాళిఁ దఱిమి, హయములనుజంపి గజముల నడుగుపఱచి
యెదుర వచ్చినవారల నేఁచి రావ, ణుండు వేగమె మాకుఁ జూపుం డటంచు 52

వ. తద్గృహారంబులం బాధింపం దొడంగినఁ బ్రభాతం బగువేళ సరమ యను నొక్క-
పుణ్యవతి హస్తసంజ్ఞచేత గుహాపిధానపాషాణం బంగదునకెఱింగింప మహాసత్త్వశాలి
యగు నక్కుమారుండును బదఘట్టనంబున నప్పాషాణంబుఁ జూర్ణంబుఁ గావించి

నిజయూథపసహితుం డై లోపలికిం జొచ్చి యచ్చట నిమీలితాక్షుండును దృఢాస
నుండును నగు దశాననుం గాంచి యాతనిపైఁ గపులం బురికొల్పిన 53

సీ. కొందఱు కపులెంత గోలాహలధ్వను ల్సేయుచు దనుజుం జెండఁ దొడఁగి
రంతఁ గొందఱు వడి నఖిలసంభారముల్ దీసి కుండములోన వేసి రప్పుడు
వాయుజుం డాపట్టి వదనుఁ దేర్చు స్రువ మెత్తె వడి దీసి దానినే వానిపై వైచె
నఖదంతపదతాడనములఁ బెట్టఁబడి యొంటఁదొడఁగిరి కొందఱు తోన గదిసి

తే. రిట్లు చేసిన మౌన మొకింత విడక, యుండు దశకంఠుఁ గని యంగదుండు కోప
మెసఁగఁ దలనెంట్రుకలు పట్టియీడ్చుకొనుచు, వచ్చె మందోదరిని బంక్తివదనుకడకు

### అంగదుండు మందోదరిని రావణు నెదుటి కీడ్చి తెచ్చుట

వ. ఇవ్విధంబున నంతఃపురంబునందుండి పరమసతీ ప్రతారత్నంబగు మందోదరిం దోడి
తెచ్చి యనాథవోలె విలపించుచుండ దశాననుకట్టెదుర నీడ్చుచుఁ గరతలంబున
వ్రేయుచు బాధింపుచుండ. 55

మ. నవరత్నోజ్జ్వలమైన కంచుకము భిన్నంబయ్యె హారావళుల్
ఛవి దూలెన్ ముఖవారిజంబును నిజస్వచ్ఛన్నతం గాంచెఁ గ
న్గవలం దశ్రులు తీవ్రమయ్యెఁ బిసద్గ్రీవేయము న్వీడె న
య్యవనీపుత్త్రియు దేవతాపతులు కీశాళుల్ ముదం బందఁగన్ 56

వ. అంత నామందోదరియు నతిదుఃఖంబున నిజవల్లభుం గనుంగొని. 57

చ. పరువడి నీవు చూడఁ దనపట్టి ధరాస్థలి నీడ్వ నాగ్రసుం
దరి యని లజ్జ లేక ప్రమదంబున వేల్చెదవేల యొంటి నై
ధర బ్రతుకంగ హా తనయ! దైత్యవిభూషణ! మేఘనాద! న
న్నారు లిటు సేయనోపుదురె యుండిన నీవు సజీవివై భువిన్. 58

ఆ. నిన్నుఁ గన్నతల్లి నేఁ డిట్టు కోఁతుల, చేత నీడ్వ లోంగఁ జేసె బ్రహ్మ
పూని నాదుభర్త మౌనంబు విడువఁడు, వాని దూలి బ్రతుకు నాసతోడ. 59

వ. అని యివ్విధంబున విలపించు నిజవల్లభం గనుంగొని దశాననుండు మౌనంబు విడిచి
ఖడ్గహస్తుం డై యంగదుపయిం గవిసి. 60

క. విడువిడు మని ఖడ్గముచే, వడిఁ గటిదేశంబు వైవ వదలి దశాస్యుం
బడఁ దన్ని యెగసి చనె న, య్యెడ నంగదుఁ డంబుపథమున నగచరయుతుఁ డై

వ. ఇవ్విధంబునం జని శ్రీరామచంద్రుపార్శ్వంబున నిలిచె నంతఁ బంక్తికంధరుండును
నతిశోకసంతప్తయగు మందోదరిం గనుంగొని యిట్లనియె. 62

సీ. సఖిరో! దైవాధీన మఖిలంబు బ్రతికియుండిన నేమి తనుఁ గనుంగొనక యుండుఁ

గానఁ బోవిడువు దుఃఖము నిశ్చయంబైన జ్ఞానంబు ప్రాపు మజ్ఞానమునను
శోకంబు పుట్టు నాశోకంబుచేఁ జెడు జ్ఞానంబు దానసె గల్గు నేను
నాది యనం చనుట యనాత్మయగు దేహంబునందుఁ దానసె కళత్రాదిబంధ
తే. వితతి చెలువొందు దాన సంసృతి జనించు, హర్షభయలోభమోహశోకాదు లింక
జన్మమృత్యుజరాదులు జనుల కెల్లఁ, దనరుచుండును స్వాజ్ఞానమునను నిజము. 63

వ. మఱియును. 64

సీ. ఆత్మ ముత్తముండు భావాభావవర్జితుం డానందరూపుఁ డనంతుఁ డమలుఁ
డేకట సంయోగ వియోగంబులును లేవు జ్ఞానాత్మ శుద్ధుండు గాన నిట్టు
లే నెఱింగియుఁ గ్రోధమూని వానిపదంబు గాంతు నీ వట నేయుక్రమము వినుము
సీతను ఖడ్గంబుచేతఁ ద్రుంచి మదీయతనువుతోడను గూలు ననలమందు
తే. ననుచుఁ బలుకంగ విని శోకమునను దైత్య, లోకనాయక! నాబుద్ధి నీకుఁ జొఱదు
ఏటిమాటలు నీవు జయింపఁగలవె, రాఘవేశ్వరు దివిజశరణ్యు విష్ణు. 65

తే. అమ్మహాదేవుఁ డఖిలలోకాధినాథుఁ, డతఁడు పురుషప్రధానుల కాద్యుఁ డింక
గల యనేకంబు లతనిలీలలు వచింప, జలరుహభవాదులకు నైన నలవిగావు. 66

వ. అయినను నాయెఱుంగుకొలంది వివరించెద నెట్లంటేని. 67

ఉ. మును వైవస్వతధారుణీరమణు నంభోరాశిమధ్యంబునం
దున భీతిం గనకుండ భక్తుఁడని విద్యుత్పుంజముంబోలు మే
నును బల్గ్రుష్ఠు వెడందవాలమును జెన్నొంద న్మహామత్స్యమై
కని రక్షించెను రాఘవేశ్వరుఁడు సోత్కంఠత న్సురారీశ్వరా. 68

వ. మఱియును. 69

మ. వనధిన్ మందరధారుణీధరము గవ్వం బొప్ప దేవాసురుల్
మును దోశ్శక్తి సుధార్థులై తరువఁ దద్భూభృద్వ్రతంసంబు ని
ల్వను సామర్థ్యములేక వార్ధిఁ బడ భాస్వత్కచ్ఛపాకారమై
కనకక్ష్మాధర మెత్తె రాముఁ డపయంగా భూమిభృన్మాత్రుఁడే. 70

వ. వెండియు. 71

మ. అవనీమండలమెల్లఁ గైకొని హిరణ్యాక్షుండు పాథోధియం
దవలీలం జొర నిమ్మహామహుఁడు శౌర్యస్ఫూర్తి నవ్వేళ మిం
చువరాహాకృతిఁ బూని ఖడ్గమున రక్షోవల్లభుం ద్రుంచి బం
తివలెం గొమ్మున నెత్తె ధారుణి ధరిత్రీనాథు లీపాటియే. 72

వ. ఇదియకాదు. 73

బెంచఁగ సంసరణాబ్ధి గాన విడి నేఁడేఁ గాంతు సద్భక్తి సే
వించం బుణ్యము నొసంగు శ్రీహరిని హృద్వీథిన్ సరోజాననా!. 86

## రావణుఁడు మూఁడవసారి యుద్ధమునకు వెడలుట.

వ. ఇట్లు దశాననువాక్యంబు మాసతి కతిరంగించి యావృత్తాంతంబు మహాదేవుం డిట్లనియె నట్లు దశాననుండు మందోదరి కెఱుంగం బలికి నివారించి తాను వివిధాభరణభూషితుండై సమాబలంబును షోడశచక్రసమాకులంబును ఘంటాశతశోభితంబును నై పిశాచవదనంబులగు వేసడంబులం బూన్చిన యరదం బెక్కి ఖడ్గరోమప్రముఖదోషాచరయూథపులు భయావహాకారంబుల బనిసి నడువ సకలసైన్యంబులును సింహనాదంబులు సేయ భీషణుండును రణకర్కశుండును నగుచుఁ బురద్వారంబు వెడలి సైన్యంబున కభిముఖుండై నడచె నాసమయంబున. 87

క. చనుదెంచెడు రావణుఁ గనుఁగొని వనచరసైన్య మెల్లఁ గొందలపడుచున్
జనియెను రామునివెనుకకు, హనుమంతుం డదియుఁ గాంచి యాగ్రహ మొప్పన్.

సీ. పఱతెంచి చనుదెంచు పంక్తికంధరు నత్తు మదరుదోఁచెడు ముష్టిఁ బొడువ వాఁడు
పసచెడి సతికిలఁబడి యంతఁ దడవున కమ్మూర్ఛ దేఱి నో యాంజనేయ
మేటివంటివు నాకు మెచ్చువచ్చె నటన్నఁ బంక్తికంధర నిన్ను బ్రతుకనిచ్చెఁ
గాల్ప నే నాగ్రుద్దు కడగి నీవును నన్నుఁ బొడుచుట మంతలు నీగుపోంక మున్నెఁ గు

తే. ననిన సాగ్రహుండై వాయుతనయుని వక్షు, మన్నకాటుమం... బొడువ వాతాత్మజుండు
ఘూర్ణలోచనుఁడై ధాత్రిఁ గూలి మరలి, దెలిసి యొక కొండఁ గొని పంక్తిఁ దీఁటుకొనుచు.

వ. దశాననుపయిం గవిసె వాఁడును భీతచిత్తుండై యొండుదెసకుఁ దేరుపఱపించె నంత.

తే. తత్సమీపంబునం గల్గు దైత్యవరుల, మేటిమగలను ... గీటడంచి
పవనసిలాంగదాంజనీతనయు లపుడు, చని శ్రీరామచంద్రుని సముఖమునకు 91

వ. ఇట్లగ్నివర్ణ సర్పరోమ వృశ్చికరోములను గ్రమక్రమంబున గీటడంచి విహరించు ప్లవంగులం గనుంగొని రావణుండు తత్సంరంభంబు సహింపంజాలక రథంబు ద్రిప్పించి పెదవులు గొఱుకుచు నతిరోషంబున. 92

చ. వనచరసైన్య మెల్ల శరవర్షముచేతను ముంచుచున్ గృతాం
తునిగతి రాముపై నడువఁ దోయజమిత్రకులీనుఁడున్ మహా
శనిసమసాయకంబులను జాపమునం దొనగూర్చి యేసె న
ద్దనుజురథంబుపై సమరదర్ప మెలర్ప హిమాద్రినందనా!. 93

వ. అంత దశాననుండును నిశితకాండంబులా రాజరత్నంబు పయిం బఱపిన వాని నెల్ల నడుమన చక్కాడి రఘునాయకుండును డెబ్బది సాయకంబుల నయ్యామినీచరు

వక్షంబు గాఁడ నేసె నిట్లుభయులును దంతావళద్వయంబుభంగిఁ బోరునవసరంబున.

ఆ. రథముపైఁ జెలంగు రావణు ధరణిపై, నిలిచి పోరొనర్చు నృపవరేణ్యుఁ
గాంచి జంభవైరి గ్రక్కున మాతలిఁ, బిలిచి యిట్లనియె జలజనయన!. 95

ఉ. రాజకులైకభూషణుఁడు రామవిభుండు రథంబు లేక యి
ట్లాజితలంబున న్నిలుచునా నె గుణాకర! నీవు మద్రథం
బా జననాథునొద్దకు రయంబునఁ దోడుకపొమ్ము కార్యమున్
తేజము గల్గు రావణుఁడు దీయు సహింపఁగవచ్చునందఱున్. 96

వ. అని యివ్విధంబున దివిజవల్లభుం డానతిచ్చిన మాతలియుఁ దత్పదంబుల కెఱఁగి హరి
తవర్ణంబులగు తురంగంబులం బూన్చి యాయితంబు చేసి దీప్యమంతంబగు నరదంబు
గొనుచు రఘునాయకు సమీపంబునకుం జనుదెంచి ముకుళితకరకమలుం డై యి
ట్లనియె. 97

ఉ. దేవ! శచీవిభుండు భవదీయజయార్థము పంచె నీరథం
బీవరఖడ్గతూణయుగ మింపగు నైంద్రశరాసనంబునున్
గావున వీనిఁ గొంచు దశకంఠునడంపుము వృత్రుఁ బట్టి యా
దేవవిభుండు తొల్లి కడతేర్చినపోలిక మత్సహాయతన్. 98

తే. అనుచుఁ బలుకంగ రాఘవుం డారథోత్త
మమున కతిభక్తి మ్రొక్కి సేమము దలిర్పఁ
బూర్వధరణీధరంబుపైఁ బొల్చు మిహిరుఁ
డనఁగఁ దత్స్యందనారూఢుఁ డయ్యె నపుడు. 99

## శ్రీరాముఁ డింద్రరథంబుపై నెక్కి రావణునితో యుద్ధముచేయుట.

వ. ఇట్లు జగంబులకు నుత్తి నొనగూర్చుచు నైంద్రరథారూఢుం డై యశనిసంకాశం
బులగు నిశితకాండంబుల న్నిశాచరవల్లభుని యింగురియింప నొండొరులకును రోమ
హర్షణంబగు తుములసమరం బయ్యె నయ్యవసరంబున. 100

మ. అనలాస్త్రంబు దశాననుం డనుప నయ్యస్త్రంబుచేఁ ద్రుంచె న
ధ్వను శ్రీరాఘవుఁ డంత రావణుఁడు దేవాస్త్రంబు సంధింప దా
నిని దైవాస్త్రముచే నడంచె నిటు లెన్నే నస్త్రము లైవ న
న్నిని వ్యర్థం బనుమాడి పెంపెసఁగ నన్నీచుండు క్రోధాంధుఁడై. 101

మ. ఇంకెక్కడ్లం బలుసాయకంబు లిడి భూపాలాధమా! నిన్ను నీ
త్రిదివంబుల్ కేమర్పఁ జూడు మని తద్బాణావళిన్ రాముపై
వడిన్ ముంచెను గ్రక్కునన్నవియు భాస్వత్సర్పరూపంబు లై
పడెం దిక్కుల రాఘవేంద్రుఁ డభవుం జూచెన్ జాతత్రేతకా!. 102

ఆ. నూటయొక్క మాఱు నిటఁ దుంచితి వీని, శిరము లింతయైనఁ జేటు గనఁడు
తొల్లి మేటిరిపులఁ దునిమి వైచిన నాఁడు, శస్త్రసమితి వ్యర్థసార మయ్యె 110

వ. అనుచు సకలశాస్త్రవేత్తయు శూరుండును నయ్యుఁ గౌసల్యానందనుం డివ్విధంబునఁ జింతింపఁ దత్సమీపంబున నుండి ముకుళితకరకమలుండై విభీషణుం డిట్లనియె. 111

సీ. వినవయ్య! రఘునాథ! మును వీనితపమున కాత్మ మెచ్చి పయోరుహాసనుండు
వర మొసంగెను బోరి శిరము లెవ్వరు త్రుంప జనియించు దోడనె యనుచు మఱియు
నమృత నాభిస్థానమందుఁ బీయూషంబు నుంచెలా కాన్మై యుండుఁ గాన
నింకింపు మనలాస్త్ర మేసి యంతట వీఁడు సమయు నక్కమటన్న సకలభూత
తే. ములకుఁ ద్రిగుణంబులకుఁ జూడ ముఖ్యుఁ డయ్యుఁ
దెలిసియుండియు నెఱుఁగని తెఱఁ గొనర్చి
పావకాస్త్రంబు సంధించి భస్మముగను
జేసె దశకంఠు నాభిప్రదేశ మపుడు. 112

వ. ఇట్లొనరించి వెండియు ననేకసాయకపటంపరల నయ్యామినీచరవల్లభుశిరంబు లెల్లను మహాధ్వని వీవ ధరాతలంబునం బడన్ డుప వాఁడును లెక్కసేయక యాత్మ మచ్చేదనకరంబులగు విభీషణుభాషణంబులకుం గనలి యొక్క శక్తి వైచిన నదియు విభీషణుపయిం గవయ శరణాగతవత్సలుండు గావున రఘునాయకుండు సమ్ము నంతింతలు గావించె నిట్లతిభయంకరంబుగ నొక్క శిరంబును రెం కరంబులును నవశేషంబు గాఁగఁ గదనరంగంబున నిలిచి వాఁడి చెడక సంసారసాగరంబువలన విముక్తుండనై పరమయోగీంద్రసేవ్యంబగు నారాయణస్థానంబు నొందెద నను దృఢనిశ్చయంబున నాగ్నేయప్రముఖదివ్యాస్త్రంబు లెల్లను నపహరించుచు మహాచలతుల్యుండై నిలిచె రాఘవేశ్వరుండును భవత్పాపసంఘంబు లెల్లం జక్కాడి ముక్తి యొసంగెద ననుచందంబున నైంద్రశరాసనతుల్యంబగు తనదు కార్ముకంబు కేల నందుకొని గుణంబు సారించి కాంచనపుంఖంబులును వజ్రసంకాశంబులును నగు ప్రచండసాయకంబులఁ దన్మాంసశోణితంబులు విహాయసమండలంబెల్లఁ గప్పఁ జించి చెండాడుచుండె నిట్లుభయులకును గ్రోధసంవర్ధనంబై పరాక్రమవిజృంభణంబై పెక్కుకాలంబు భయానకంబగు తుములసమరంబు చెల్లె నాసమయంబున మాతలి రఘునాయకుం గనుంగొని యిట్లనియె. 113

ఉ. భానుకులప్రసూత! భవబంధవిమోచన! రాఘవేంద్ర! సం
ధాన మొనర్చి శ్రేయము మఱి దత్పహారాస్త్రము బ్రాహ్మ మంచు నీ

దానవుకంఠదేశ మునఁ దప్పక మర్మముఁ జెందు నట్లు స
న్ధాన మొనర్చి సేయుము వెస మాతలి! యంచు మహాగ్రహంబునన్. 114

క. తన పాణ్యగ్రంబునఁ బెనఁగుం, దనుజాంతకు లుఘోరగుణం బగు నాకృతి నభమున్
గనఁగాంచు విధంగాఁ, మును సూర్యసహస్రతేజమును సన్నుతమున్ 115

వ. మఱియును సకలజగద్భయనివారకంబును నంచితంబును జాజ్వల్యమానంబును వినా
శకాలంబు ననుకరించు దనుజాలపై నేయునదియును మహోగ్రంబును నగు బ్రహ్మా
స్త్రంబుఁ జేత నందుకొని వేదోక్తప్రకారంబున బాణాసనసంధానంబు గావింప
సకలభూతంబులును సంత్రస్తంబు లయ్యె సర్వంసహాచక్రంబును జలియించె నిట్లు
గు వేళ మర్మఘాతకంబగు నయ్యస్త్రంబు బలిప్రయత్నంబున రామచంద్రుండు విము
క్తంబు సేయ నదియును మహాజ్వాలాకలితంబై వెడలి పఱతేర రావణుండును
నయ్యస్త్రంబున కెదురునడచి శరాసనంబు గొని బలుసాయకంబులు విగుడింప నది
యును మహేంద్రప్రేరితంబగు వజ్రంబుభంగి దుర్ధర్షవేగంబునఁ దచ్ఛిలీముఖంబుల
లెక్కగొనక. 116

## —శ్రీరాముని చేత రావణుఁడు చచ్చుట.—

మ. భయదంబై దశకంఠుఁ దాఁకి యురమున్ భంజించి గర్వంబు సో
చ్చి యటం బ్రేవులు చించి చంపి పడిఁ దచ్ఛేపాహి నీక్షించి మ
ల్లి యథాప్రక్రియ రామచంద్రువెనుకన్ లీలాగతి న్వచ్చె నం
త సుమర్త్యారి గుభిల్లునం బడియెఁ దద్గాత్రం గతప్రాణుఁడై. 117

వ. ఇట్లు శరాసనంబులు విడిచి ధరాతలంబునం బడిన నిశాచరవల్లభుం గనుంగొని తక్కి_న
సైన్యంబులు నలుదిక్కులకుం బఱచి నంత శాత్రవవిధ్వంసంబును రఘునాయకుని విజ
యంబును గనుంగొని జితకాశంబులగు వనచరసైన్యంబు లెల్ల సంభ్రమంబునఁ
గీర్తింపం దొడంగె నఖిలభువనంబులు నిండ దేవదుందుభులు మొఱసె సురలు
పుష్పవర్షంబులు గురిసి రప్సరోగణంబులు నృత్యంబు సలిపిరి. మహర్షివర్గంబు లెల్ల
వేదవాక్యంబుల వినుతి యొనరించి రంత. 118

తే. రావణుని మేను వెడలి సూర్యప్రకాశ, మగుచు నొక తేజ మప్పు డయోధ్యాధినాథు
తనువునను జొచ్చె నది కనుంగొని మహాత్ము, లమరు లెల్లను గడువిస్మయంబుతోడ.

ఉ. ఎంతటి భాగ్యవంతుఁ డఖిలేశ్వరుఁ జేఁదె దశాననుండు గు
ర్వంతుఁడు విష్ణుమాయకుఁడు సజ్జనహింసకుఁ డయ్యు నేఁడు సే
వింతుము సాత్వికాంశులము విష్ణుని సత్కృపఁ గాంచినార మి
ట్లింతయుఁ గల్గియు న్నన మొకింతయు సంస్మృతిఁ బాయఁ గంటిమే. 120

ఆ. నూటయొక్కమాఱు గీటడంచితి వీని, శిరము లింతయైనఁ జేటు గనఁడు
త్రొల్లి మేటిరిపులఁ దునిమివైచిన నాదు, శస్త్రసమితి వ్యర్థసార మయ్యె 110

వ. అనుచు సకలశస్త్రాస్త్రవేత్తయు శూరుండును నయ్యుఁ గౌసల్యానందనుం డివ్విధంబునఁ జింతింపఁ దత్సమీపంబున నుండి మునులోకరక్షకులుం డై విభీషణుం డిట్లనియె. 111

సీ. వినవయ్య! రఘునాథ! మును వీనితపమున కాత్మ మెచ్చి పయోరుహాసనుండు
ఇది యొసంగెను బొడ్డ శిరము లెన్నియు త్రుంప జనియించుఁ దోడనె యనుచు మఱియు
నమృత నాభిస్థానమందుఁ బీయూషంబు నుంచెలా కారణమై యుండుఁ గాన
నింకింపు మనలాస్త్ర మేసి యంతఃస్థ పీయూష సముదయ మొక్కటనున్న సకలభూత

తే. ముఖ్యులకుఁ ద్రిగుణంబులకుఁ జూడ ముఖ్యుఁ డయ్యుఁ
దెలిసియుండియు నెఱుఁగనితెఱఁ గొనర్చి
పావకాస్త్రంబు సంధించి భస్మముగను
జేసె దశకంఠు నాభిప్రదేశ మపుడు. 112

వ. ఇట్లొనరించి వెండియు ననేకసాయకపటంపరల నయ్యామినీచరవల్లభుశిరంబు లెల్లను మహాధ్వని వీప ధరాతలంబునం బడనేయుచు వాఁడును లెక్క సేయక యాత్మమర్మచ్ఛేదనకరంబులగు విభీషణభాషణంబులకుం గినిసి యొక్క శక్తి వైచిన నదియు విభీషణుపయిం గవయ శరణాగతవత్సలుండు గావున రఘునాయకుండు దామన నంతింతలు గావించె ని ట్లతిభయంకరంబుగ నొక్కశిరంబును రెండు కరంబులును నవశేషంబు గాఁగఁ గదనరంగంబున నిలిచి వాఁడి చెడక సంసారసాగరంబువలన విముక్తుండ నై పరమయోగీంద్రసేవ్యంబగు నారాయణస్థానంబు నొందెద నను దృఢనిశ్చయంబున నాగ్నేయప్రముఖదివ్యాస్త్రంబు లెల్లను నడరించుచు మహాచలతుల్యుండై నిలిచె రాఘవేశ్వరుండును భవత్పాపసంఘంబు లెల్లం జక్కాడి ముక్తి యొసంగెద ననుచందంబున నైంద్రశరాసనతుల్యంబగు తనదుకార్ముకంబు కేల నందుకొని గుణంబు సారించి కాంచనపుంఖంబులును వజ్రసంకాశంబులును నగు ప్రచండసాయకంబులఁ దన్మాంసశోణితంబులు విహాయసమండలంబెల్లఁ గప్పఁ జించి చెండాడుచుండె ని ట్లుభయులకును గ్రోధసంవర్ధనంబై పరాక్రమవిజృంభణంబై పెక్కుకాలంబు భయానకంబగు తుములసమరంబు చెల్లె నాసమయంబున మాతలి రఘునాయకుం గనుంగొని యిట్లనియె. 113

క. భానుకులప్రసూత! భవబంధవిమోచన! రాఘవేంద్ర! సం
ధాన మొనర్చి వ్రేయు మరిదర్పహరాస్త్రము బ్రాహ్మ మంచు నీ

దానవులకంతకుఁడౌ నని దలఁచి మర్త్యముఁ జెందు నవ్వన
స్నాన మొనర్చి సేయు నయ్యు మాతలి! యీచు మహోగ్రహాంబురమ్. 114

తివపాల్యంబునఁ బెనుచుం, దపలాఖ్యములు ఘోషించు సాకృతి సభయమ్మ
గనకాచలవిభగాల, ముసు సూర్య్యసహస్రతేజము సన్నుతమ్మ 115

వ. మఱియును సకలజగద్భయవిదారకంబును నందితంబును జాజ్వల్యమానంబును విశా
శకాలంబు సమీపించు దనుజాలపై నేయుననియును మహోగ్రంబును నగు బ్రహ్మా
స్త్రంబుఁ గేల నందుకొని వేదోక్తప్రకారంబున బాణాసనసంధానంబు గావించు
సకలభూతంబులను సంత్రస్తంబులు గావింప సర్వంకషోదగ్రంబును జలియించె నిట్లు
గువేళ సుస్మఘాతికంబగు నయ్యస్త్రం బతిప్రయత్నంబున రామచంద్రుండు విను
క్తంబు సేయ నదియును మహాజ్వాలాకలితంబై వెడలి సమతేర రావణుండును
నయ్యస్త్రంబున కెదురునడచి శరాసనంబుఁ గొని బలుసాయకంబులు నిగుడింప నది
యును మహేంద్రప్రేరితంబగు వజ్రంబుభంగి దుర్ధర్ష వేగంబునఁ దచ్ఛిలీముఖంబుల
లెక్కగొనక. 116

## శ్రీరామునిచేత రావణుఁడు చచ్చుట.

మ. భయదంబై దశకంఠుఁ దాఁకి యురమ్ము భంజించి గర్వంబు సో
చ్చి యటం బ్రేవులు చించి చంపి పడఁ దచ్ఛేషాహి నీక్షించి స
ల్లి యథాప్రక్రియ రామచంద్రు వెనుకన్ లీలాగతి న్నిల్చె నం
త సుమర్త్యారి గుభిల్లునం బడియెఁ దద్ధాత్రిం గతప్రాణుఁడై. 117

వ. ఇట్లు శరాసనంబులు విడిచి ధరాతలంబునం బడిన నిశాచరవల్లభుం గనుంగొని తక్కిన
సైన్యంబులు నలుదిక్కులకుం బఱచి రంత శాత్రవనిధనంబును రఘునాయకుని విజ
యంబును గనుంగొని జితకాశంబులగు వనచరసైన్యంబు లెల్ల సంభ్రమంబునఁ
గీర్తింపం దొడంగె నఖిలభువనంబులు నిండ దేవదుందుభులు మ్రోసె సురలు
పుష్పవర్షంబులు గురిసి రప్సరోగణంబులు నృత్యంబు సలిపిరి. మహర్షివర్గంబు లెల్ల
వేదవాక్యంబుల వినుతి యొనరించి రంత. 118

తే. రావణునిమేను వెడలి సూర్య్యప్రకాశ, మగుచు నొక తేజ మప్పు డయోధ్యాధినాథు
తనువునను జొచ్చె నది కనుంగొని సురాసు, లమరు లెల్లను గడు విస్మయంబుతోడ.

ఉ. ఎంతటిభాగ్యవంతుఁ డఖిలేశ్వరుఁ జెందె దశాననుండు గు
ప్తాత్ముఁడు విష్ణుమాయకుఁడు సజ్జనహింసకుఁ డయ్యు నేఁడు సే
వింతుము సాత్వికాంశులము విష్ణుని సత్కృపఁ గాంచినార మి
ట్లింతయుఁ గల్గియున్న మొఱఁతయు సంసృతిఁ బాయఁ గంటిమే. 120

వ. మఱియు విభీషణా! సలిలప్రవాహంబునం బడిన సైకతంబులంబోలి దేహులును గాలప్రవాహంబునం గలియుచు వీడుచుం దత్తద్యోగవశంబులై తిరుగుచుండుదురు. ధరణీపతితంబులగు ధాన్యంబులపోలిక జగదీశప్రేరితంబులై యమ్మహామహిమాయాగుణంబున భూతంబులవలన భూతంబులు నుద్భవించుచు లేకయుండుచు నుండు. నీవును మృతుండగు దశాననుండును నేనును దక్కిన జనంబులును గాలవశంబున జనియించితి మిందఱము సమానుల మింక నెక్కాలంబున నెవ్విధంబున నెవ్వనికి జన్మమృత్యువులు లిఖితంబు లక్కాలంబున నవ్విధంబున నాతనికి నలభ్యంబులై గలుగుచుండు. ఈశ్వరుండును సజాంశయ్యును సకలభూతంబులవలనను భూతంబులం బుట్టించుచు సంహరించుచు ననపేక్షుండై బాలునిచందంబునం గ్రీడించుచుండు. బీజంబువలన బీజంబులుఁ బుట్టినచందంబున దేహియగు జీవుని వలనను దేహంబుచేత నితరదేహసాంగత్యమునను శాశ్వతుండును నద్వయుండును నయ్యు జనియించినచందంబున నుండు. దేహి యుద్భవించు మఱియు హుతాశనుం డందు దారుక్రియానుగతసర్గంబులు గలవను భ్రాంతిభంగి మిథ్యాత్మ్యాధ్యాసవలన నాత్మయందును ననాత్మ్యంబులు నుజన్మనాశనంబులును వృద్ధిక్షయంబులును గ్రియాఫలంబులును దోఁచుచుండు. గాఢసుషుప్తివేళ నహమ్మానంబులు లేమివలన వానికి సంసారంబులేదు కావునఁ దద్విధంబున జీవితుండై యుండినను విముక్తుం డగువానికి నహంకృతి లేదు కావున సంసారంబునుం గలుగనేరదు దిది యంతయు మాయామయంబగు మనోమాత్రంబు గావున నహమ్మమతలు రెండును విడిచి విగతబాహ్యేంద్రియార్థసంబంధుండవై తద్దోషంబుల నెల్ల మనంబునసుం గనఁబఱచి భగవంతుండును నాత్మయు నీశ్వరుండును సర్వభూతాత్మయుఁ బరుండును మాయామానుషవిగ్రహుండును నానందసాంద్రుండును నగు శ్రీరామచంద్రపరబ్రహ్మంబువలన మనంబు గీలుకొల్పు మింక క్షణసంగమభంగురంబులగు దారాగారాదులును శబ్దాదివిషయంబులును దేహబుద్ధివలనం గాని యాత్మచేతఁ గాదు దేహంబువలన విలక్షణుండు గాఁగ నాత్మ నెఱింగితేని యవియెల్లను దోఁచనేర వట్లుగావున నీ వింక రాజ్యంబున నుండియు భూతభవిష్యద్వర్తమానంబుల నూహింపుచుఁ బ్రారబ్ధంబు లనుభవించుచు భక్తిభావితుండవగు రఘునాయకుం దలంచుచు యథాన్యాయంబుగ విహరించితివేని యొకానొకసమయంబున నైనను సంసారదుఃఖంబులు నిన్నుఁ సంస్పృశింపనేర విప్పుడు దశాననునకు సాంపరాయికంబు లాచరింపు రఘువల్లభుండు నిన్నుఁ బనిపనిచెం గావున నమ్మహాత్ము నాజ్ఞ యొనరింపుము మూఢనిత్తులై విలపించుమందోదరిప్రముఖకాంతాజనంబుల నూఱడింపుము. బుద్ధిమంతుండ

వై లంకానగరంబునకుం జను మని యనేకవిధంబులఁ దత్త్వోపదేశంబులు గాఁగ
రామానుజుండు పలుక విభీషణుండును. 126

ఆ. విగతశోకమోహుఁ డగుచు శ్రీరఘువర్యుఁ, గానవచ్చి ధర్మకలితములుగ
నమర రామమానసానుకూలములుగాఁగ, బ్రణతుఁ డగుచు నిట్లు పలుకఁ దొడఁగె.

క. క్రూరుండు నృశంసుఁడు పర, దారాసక్తుండు త్యక్తధర్మవ్రతుఁడౌ
నీరావణుఁ డోరాఘవ, యేరీతిని దగును గ్రియల నే నొనరింపన్. 128

వ. అనిన సంతసించి రామచంద్రుం డిట్లనియె. 129

మ. మరణం బొందిన వైర మేల మనకున్ మున్నిగపఁ గాఁబోలు నీ
సరి నా కీతఁడుఁ గానఁ జేయు మిఁక సంస్కారంబు లన్నం ధరా
ధరధీరా! భవదాజ్ఞ యంచుఁ బితృమేధప్రక్రియ న్నాహితా
గ్నిరుచిన్ వేగమె యవ్విభీషణుఁ డొసంగెన్ వహ్ని శైలాత్మజా!. 130

వ. ఇట్లు సబాంధవుండై దశాననున కనలం బొసంగి స్నానంబు లొనరించి యావస్త్రం
బులతోడఁ దిలదర్భలు నుదకసమ్మిశ్రితంబులు చేసి విధిపూర్వకంబుగ విడిచి
శిరోఘటితకరపుటుం డై యన్నకు నమస్కరించి తద్భార్యల బహుభంగుల నూఱ
డించి లంకాపురంబునకుం బనిచి తానును రఘునాయకు సమీపంబునకుం జనుదెం
చి యతివినయుండై నిలిచె నంత. 131

ఆ. సైన్యయుక్తుఁ డగుచు సానుజుం డగుచు స, కీశవర్యుఁ డగుచు వానిమీఱ
రామచంద్రవిభుఁడు రాక్షసాధము వృత్రుఁ, జంపి చెన్నుమీఱు శక్రుకరణి.

సీ. అంత మాతలి రాఘవాంఘ్రియుగ్మములకు నొసలంట మ్రొక్కి యనుజ్ఞ వడసి
గగనమార్గమున స్వర్గముఁ జేరె రాఘవుండును నిజానుజుఁ గాంచి యనియె నిట్లు
లక్ష్మణా! మున్నె యీలంక నే నొసఁగితి నైన నీవిపుడు తద్బాధ్యుఁ గాఁగ
విధ్యుక్తమా మంత్రవేత్తలౌ విప్రులచేతఁ జేయింపు విఖ్యాతచరిత

తే. నివ్విభీషణు నన లంక కేఁగి వార్ధి, జలముఁ దెప్పించి సద్విప్రజనులచేతఁ
బ్రీతి రామానుజుండు విభీషణునకుఁ, జెలఁగి సేయించె రాజ్యాభిషేక మపుడు.

వ. ఇట్లొనరించి పౌరజనంబు లెల్ల నానావిధోపాయనపాణులై తోడ నడువ లక్ష్మ
ణుండును విభీషణుం దోడుకొని రామచంద్రుసమీపంబునకుం జనుదెంచి యుభ
యులును దండప్రణామంబులను గావించి రంత రాఘవుండును బ్రాప్తరాజ్యుం
డగు విభీషణుం గనుంగొని భానునందనున కిట్లనియె. 134

ఉ. మీపృథుదోస్సహాయమున మేటిదశాననుఁ డీల్గె రాజ్యముం
జేపడి యివ్విభీషణుఁడు సేమము నొందెను మత్ప్రతిజ్ఞ స

ద్వ్యాపకమయ్యె నంచు బవనాత్మజుఁ గాంచి ప్రతాపవంతి! నీ
వీపగిదింతయుం జని మహీసుతతోడ నెఱుంగఁ బల్కుమా. 135

వ. విభీషణానుమతంబున. 136

తే. పలికి యద్దేవివాక్యంబు దెలియ నాకు, వేగఁ జనుదెమ్ము యన నతివేడ్కతోడఁ
జని నిశాచరసేవ్యుఁడై దనుజరాజు, భవన మటుసొచ్చె వాయుజుం డవిరళముగ.

హనుమంతుండు సీతకడకుం జని శ్రీరామునివిజయంబు చెప్పుట.

వ. చొచ్చి తదంతఃపురశింశుపాతరుసమీపంబున ననిందితయుఁ గృశీభూతయు దను
జకాంతాపరివృతయు నగుచు రామ! రామా! యని దీనవదనయై ధ్యానించు విదే
హరాజకన్యకారత్నంబునుం గనుంగొని నమస్కరించి కరంబులు మొగిడ్చి యద్దేవి
మహాప్రసాదం బీక్షించుచు నిలిచె నంత. 138

క. పూర్వప్రకృతితోడుత నా, పర్వేందునిభాస్య రామభక్తుం డని యా
శీర్వచనం బొనరింపఁగ, నుర్వీసుతయాననాబ్జ మొప్పఁగ నపుడున్. 139

క. కనుఁగొని వాయుజుఁ డనియెను, జననీ! కుశలంబు రామచంద్రుఁడు దశకం
ఠునిఁ ద్రుంచె సపరివారము, గను లంక విభీషణునకుఁ గరుణ నొసంగెన్. 140

వ. సుగ్రీవలక్ష్మణవిభీషణసహాయుండై యింతయు నొనరించి యుపశమితక్రోధుండై
సుఖంబున నున్నవాఁ డివ్విజయవార్త మీకెఱింగింపు మనుచు నన్నుఁ బనిచె ననిన
నతిముదంబున. 141

క. తనవిభుని విజయవార్తయు, విని పవనజ! త్రిభువనములవెదకఁగ నీ కీ
యను వస్తువుమితి గనఁబడ, దనఘ! భవత్సదృశు లెవ్వ రరయఁగ నాకున్. 142

వ. అనుచు బహువిధంబులం గారవించినఁ దల్లీ! విగతశత్రుండును సుస్థితుండును
నగు రఘుపుంగవుం గాన నేఁగెద ననిన జనకనందన యిట్లనియె 143

చ. అనిలతనూజ! సద్గుణము లన్నియు నీదగు రూప మయ్యె నా
జనవిభుఁ గాంచ వేడ్క యగు సమ్మతితోడఁ దదాజ్ఞఁ దెమ్ము పొ
మ్మనిన నమస్కరించి కమలాప్తకులీనునిఁ జేరి వాయుజుం
డనుపమభక్తితోడుత ధరాత్మజ పల్కులు తత్స్వరూపమున్. 144

వ. ఎఱిఁగించుచు మఱియు నిట్లనియె రఘునాయక! యీయుద్యోగారంభంబును నీఫ
లోదయంబును నెవ్వరికొఱ కట్టి జనకనందనను రావించకునికి కర్జంబు గా దనిన
విజ్ఞానగరిష్ఠుండగు రఘుశ్రేష్ఠుండును. 145

సీ. మాయామహీజను మఱచి పావకునంగుఁ దనరు వసుంధరాతనయ నాత్మఁ
గాంచి విభీషణుఁ గనుఁగొని గుణసాంద్ర, నీవు మత్సతిని వినిర్మలాంబ

రాభరణాంచిత యగునట్లు సేయించి తెప్పింపు మన మారుతియును దాను
జని శుద్ధులైన రాక్షసభామినులచేతి మజ్జనం బొనరించి మహితగంధ
తే. మాల్యకౌశేయములను నమూల్యరత్న, సంకలితభూషణముల నలంకరించి
మించు శిబికోత్తమంబున నుంచి వెడలె, రామసామీప్యమున కద్రిరాజతనయ.
వ. ఇట్లు కంచుకోష్ణీషంబులం బూని వేత్రహస్తులగు పౌలస్త్యభృత్యులుచుట్టును నిల్చి కాపు
సేయ నియోగించి తోడితెచ్చు నవసరంబున. 147
క. వనచరు లతికౌతుకమున, జనకతనయఁ జూడ రాఁగ నార్భటు లెగయఁగా
దనుజులు వారింపుచు నిట్లు, చనుదెంచిన నదియు రామచంద్రుం డపుడున్. 148
వ. దూరంబున నుండి కనుంగొని శిబికారూఢ యగుటకుఁ గారణం బేమి యనుచు
ముందు చనుదెంచిన విభీషణుతో నిట్లనియె 149
చ. దనుజులు వానరేంద్రుల నదల్పఁగ నేటికిఁ దల్లి యంచుఁ గ
న్గొనెదరు గాన డిగ్గి యిటకుం జనుదేరఁగఁ బల్కుమన్న న
మ్మనుజవరేణ్యుమాట విని మైథిలి చయ్యనఁ బాదచారియై
జనవిభుఁ గానవచ్చెఁ గపిసత్తము లబ్బురఁ దన్నుఁ గన్గొనన్. 150
తే. అనుపకార్యార్థనిర్మితి యొనరుపట్టి, సీత నటు గాంచి దుర్భాష లాడఁజేసి
పలుకఁ దొడఁగిన వినలేక పలికె లక్ష్మ, ణా! త్వదగ్రజుఁడను నురలెల్ల నమ్మునట్లు.
సీ. అనలంబు బొనర్పు వేగ నందుఁ జొచ్చెద నన్న సౌమిత్రి యారామచంద్రుచిత్త
మెఱిఁగి వహ్ని నొనర్చె సుదతి రామునిపొంత నిలచె సీతయు నంత నిర్భయమున
మూఁడు ప్రదక్షిణంబులు రామచంద్రున కొనరించి రాక్షసాంగనలు నఖిల
లోకంబులును జూడ లోహితాశ్వునిముందు నిలచి చేతులు మోడ్చి నిఖిలదేవ
తే. తలను భూసురులను వందన మొనర్చి, యనుదినంబును రామార్పితాంతరంగ
నైతినేని జగత్సాక్షియైన యనలుఁ, డంచితంబుగ నన్ను రక్షించుఁగాత 152
వ. అనుచు గద్గదాయమానంబులగు నెఱమంటలతోడం దేజరిల్లిన యమ్మహానలంబు
నకుం బ్రదక్షిణంబు గావించి నిర్భీతస్వాంతయై తన్మధ్యంబున నిలచె నైనను. 153
క. ఏయమ్మబంటు నిజవా, లాయితఘోరాగ్నిశిఖల కతిశైత్యకరా
పాయ మొనర్చెనొ తలఁపఁగ, నాయమ్మకు వహ్ని చల్ల నగుట కరుదే. 154
వ. తత్సమయంబున నఖిలభూతసిద్ధగణంబులును హాహాస్వనంబులు. 155
ఉ. ఏమి రఘూత్తముండు జగదీశ్వరుఁ డయ్యును లోకమాత నీ
రామఁ బవిత్రితాత్మ నిజరాజ్యసుఖావహ నిట్లెయుంగకన్
పావకవృత్తిఁ దాల్చెనని పల్కఁ దొడంగి రటంచుఁ బల్కియు
న్గావుమనందలంపఁడని గిరికన్యకతోడుతఁ దోన నిట్లనున్. 156

తే. హృదయమందునఁ బవనసముచ్చయములను, గుదియఁగను బట్టి నినుఁగట్టి కూర్మిఁబట్టి
పట్టి వీడని భవము పోఁగొట్టియట్టి, దిట్ట దనరాని గతి గాంతు రినకులీన!. 165

సీ. పరిపూర్ణనుతనామ! భక్తిగమ్య! సమస్తవేదశాస్త్రప్రతిపాదకాఢ్య!
దృగ్గ్రాహకరత్నకిరీట! మాయాతీత! యీశ! మాయాసక్తుఁ డెఱుఁగఁ గలఁడె
మానీంద్రయోగవిధానయోగాభ్యాసభావితు లగువారి భావమునకు
సహచారివగు నిన్ను సకలలోకముల కాద్యంతుఁడవును బ్రోవ నధిపతివియు

తే. నీవె భువనాఢ్య! నాచేత సేవ లొంద, నింద్రనీలాభదేహ మింపొందఁ దాల్చి
దశరథాధీశ్వరునకు నందనునిభంగిఁ, గూర్మి చెలువొందఁ బుట్టిన ధార్మికుఁడవు 166

క. ఏకాశేషసుఖావహ!, లౌకికమన నాతిగమ్య! లక్ష్మీవర! స
త్కాకుత్స్థకులాధీశ్వర!, కోకాప్తసమానరత్నకోటీర! హరీ!. 167

వ. దేవా! విష్ణుండ వనాదిపురుషుండవు రమణీయుండవు భావాభావప్రత్యయవర్జితుం
డవు జగత్పావనుండవును ననుచు వేదంబులు పలుకు నట్టి జగన్నాథా! నీవ మన్నా
థుండ వింక శ్రద్ధాభక్తిగరిష్ఠులై యెవ్వరైనను నిన్నుం గొనియాడినయట్టి
సత్పురుషకామితకామప్రదుండవు శ్యామలతనుండవు నగు నిన్నుం దలంచుచు
బ్రహ్మజ్ఞాననిధానంబును నాద్యంబును నగు నీ స్తవరాజంబుఁ బఠియించిరేని విగత
పాతకజాలులై భవత్సాన్నిధ్యంబు నొందెదరు గావుత మనుచు బహువిధంబుల
వినుతి యొనరించె నిట్లు పలుకు లోకగురుని వాక్యంబులు విని ప్రపంచసాక్షి
యగు వైశ్వానరుండు విమలారుణద్యుతికలితయు రక్తాంబరయు దివ్యభూషణాంచి
తయు నగుచుఁ జెలువొందు విదేహరాజకన్యకామణిం గైకొని ప్రపన్నార్తినివహ
విదారణుండగు రఘునాయకు సమీపంబునకుం జనుదెంచి యిట్లనియె. 168

సీ. దేవ! గైకొనుము విదేహావనీశ్వరనందన మును దశానను వధింప
నటవియందునను మాయామహీజ నొనర్చి నాయందు నిలిపితి వీయిలాత్మ
జను నేఁడు బాంధవసహితుఁడై దశకంధరుఁడు తావకాస్త్రాలి నడఁగె మించు
ధారుణీభర మెల్లఁ దఱిఁగెఁ దత్ప్రతిబింబితయు తిరోహితయయ్యె నయముతోడఁ

తే. బరమపావనిఁ దావకపాదపంక, జార్పితస్వాంత నిర్దోష నవనిసుతను
గైకొనుము దీన నఖిలలోకములుఁ గవ్వ, భీతిఁ బాపుము నీచెవిఁ బెట్టు మనవి.

చ. అని శిఖి విన్నవింప ముదమందుచుఁ దత్ప్రతిబింబరూప సీ
తను విడి పూజచేసినఁ దన్పి ముదం బొదవన్ సదానపా
యిని యగు లోకమాత మిథిలేంద్రతనూభవ సీత నంకమం
దున ధరియించె రాముఁడు మనోభవసుందరుఁ డాక్షణంబునన్. 170

వ. ఇట్లు జనకకన్యకాకలితసవ్యాంకప్రదేశుం డై వెలయు కౌసల్యానందనుం గనుంగొని ముకుళితకరకమలుం డై దేవనాయకుం డిట్లని వినుతింపం దొడంగె. 171

సీ. సన్మౌనిజనచిత్తసారసాదూరుఁ డై భూరినీలాభశరీరుఁ డగుచు
జనకసుతానందసందోహగేహుఁ డై సంభృతభిన్నిజోత్సాహుఁ డగుచు
నఖిలప్రపన్నార్తిహరణాభిధానుఁ డై ప్రబలరాక్షసతమోభానుఁ డగుచు
నగజామనోభావితానందరూపుఁ డై పాపవనాగ్నిప్రతాపుఁ డగుచు
తే. యోగమాయను గూడి తా నుర్వి నుండు, మనుజాకరణిని దోఁచుచుఁ దనదు చరిత
ములు వినినవారు సంతసమున మునుంగఁ, దనరు నెవ్వఁడు గొల్తు నద్దాశరథిని.

చ. సితకరకోటితుల్యముగఁ జెన్నువహించిన పీఠమందు భూ
సుతఁ గనకాంబరావృత విశుద్ధతటిత్ప్రభ నంకమందు సం
తతము వహించి భూభరవిదారణుఁ డై యమరాళి కెల్ల స
ద్భుతము జనింపఁజేయు రఘుపుంగవుఁ గొల్తు నిజాశ్రితావనున్. 173

క. అసురుల దుఃఖము లెల్లను, సమయఁగఁ జేయుతఱి మొదటిసాధనుఁ డై రు
ద్రముఖాదుల కగపడు పం, క్తిముఖాంతకు జానకీపతిని భజియింతున్. 174

క. పొగడఁదగి హరివరేణ్యుం, డగచరహితుఁ డీశుఁడును నిరాకారుఁడు ప
న్నగవలయసఖుఁడు నై మి, న్నగు నెవ్వఁడు గొల్తు నాపరానందమయున్. 175

క. యోగులు నిజభూరితపో, యోగంబునఁ దలఁపఁ దనువు నొగిఁ దాల్చి తను
ద్యోగానుసారి యగుచును, బాగగు చిన్ముద్ర గామభద్రుఁ దలంతున్. 176

తే. గర్వమున నుంటి మున్ను నే సర్వలోక, నాథుఁడ నటంచు నో జగన్నాథ! నీదు
పాదదర్శనమున నది వాసె నింక, మీఁద నీదాసులను గూడి మెలఁగువాఁడ 177

## దశరథుఁడు శ్రీరాముని యాశీర్వదించుట

సీ. ఆఖండలుం డిట్టు లనువేళ దివమున భగవంతుఁ డగు పురభంజనుండు
వ్యోమయానంబునం దుండి పల్కెను రామ! రామ! రాజకులాబ్ధిసోమ! చూడు
మిదె భవద్వైభవం బెలమిఁ గన్గొన వచ్చె దశరథేశ్వరుఁ డొందు తనువుఁ దాల్చి
మత్పార్శ్వమునకు సమ్మతి దివంబుననుండి యనిన రాముఁడు సుమిత్రాత్మజుఁడును
తే. భక్తితో నత సర్వభూపదములకును, వందన మొనర్పఁ గౌఁగిటఁ బొందుఁ జేర్చి
శిరము మూర్కొని మిగుల నాశీర్వదించి, పలికె నప్పు డ్డశరథుఁ డబ్జపత్రనయన!
తే. భూరిదుఃఖాలయంబు సంసారజలధి, వత్స! నీచేత దీని కావలను నయితిఁ
గాని నిను వీడి యుంట నాకమున నయిన, సంతసము లేదు సుతుఁ డనఁ జను నెనిన్ను

వ. అనుచు మరలి యాలింగనం బొనర్చి రామచంద్రుచేతఁ బూజితుం డయి దివంబు.

నకుం జనియె నప్పుడు మఱుంగు ముకుళితకరకమలుండయి వినుతియొనరించుచు పాక శాసనుం గనుంగొని రఘువల్లభుం డిట్లనియె 180

చ. సురపతి! వానరోత్తములఁ జూడుము మదీయ జయంబుఁ గోరి కూ
లిరి రణమందుఁ దొంటిక్రియ లేచెదుర ట్లమృతంబు చల్లు స
త్వరమున నన్న న ట్లమృతవర్ష మొనర్పఁ బ్లవంగసైన్యము
ల్బిరబిర మేలుకొన్న క్రియ లేచిరి దొల్లిటికన్న దార్ఢ్యులై 181

వ. ఇట్లు లేచి సింహనాదంబులు సేయుచు రామచంద్రు సమీపంబునకుం జనుదెంచిరి శైలనందనా! తత్సమయంబున విభీషణుండు రఘువల్లభు సమీపంబునకుం జనుదెంచి కరయుగంబులు మోడ్చి యిట్లనియె దేవా! నాయందుఁ గృప గలదేని సీతాసమేతుండవై మంగళస్నానం బొనరింపుము లక్ష్మణుండునుం గూడి వివిధాలంకారశోభితుండవై మమ్ములఁ దోడుకొని వెల్లి చనందగు ననిన రాఘవేశ్వరుం డిట్లనియె. 182

మ. సుకుమారుండు మదీయభక్తుఁ డతిసంశుద్ధుం డటన్ నాకుఁ బో
లికఁ జీరాజినధారియై భరతుఁ డక్లేశంబున న్నిల్వ న
య్యకలంకు న్విడి స్నానమే క్రియను జేయ న్నేర్తు సుగ్రీవము
ఖ్యకపిశ్రేష్ఠులఁ బూజసేయుము మిము న్సేయం బ్రీతి నాకయ్యెడున్. 183

క. అని పల్క విభీషణుఁ డ, వ్వనచరసైన్యములకెల్ల వలయునవెల్లను గాం
చనవస్త్రభూషణాదుల, దనిపె ముదం బొదవ నపుడు తనసిరి వారల్ 184

వ. రాఘవుండును వారి నందఱ వీడ్కొలిపి విభీషణుండు దోడితెచ్చిన భాస్కరసదృశంబును నుత్తమంబును నగు పుష్పకాఖ్యవిమానంబున యశస్వినియు లజ్జమానయు విద్యుత్ప్రభాంగియు వివిధాభరణభూషితయు స్మేరాననయు నగు విదేహకన్యకారత్నంబును స్వాంకస్థలంబునం దిడుకొని విశ్రాంతమన్మథుండగు లక్ష్మణుండు దోడునిలువ నారూఢుండై సమస్తవానరులను సుగ్రీవాంగదవిభీషణులం గనుంగొని యిట్లనియె. 185

ఆ. మిత్రకార్యమెల్ల మీచేతఁ జేయంగ, నొప్పె నింకఁ గష్ట మొందనేల
సైన్యయుక్తులగుచుఁ జనుఁడు నిజాలయం, బులకు మీకు సమము గలరె భువిని.

వ. విభీషణా! నీవు మద్భక్తుండవై సకలసుఖంబు లనుభవింపుచు లంకారాజ్యంబున నిలువు మాఖండలసహాయులగు దివౌకసు లయినను నిన్ను ధర్షింప సమర్థులు గారేను పితృరాజధానియగు సాకేతపట్టణంబుఁ గనుంగొన నిచ్ఛయించెద ననిన విభీషణుండును సుగ్రీవప్రముఖవనచరోత్తములును బాష్పపూర్ణలోచనులై యిట్లనిరి. 187

మ. పరమాహ్లాదముతో నయోధ్య నగు మీపట్టాభిషేకంబు నీ
శ్వరునిం బుత్రుని గాఁగఁ దాఁ గనిన కౌసల్యాసతిం గాంచ నం
దఱముం గోరెద మాజ్ఞ యిం డనిన సీతావల్లభుం డయ్యెడం
బరమోత్సాహము నొంది సంత రఘుభూపాలాజ్ఞచే వారలున్. 188

## శ్రీరాముఁడు సీతాసమేతుఁడయి పుష్పకము నెక్కుట.

వ. కౌబేరంబగు పరమాసనంబున వాయునందననలనీలాంగదజాంబవంతప్రముఖు లతి
ముదంబున. 189

క. ఆరోహణం బొనర్చిరి, యారఘువరునాజ్ఞచేత నదియు రయమునన్
ధారాధరమండల మటు, మీఱి దివంబునకు నెగసె మీననిభాక్షీ!. 190

వ. తత్సమయంబున. 191

క. ఆకౌబేరంబందునఁ, గాకుత్స్థకులేశుఁ డొప్పె గగనమున సురా
నీకము పొగడ మరాళము, పై కాంతాసహితుఁడైన పద్మజుకరణిన్. 192

తే. అదియు మార్తాండబింబతుల్యాభ మగుచు, రామలక్ష్మణసీతలచే మెఱుంగు
వెట్టునటు లవ్విహాయసవీథియందుఁ, జనఁగఁ దొడఁగెను బవనుచందమున వడిని.

వ. అనుచు. 194

క. శైలజ కిటు శ్రీరాముని, లీలలు పల్కుచును గుండలి(కదంబకవ)
ర్యాలంకారుఁడు రఘుభూ, పాలుని యవ్వాలి తెఱంగు పలుకఁ దొడంగెన్. 195

వ. అట్లంబరంబున నరుగు నవసరంబున నఖిలదిగ్భాగంబులం జూడ్కులు ప్రసరిం
పంజేయుచుఁ దత్కాలంబునకుం దగినట్టి వాక్యంబుల నమ్మిథిలేశ్వరకన్యకామణి
యగు సీతతోడుత రఘునందనుం డిట్లనియె 196

సీ. అదియ త్రికూటశైలాగ్రంబునను లంక రణభూమి యదె మాంసరక్తపంక
సంకులం బదియ రాక్షసకీశవైశసస్థలం బిచట వానరులు వొగడఁ
దునిమి వైచితి రావణునికంధరము లింద్రజిత్కుంభకర్ణులు చేటుగనిన
చోటు లల్లవియ యచ్చోట సేతువు సముద్రమునఁ గట్టించితిఁ దనరు నిదియు
తే. సేతుబంధం బటంచు విఖ్యాతితోడఁ, జూడఁ గ్రుంకిన మ్రొక్కిన వీడి చనును
గల్మషంబులు సౌఖ్యముల్ గల్గు నిదియు, వార్థితీర్థం బపారంబు వనజనయన! 197

క. ఇచట జగత్పతి శంభుం, డచలుఁడు రామేశ్వరాఖ్య నలరెను నాచే
నిచట విభీషణుఁ డురుస, ద్వచనుఁడు నను శరణుఁ గాంచెఁ దనమంత్రులతోన్.

వ. ఇదియ సుగ్రీవునిరాజధాని యగు కిష్కింధానగరంబు చిత్రకాననశోభితం
బనియె నచ్చట సుగ్రీవుండు సీతాప్రియార్థంబు తారాప్రముఖవానరకాంతాస

ముదయంబుల రావించె నంత మరలి పుష్పకం బంబరంబువం జనుసమయంబున
రాఘవేశ్వరుండు నిజజీవితేశ్వరిం గనుంగొని. 199

సీ. కమలాక్షి! ఋశ్యమూకధరాధరేంద్ర మల్లదియె వాలిని ద్రుంచి తీర్థలమునఁ
బంచవటి యను భవ్యాశ్రమం బిదె ఖరదూషణాదుల నతికివైచి
తిచట నగస్త్యమునీంద్రు నాశ్రమ మిదె యిదె సుతీక్ష్ణుఁడు తపం బెనయుచోటు
తాపసోత్తము లెల్లఁ దపము లొనర్చెడుచోటు లల్లవె చిత్రకూటభూరి
తే. భూధరేంద్రంబు కైకయీపుత్త్రుఁ డిచట, మత్ప్రసాదంబు గాంచె సన్మాన్యచరితుఁ
డగు భరద్వాజమౌనిపుణ్యాశ్రమంబుఁ, జూడు యమునాతటంబును సొంపుమీఱ.

వ. మఱియును. 201

సీ. కాంచు భాగీరథి గంగాభవానిఁ ద్రైలోక్యపావనిఁ బుణ్యలోకదాయి
నిది యూపశాలిని యగు సరయూనది యదియ సుందరి! యయోధ్యాపురంబు
సేయు ప్రణామంబు చేతు లెత్తి యటంచుఁ బలుకుచుఁ గని భరద్వాజునాశ్ర
మంబున డిగి వత్సరంబులు పదునాల్గు చనినఁ బంచమియను దినమునందు
తే. నమ్మహాత్ముని గని భూసుతానుజాభి, యుక్తముగ మ్రొక్కి మునివర్య! యెప్పుమీఱ
భరతశత్రుఘ్ను లుందురే పట్టణమును, భిక్షమె బ్రదికి తల్లు లొప్పెదరె యచట.

తే. అనిన మునివర్యుఁ డనియెఁ గల్యాణచరిత!, భరతుఁ డందఱు మీరాకఁ గోరి జడలు
దాల్చి కృతకార్యములు నివేదన యొనర్చి, పాదుకలఁ గొల్చి తమ్ముఁ డౌభరతుఁ డొప్పు.

క. వనమున మీ రొనరించిన, ఘనకార్యము లెల్లఁ దపముకలిమి నెఱుఁగుదుఁ
జనవర! నారాయణుఁడవు, మనుజాళిహృదయముల నిలుచు మహితుఁడ వీవే. 204

తే. ఆదిమధ్యాంతరహితుఁడవైన బ్రహ్మ, మనఘ! పరుఁడవు సర్వవిశ్వాత్మకుఁడవు
బ్రహ్మ పుట్టఁడె నీనాభిపంకజమున, లోకగురు వని ప్రఖ్యాతి మీఁకఁ గనఁడె. 205

వ. అట్లు గావున. 206

ఆ. నీవు లోకములకు దేవుఁడ విట్లన, మస్కృతుండ వీవు మాధవుఁడవు
సీత లోకమాత శేషుండు లక్ష్మణుం, డరయుజనుల కిట్టు లౌదు వీవు. 207

వ. మఱియు మొదట సలిలంబుఁ బుట్టించి భూతకృతుండవై యందు శయనించినవాఁ
డగుటను విశ్వాత్ముండవై నరులహృదయంబుల వెలింగెదవు గావునను నారాయ
ణుండ వను నభిధానంబుఁ గంటివి సకలభూతంబులకును బహిరంతరంబులు నీవ
యొక్క యట ప్రయుక్త నాకాశంబుభంగి నతేపకుండ నయ్యు మూఢదృష్టులకుఁ బెక్కు
భంగులఁ గనిపింతువు రఘునందనా! నీలీల లెన్నియని వర్ణింప నేర్తుము కల్పితంబగు
విశ్వంబును దద్విశ్వాధారుండవును బరిపాలకుండవును భోజ్యంబు లగు వస్తుచ

యంబులును భోక్తవును భూతభవిష్యద్వర్తమానత్రికాలంబులను గలుగు సకలం
బును నీవ యనుమను భవదన్యపదార్థంబు లే దనుచును జగద్విదితంబుగ
శ్రుతులు చాటుఁగదా మఱియు నచలంబులగు వృక్షాదులు చలనక్రియఁ గలుగు
మారుతసంబంధంబువలనఁ జలియించుపోలిక మీచేతఁ బ్రేరితం బగుచు జడభూ
తంబగు మాయ నిజావయవంబులగు మహదాదులచేత నొనరించిన జగం బంతయు
మూఢులు మీయందు నారోపింతురు గదా జగదీశ్వరా! యిది యెంతవిచిత్రం
బగు నింక దేహశూన్యుండవు జగద్రక్షకుండవు నగు నీవు విరాట్సంజ్ఞ యగు
స్థూలంబును సూత్రసంజ్ఞయగు సూక్ష్మంబును నగు రెండుదేహంబులు గల వవ్విరా
ట్సంజ్ఞయగు స్థూలదేహంబువలన ననేకలీలావతారంబుల నుద్భవింపఁజేయుచుఁ
గార్యాంతరంబు లద్దేహంబుననే మరలఁ బ్రవేశింపఁజేయుదు వవ్వవతారకృత
లీలాశ్రవణమననిదిధ్యాసలవలన జనులు విముక్తు లగుదు రట్టి యాదినారాయణుం
డవు మద్దృష్టిగోచరుండవైతి వేమని నాదుభాగ్యంబుకొలందిసేయునగు మఱియును.

మ. ధరణీభారము మాన్పఁ బద్మజునిచేతన్ బ్రార్థితుం డౌచు నీ
కరణిం బుట్టితి వార్యసమ్మతములౌ కార్యంబులు న్నీదుచే
సరణిన్ జేయఁగ నొప్పె వత్సరసహస్రంబుల్ ధరాపాలన
స్ఫురణం జెన్నువహింపఁగాఁ గలవు మత్పుణ్యాతిరేకంబునన్. 209

ఆ. రామచంద్ర! భువిఁ దురంగమేధంబులు, చేసి తత్కథలను వాసి మీఱ
నిఖిలజగములందు నిండింపఁగల రవి, చదువ వినిన ముక్తి జనులఁ జెందు. 210

క. మాయాశ్రమంబునకు నా, రాయణ! రమ్మతిపవిత్రమా నాగృహముల్
నీయంఘ్రిరేణువున నీ, రే యిచ్చట నిలిచి తగును రేపటఁ జనఁగన్. 211

## శ్రీరాముఁడు హనుమంతుని భరతునొద్దికిఁ బంపుట

వ. అని మహర్షివర్యుండగు భరద్వాజుండు విన్నవించిన ననుమతించి సీతాలక్ష్మణస
మేతుం డై ససైన్యంబుగ నిలిచి యించుకంతతడవు విచారించి పవమాననందనుం
గనుంగొని యి ట్లనియె. 212

ఉ. మారుతపుత్త్ర! నీ విపుడు మత్సఖుఁడౌ గుహుతోడఁ దమ్ముఁడుం
దూరితశత్రుఁ డౌ భరతుతోడుత మత్కుశలంబు పల్కి దో
స్సారుల రావణాదులను జక్కడఁగించుటఁ దెల్పి తల్లు లే
తీరున నుండిరో తెలిసి తీవ్రమె రమ్ము సుబుద్ధిశాలివై. 213

తే. అనుచుఁ బలికిన మనుజుఁడై యహికులేంద్రుఁ, గదియు వినతాతనూభవుకరణి నేఁగి
ప్రీతితోడుత గుహు శృంగిబేరపురము, నందుఁ గని రాఘవులక్షేమ మంత నపుడు.

వ. తెలుపువాఁడై ప్రహృష్టచిత్తంబున నిట్లనియె నిషాదవల్లభా! శ్రీమంతుండును భవత్సఖుండును నగు దాశరథి సీతాలక్ష్మణసమేతుండై నీతోడఁ గుశలంబు పలుకు మనియె నమ్మహాత్ముండును భరద్వాజమునీంద్రుచేత ననుజ్ఞాతుండై యిచ్చటకుం జనుదెంచు నీవునుం జూడఁగల వనుచుఁ బులకాంకితతనూరుహుండగు నప్పుణ్యు వీడ్కొని వాయుపథంబున వెడలి రామతీర్థంబగు సరయూప్రవాహంబు దాఁటి నందిగ్రామంబు గాంచి క్రోశమాత్రదూరంబున నుండి యచ్చట. 215

క. మలపంకదిగ్ధాంగుఁ, ఫలమూలాహారు రామభద్రపదాబ్జో
జ్జ్వలదర్శనచింతాపరు, బలభిద్వినుతోరుచరితు భరతుం గనియెన్. 216

వ. మఱియును. 217

సీ. సకలవసుంధరాచక్రభారం బంతయును పాదుకలయందు నునిచి వల్క
లంబులు గట్టి దేహంబు శుష్కింపంగ నాశ్రమంబున నుండి యఖిలపౌర
జనులు మంత్రులు వీడఁజాలక కాషాయవస్త్రులై తనుఁ గొల్వ వసుధయందుఁ
దనువుతో ధర్మ మంతయు వచ్చి నిల్చెనో యన నట్టు లున్న ధర్మాభినిరతు
తే. భరతుఁ గని పుణ్య మేదేవు పాదదర్శ, నంబు వీక్షించె దీ నట్టి యంబుజాక్షుఁ
డాహవంబున దశకంధరాదివీర, దానవులఁ జంపి కుశలియై తనరు నిపుడు. 218

ఉ. వీటికిఁ జింత లక్ష్మణమహీజలతోడుత రామచంద్రుఁ డి
చ్చోటికి వేగ రాఁగలఁడు చూచెద వీ వన సంతసించి య
మ్మాటకు మూర్ఛనొంది కులమండనుఁ డాభరతుండు లేచి శై
లాటకులాగ్రగణ్యుఁ బవనాత్మజుఁ గౌఁగిటఁ జేర్చి వేడుకన్. 219

సీ. పుణ్యచరిత్ర నీపుణ్యంబునను రాఘవేంద్రు సద్వార్తల నెఱుఁగఁ గంటి
మనుజుండవో కాక మమ్ము రక్షింపంగఁ గరుణ నేతెంచిన సురవరుఁడవో
యివ్వాక్యమునకు నీ కిచ్చెదఁ గైకొను గోసహస్రములను భాసమాన
భూషణాంచిత లగు పొలఁతులఁ బదియార్గురను గ్రామశతముల ననుచు ననియె
తే. నిట్టు లని భవ్య! బ్రతికినయేని సౌఖ్య, మొందు నెప్పుడైన ననుగాథ యొప్పె నిప్పు
డాత్మనమ్మంగ మనుజుల కగచరులకుఁ, బలుకుసాంగత్య మెబ్భంగిఁ గలిగె మఱియు.

వ. ప్రీతికరంబగు రఘునాథుకీర్తనంబు విని బహుదినంబు లయ్యెఁ గావున సత్యంబుగఁ బల్కిన నమ్మెద. 221

మ. అనిన న్మారుతనందనుం డపుడు కల్యాణంబునౌ రాఘవేం
ద్రుని వృత్తాంతము నంతఁ బల్కినను జేతోమోదముం జెంది చ
య్యన శత్రుఘ్నునిఁ జేరి నీ విపు డయోధ్యాపట్టణం బెల్లఁ గాం
చనరత్నోజ్జ్వలమౌక్తికాంబురుహభాస్వద్వస్త్రమాల్యాదులన్. 222

వ. అలంకరించునట్టులును నెల్లెడలం గల్గు దేవతాయతనంబులకు నానోపహారబలివిధానంబు లాచరించునట్టులును జేయింపుము వెండియు. 223

క. దూతలు స్తుతిపాఠకులును, వైతాళికజనులు వారవనితలు గుములై
సీతాచేతోవల్లభు, భాతిం గనుఁగొనఁగ వెడలువగిది రయమునన్. 224

తే. బ్రాహ్మణోత్తములును సర్వపౌరజనులు, రాజకాంతలు మంత్రులు రాఘవేంద్రు
పూర్ణచంద్రుని బోలు నెమ్మోముఁ గాంచు, వేడుకలు పల్లవింపంగ వెడలియిపుడు.

క. చనుదెంచున ట్లొనర్పుము, యినవంశధ్వజచయంబు లెత్తఁగ ద్వారా
ళిని దోరణములు గట్టఁగ, ఘనతరసౌధములఁ మేలుగా నొనరింపన్. 226

## భరతశత్రుఘ్నులు శ్రీరాము నెదుర్కొనుట

వ. చేయింపు మనిన వల్లె యని యట్ల నియోగించి శిబికారూఢు లగుచు రాజకాంతలు వెడల శతసహస్రతురంగంబులను నయుతగంధసింధురంబులను స్వర్ణరత్నభూషితంబు లగు దశసహస్రరథంబులను నానోపాయనపాణులగు భూసురకాంతలం దోడుకొని శత్రుఘ్నుండు గూడి రాఁగ భరతుండును దనయున్న యగు రామచంద్రు పాదుకలు శిరంబునం దిడుకొని ముకుళితకరకమలుండై పాదచారి యగుచుఁ దద్దర్శనాభిలాషి యై వెడలె నాసమయంబున ముందర. 227

సీ. కనుపించె నీరజాసనమనోనిర్మితం బంబరంబునఁ బుష్పకంబు చంద్ర
కాంతితోడుత నంతఁ గనుఁగొనుం డదె జానకియు రామలక్ష్మణుల్ కీశవిభుఁడు
సుగ్రీవుఁ డదె బలోదగ్రుఁ డైన విభీషణుండు మంత్రులతోడ నుండెఁ జూడుఁ
డని హనుమంతుఁ డిట్లనిన నబ్భరతుండు శ్రీబాలవృద్ధులు చెలువు మీఱ

తే. నదియె రాముఁడు రాముఁ డంచనఁగఁ దొడఁగి, రందఱును వాహనంబుల నపుడు డిగ్గి
కలితముకుళితపాణులై నిలిచి రంత, ధావదంబుధ జంద్రరథంబుగతిని 228

వ. సమీపించె నాసమయంబున హృష్టమానసుం డై కరయుగంబులు మొగిడ్చి మేరుధరాధరస్థుండగు భాస్కరునకు నమస్కరించు చందంబున. 229

క. రామునకు సన్నుతున్కు, త్రామునకు సమస్తదైత్యదానవభటహృ
ద్భీమునకు దయితసీతా, భామునకు నమస్కరించె భరతుం డపుడున్. 230

క. రామాజ్ఞ నవ్విమానము, భూమిస్థం బయ్యె నంతఁ బొలుపుగఁ దమ్ముల్
శ్రీమంతు భరతుఁ గాఁగిట, నేమంబునఁ దిగిచి కరముచేఁ జుబుకంబున్. 231

వ. పుణుకుచు రఘువల్లభుండు. 232

క. కనుఁగొంటిని బహుదినముల, కని యంకమునందుఁ దిగుచు చాతని దేహం
బునఁ గల్గు భూపరాగము, తనకరయుగములను నిమిరెఁ దామరసాక్షీ!. 233

వ. ఇట్లు భరతుం గౌరవించె నాసమయంబున లక్ష్మణుండు జనకనందనసద్గుణావళు లుపన్యసింప భరతుండును సంతసంబునొంది వినుతించుచు జాంబవంతాదివానరులం గౌఁగిలించుకొని కుశలం బరసె వారును మానుషాకారంబుల నబ్భరతునకు మైత్రిఁ జూపి రంత భానునందనుం గనుంగొని. 234

తే. నీసహాయంబునను భూసుతాసమేతుఁ, డగుచుఁ జనుదెంచె రాఘవుఁ డసురవరుల
గెలిచి యటుగాన నన్నదమ్ములము మేము, నలువురము నీవ యైదవ దలఘుమూర్తి.

వ. అంత శత్రుఘ్నుండును. 236

తే. రామలక్ష్మణులకును శ్రీరామకాంత, యైన భూపుత్రికిని వినయమున మ్రొక్కి
వినుతియొనరించె రాఘవుండును స్వమాత, యైన కౌసల్యసన్నిధి కరిగి యపుడు.

వ. శోకకర్శిత యగు నప్పుణ్యవ్రతను నమస్కరించి కైకేయీసుమిత్రల చరణంబుల కెఱఁగి వినయంబు సలిపె నాసమయంబున. 238

క. భరతుఁడు స్వాభావికస, చ్చరితుఁడు పాదుకలు రామచంద్రుని పదపం
కరుహములయందు నిలిపెను, గురుతరపూజలఁ దనర్చుకొని ఘనభక్తిన్. 239

వ. ఇట్లు రఘునాయకుపాదారవిందంబులయందుఁ బూజితంబులగు పాదుకలు నియోజించి ఫాలతలఘటితకరయుగళుం డై యిట్లనియె. 240

సీ. జానకీనాథ! రాజ్యం బింతపర్యంతమును పాదుకలయందు నునిచి యిప్పు
డతిభక్తి మీకు సమర్పణ గావింప సఫలమయ్యెను నాదుజన్మ మెల్ల
రంజిల్లె మన్మనోరథము లయోధ్యాపురమ్మున కరుదెంచు మిమ్ముఁ గాంచ
బాగుమీఱంగఁ గోష్ఠాగారబలకోశములు దశాంశల మించెఁ దెలియ మీదు

తే. తేజమున నింతపూనితి రాజవర్య!, యనుచుఁ బలికిన భరతుని గని సమస్త
వనచరేంద్రులు కన్నుల వారి నించు, చును బ్రశంసించి రంతట సుందరాంగి! 241

వ. రాఘవుండును. 242

క. తనయనుజుని సద్గుణముల, కనుమతుఁడై వెడలి యతని యాశ్రమమునకుం
జన డిగ్గి పుష్పకంబును, గనుఁగొని రాఘవుఁడు పలికెఁ గరుణ దలిర్పన్. 243

వ. చనుము కుబేరు వహింపు మేము దలఁచుసమయంబున రమ్మనుచుఁ బుష్పకంబును వీడుకొలిపి. 244

క. దేవేంద్రుండు బృహస్పతి, సేవించినభంగి నవ్వసిష్ఠుని భక్తిన్
సేవించె రామచంద్రుం, డావనమున వికచపంకజాయతనయనా. 245

వ. అనుచు నవ్వృత్తాంతం బంతయు మహాదేవుండు భవానికిం జెప్పి మఱియు నిట్లనియె నిట్లుమహాత్మునకుం దనను రెండు సింహాసనంబులు దెప్పించి యుభయులునుం గూర్చుండి సంభాషించు నవసరంబున. 246

క. వినయంబున భరతుం డో, వనజాక్షా! మదీయజననివలనను గృపచే
తను రాజ్యమొసఁగితిరి యది, మును పొసఁగినభంగిఁ గొనుఁడు ముదమున మరలన్.

తే. అనుచు భరతుండు ప్రాంజలియగుచు వేఁడఁ, గైకయీదేవి వినుతింపఁ గార్య మనుచు
వన్వసిష్ఠుండు పలుక రాజ్యాధిపత్య, గౌరవము నూనె రామభూకాంతుఁ డపుడు

వ. అమ్మహాత్ముండు మాయాగుణంబు ననుసరించి యాార్య చేష్ట లు చేయుచుండు నదియుకా
దఖిలదేవతారాజ్యవైభవధారేయుండును సుఖజ్ఞానైకరూపుండును నిరస్తాతిశయుం
డును నానందరూపుండును నగు జగదీశ్వరుని కిమ్మనుష్యరాజ్యం బెంత మఱియును.

సీ. ఏదేవు కరుణావసేక్షణం బాఖండలాధిపత్యము మానవాళి కొసఁగు
నేపుణ్యు భ్రూభంగ మీరేడుజగములు నిర్ఘాతముగఁ జేసి నీటఁ గలుపు
నేభవ్యులీలచే నీసృష్టి జనియించు నెవఁడు విరక్తుఁడై యొనయుచుండు
నేమాన్యుఁ డిటు మానవేంద్రుఁడై జనియించి సకలలోకముల కోరికల నొసఁగు

తే. నట్టిసిరున కీరాజ్య మనఁగ నెంత, మనుజుఁ డయ్యెను గానఁ దదనుసరణము
గాఁగ దొరయుంచుఁ జెలువొందె గానిలేక, యున్న నేతద్వికారంబు లున్నె యచట

వ అంత శత్రుఘ్నువచనంబున రామాభిషేకార్థంబు నిపుణులగు శ్మశ్రుకృంతకు
లఖిలసంభారంబులు నాయితంబులు చేసి రాసమయంబున. 251

ఆ జడలు విచ్చి చిక్కు చక్కఁగాఁ గావించి, భరతలక్ష్మణులును బ ల్కికంఠు
సోదరుఁడును మఱియు సుగ్రీవుఁడును మజ్జనంబు లొనరఁజేసి రంబుజాక్షి!.

వ. ఇట్లు స్నానంబు లొనరించి మహార్ఘంబులగు వసనంబులు గట్టి చిత్రమాల్యానులే
పనులై యొప్పి రంత భరతుండును సేవకవర్గంబులచేత రామచంద్రునకు రాజ
కాంతలవలన భూతనయకును మజ్జనంబులు సేయించి రాజార్హంబులగు వస్త్ర
మాల్యచందనాభరణాదులనలంకృతులం గావించె నయ్యవసరంబునఁ బుత్రవాత్సల్య
యగుటం జేసి. 253

క. కౌసల్యయు వానరకాం, తాసముదయముల నలంకృతలఁ జేయించెన్
భాసురమణిమయభూషణ, వాసస్స్రిక్చందనాదివస్తువులఁ జెలీ!. 254

వ. అంత సుమంతుండు శత్రుఘ్నుశాసనంబున సూర్యసంకాశంబగు రథంబుఁ దోడి
తెచ్చి ముందఱ నిలిపిన 255

తే. సత్యధర్మప్రవర్తనశాలి రాఘు, వేంద్రుఁ డాస్యందనంబుపై నెక్కె ముందు
పవనజవిభీషణాంగదజప్రముఖు లక్క, వారణాదుల నెక్కి జోహారుసేయు 256

తే. దేవి జనకాత్మజయును సుగ్రీవసతులు, యానముల నెక్కి రక్షోదేవాళి గొలువ
ననువుమీఱెఁ బాకశాసనునిభంగి, దశరథాత్మజుఁ డొప్పెఁ దత్సమయమునను.

వ. ఇట్లు రథారోహణంబు సేసి. 258

## శ్రీరాముఁడు సపరివారముగా నయోధ్యఁ జొచ్చుట.

సీ. శ్వేతాతపత్త్రంబు చెలఁగి శత్రుఘ్నుండు పట్టె సారథి యాయె భరతుఁ డొప్ప
సౌమిత్రి వ్యజనంబు సద్భక్తి ధరియింప రాక్షసేంద్రుఁడు చామరములు వీవ
సురసిద్ధసాధ్యు లంబరమున వినుతింప మనుజులై వనచరుల్ దన్నుఁ గూడ
భేరీమృదంగశంఖారావపణవానకాదు లజాండంబు భేదిలంగ

తే. ప్రాయఁ జెలువొందివెడలె నారాయణుండు, రాఘవేంద్రుండు లోకసంరక్షకుండు
దివ్యకోదండధారి యాదిత్యవంశ, వార్ధిచంద్రుండు సద్యశోవర్ధనుండు. 259

వ. ఇట్లు హరితవర్ణంబులగు తురంగంబులం బూనిన యరదం బెక్కి వివిధాలంకార శోభితంబగు నయోధ్యానగరంబు దరియం జొచ్చి రాజమార్గంబునం జనుదెంచు నవసరంబునఁ బౌరకామిను లెల్ల రామాగమనంబు విని సత్వరంబునఁ జేయుపనులు మాని కాంచనసౌధంబు లెక్కి. 260

సీ. పీతాంబరావృతుఁ బీనభుజాంతరు రవితుల్యతేజు నారక్తపంక
జాయతనేత్రు ననర్ఘ్యముక్తాఫలహారకిరీటకేయూరకటక
కుండలకటిసూత్రమండితు మృగమదగంధలిప్తవినీలగాత్రుఁ గల్ప
భూరుహాసుమదాము సూరతనూజాదిశాంతవానరసేవ్యు జనమనోభి

తే. రాము దూర్వాదళశ్యాము రాముఁ గాంచి, యతిముదంబునఁ దన్మూర్తి నఘునిప్రీ
వాత్మకును దృక్కులను బధ్యమైనదాని, నిలిపి రాత్మీయమానసనీరజముల. 261

వ. మఱియు దృక్ఛకోరంబుల రామముఖచంద్రచంద్రికాస్వాదనంబు సేయుచు లాజలును వివిధంబులగు పుష్పంబులును స్వానందమూర్తి యగు నారాజరత్నంబు పయిం జల్లం దొడంగి రాసమయంబున. 262

ఆ మందహాస మానసేందుబింబమునకుఁ, దోడు సలుపఁ దనయి లాడుచుండ
వారితంద్రు లరయి వైఖరి చూచుచు, నుండె రాఘవేశ్వరుండు ప్రజల. 263

వ. ఇట్లు కరుణారసాపలోకనంబుల సకలజనంబులకు సౌఖ్యం బాచరించుచుఁ దూర్య ఘోషంబులతోడ భరతుండు రథంబు నడుప సర్వాలంకారశోభితంబగు పితృగృహంబుఁ జొచ్చి తదంతఃపురసౌధాంతరంబునఁ దనతల్లి యగు కౌసల్యాదేవిం గనుంగొని నమస్కరించి తక్కిన దశరథకాంతాజనంబులకుం బ్రణమిల్లి యుచితాసనంబులం గూర్చుండి వసిష్ఠాదిమహర్షివర్గంబులు వేఱువేఱఁ బీఠంబులం జెలువొంద దివిజవల్లభుండునుంబోలె సత్యపరాక్రమశాలి యగు రామచంద్రుండు భరతుం గనుంగొని యిట్లనియె. 264

తే. అఖిలసంపత్సమాయుక్తమైన నాఁగు, మంచిరము వేగ మర్కటకుమారవరులు
దానవేంద్రునకును జూపి తగినయోపల, నఖిలసైన్యంబులకును నిల్పునట్లొనర్పు.
వ. అని నియోగించిన భరతుండును దద్వచనానుకూలంబుగ విడిదలు గనంబఱచి సుగ్రీవుం గనుంగొని భానునందనా! రాఘవాభిషేకార్థం బతిత్వరితవేగులగు ప్లవంగపుంగవులం బనిచి చతుస్సముద్రసలిలంబులు దెప్పింపు మెల్లి యొనరించుట నిశ్చయం బనిన సుగ్రీవుండును. 266
ఆ. సముఖమునకు వాయుజసుషేణజాంబవ, దంగదాదులను బ్రియమ్ము తోడఁ
బిలిచి వారినిధుల జలము దెండు సుదాక్ష, చేత రాఘవాభిషేకమునకు. 267
క. అని పలికిన వారు చతు, ర్వననిధులకు నేఁగి వివిధరత్నఖచిత గాం
చనకలశముల జలంబులు, దినకరనందనునికడకు దెచ్చిరి ప్రీతిన్. 268
వ. అవ్విధంబు శత్రుఘ్నున కెఱిఁగింప నతండును నిఖిలమంత్రిగణపరివృతుండై గంగాదిపుణ్యతీర్థసలిలంబులును నవిరూ వసిష్ఠుండుఁ గనిచిన నమ్మహోత్సవంబును వృద్ధులగు బ్రాహ్మణవర్గంబులం గూర్చుకొని సంభ్రమంబున. 269
ఆ. కనకరత్నఖచితఘనపీఠమున రాఘ, వేంద్రు నిఖిలభూతలేంద్రవైభ
వప్రకాశుఁ జేయ వసుధాతనూజాక్షి, యుక్తముగను గూరుచుండఁ బెట్టె. 270

## శ్రీరామచంద్రుని పట్టాభిషేకము.

వ. ఇట్లు వివిధాభరణభూషితులగు నాదంపతులఁ దత్సింహాసనాసీనులం గావించి భేరీమృదంగాదిమంగళవాద్యంబులు చెలంగ సభక్తగణంబులు జయజయశబ్దంబులు పలుక సుగ్రీవపవననందనాదిప్లవంగచమూవల్లభు లుభయపార్శ్వంబుల వివిధాలంకారశోభితులును వృత్తచామరహస్తులునై బలిసికొలువ మహేంద్రులయనన్నిభంబగు తత్సభామంటపంబున. 271
సీ. గౌతమ వాల్మీకి గాధేయ పైంగళ వామదేవ వసిష్ఠ వాలఖిల్య
జాబాలి కుంభసంజనిత భరద్వాజ ముఖ్యమునీశ్వరులు ముదముతోడ
బలి మించుతులసీదళంబులఁ గుశలచేఁ బుణ్యతీర్థోదకంబుల సుగంధ
సంయుతంబు లొనర్చి శక్రున కైంద్రాభిషేకంబు వసువులు సేయుభంగి
ఆ. రాఘవునకు జనకరాజకన్యాశోభి, తాంకదేశునకు దశాననాబ్జ
గంధసింధురునకుఁ గడఁగి రాజ్యాభిషే, కం బొనర్చి రప్పుడంబుజాక్షి!. 272
వ. తదవసరంబున. 273
చ. విపులములై పయోనిధులు విష్ణుపదీజల మంతె మేఘసం
ఘముల మహాధ్వను ల్సెలఁగె గంధవహుండు వసుంధరాలి యయ్యె సం

భ్రము నొకసత్ర మయ్యె రవిరాజముఖగ్రహసేవ్యమానమై
యమరె నభంబు నచ్చరలు నాడిరి పాడిరి కిన్నరోత్తముల్. 274

వ. ఋత్విక్కులును బ్రాహ్మణశ్రేష్ఠులును దత్కాంతానివహంబులను మంత్రులును సర్వౌషధీరసంబుల నభిషేకంబులు గావించిరి. గగనతలంబున నింద్రాదిదిక్పాలకులు స్వవిమానరూఢులై వినుతింపం దొడంగి రయ్యవసరంబున సింహాసనారూఢుండును రాజ్యాభిషిక్తుండును నగు రాఘవేంద్రునకును. 275

సీ. పాండురచ్ఛత్త్రంబు పట్టె శత్రుఘ్నుండు చామరంబులు విభీషణవనాట
వల్లభుల్ వైచిరి వాసవచోదితుం డగుచు సమీరుండు హార మొకటి
మణిమయాంచితము రామక్షితీశునకు సమర్పణ గావించె నమ్మహాత్ముఁ
డంతకన్నను మేటియగు హార మొక్కటి యిప్పించె సత్కరుణచే మించి యపుడు
తే. ఝంఝణాంఝణఝంఝణాంఝణ మ్మటంచు, మొఱసె దుందుభులాకసంబున సురలు
వినుతి గావింపుచును ముంచి విరులవాన, జల్లొనర్చిరి యారామచంద్రుపైని 276

వ. అప్పుడు. 277

సీ. హారకిరీటకేయూరాంగదోజ్జ్వలకటిసూత్రనూపురకలితుఁ బద్మ
పత్త్రాయతేక్షణు భావజకోటిలావణ్యు సుమధ్యు దూర్వాదళాభ
దేహుఁ బీతాంబరు దివ్యచందనలిప్తగాత్రు మహోరస్కుఁ గంబుకంఠు
నఖిలలక్షణు ననంతాదిత్యసంకాశు ద్విభుజు మందస్మితు దీర్ఘబాహు
తే. భూసుతాధిష్ఠితస్వాంకుఁ బుణ్యచరితు, భూరిసింహాసనస్థితుఁ బురుషవర్యు
వీరవానరసేవ్యు దోర్వీర్యధుర్యు, రాఘవేశ్వరు దివిజశరణ్యు విష్ణు. 278

వ. మఱియుఁ దదంకప్రదేశంబున. 279

సీ. కనకసన్నిభదేహ కమనీయరత్నసంఘటితభూషణ గంధకలితనిటల
విద్యున్నిభాంబర వికచాంబురుహనేత్ర [illegible]కరాబ్జ రాజవదన
సద్వ్రతిశయయుక్త చారుచందనలిప్తవక్షోజయుగళ హర్యక్షమధ్య
నూపురాంచితపాద నూత్నయౌవన షట్పదాలక హారహారాభిరామ
తే. పావనచరిత్ర రామహస్తావలంబి, తోరముక్తకస్రై యొప్పు ధారణీత
నూభవను నిట్లు గాంచి తద్వైభవమున కతిముదము నొంది గిరికన్యకావిభుండు.

వ. విహాయసంబున నఖిలదేవతాగణయుక్తుం డయి యిట్లని వినుతించె. 281

సీ. చారునీలోత్పలశ్యామలవిగ్రహా! హారకిరీటకేయూరమహిత
భూష! సుమిత్రానుజోపేత! శ్రీరామ! నీకు వందన మగుఁ గాక వాజ్ఞ

నోదేహముల నీవు నూఁది యొక్కాలంబు నాద్యంతరహితుండ వగుచు నాత్మ
మాయచే లీలలు సేయుచు నొకఁడవై యొప్పెద వీవ నిజోరుసౌఖ్య
తే. మునవితోంతంబురతుఁడవై మూఁడు గుణము,లను జగంబులఁ బుట్టించి పెనిచి త్రుంచి
లేశమైన సవజ్ఞత లేక తనరు, పూజితుఁడ వీవ దశరథరాజతనయ! 282
క. కరుణను భక్తులఁ బ్రోచెదు, కాఅను ఋషాద్యాకృతులను గుణయుక్తుఁడవై
ధర నుద్భవించి జ్ఞానుల, కిరువుగఁ గనుపించు ప్రభుఁడ వీవ మహాత్మా! 283
చ. ఘనమగు స్వాంశతోఁ దుత జగంబు లొనర్చి మహాఫణీంద్రప
త్రిని దదధఃప్రదేశమున దిక్కొని యయ్యుపరిస్థలంబునం
దనలునిభంగి మేఘముల నన్నిట నిల్చి ప్రసన్నరూపివై
తనరు మహౌషధుల్ గురియు దాతవు నీవె సరోజలోచనా!. 284
వ. మఱియును. 285
చ. అనలునిమాడ్కి దేహభృతులందున నిల్చి సమస్తభుక్తిప
స్తునిచయముల్ చతుర్గతుల సొంపొదవన్ బచనంబు సేయుచుం
బనివడి నిత్యమును బవనపంచసహాయుఁడవై జగంబులె
ల్లను భరియింపుచుం దనరు లక్షణవంతుఁడ వీవ రాఘవా!. 286
తే. చంద్రసూర్యాగ్నులందును సకలభూత, ములను జెలువొందు కాంతియు మొనసివారి
ప్రాభవాయుర్యశోధైర్యవైభవములు, నీగు సత్యంబ కాదె నిష్కేదరూప!. 287
క. శివ నారాయణ కమలజ, దృవ రవి శశి కాల కర్మ పరిభేదముల
ధ్రువముగఁ దోఁతువు వాదుల, కవనీతలవిభుఁడ వొకఁడ వయ్యును రామా!. 288
తే. మత్స్య కచ్ఛప వారాహ మనుజ సింహ, వామనాద్యాకృతుల ధరావలయమున పో
ణములఁ జెలువొందిశ్రుతిపురాణములనొప్పు, పుణ్యుఁడవునీవ రామ! సంపూర్ణకామ!.
వ. దేవా! యనాది కారణంబున సదసద్విభాగం బగు ప్రపంచంబంతయు నీవ మఱియు
ననంతంబగు సృష్టియందు భూతభవిష్యద్వర్తమానంబులగు స్థావరజంగమంబు
లెల్లను నీవె కాక భవద్వ్యతిరిక్తపదార్థం బెందునుం గనుపింపదు పరాత్పరుఁడగు నీదు
యాథార్థ్యంబు కమలసంభవాదులు నెఱుంగం జాలక భవన్మాయావృతత్వంబు
వలన బహిరంగుండ వనుచుఁ దలంతు రింక నీయుభక్తి సేవాపరమానసులగు పుణ్యు
లకు నిశ్చయంబుగా నెఱుంగంబడును మఱియును. 290
క. ఏనును నీనామము మది, నూని కృతార్థుండ నగుదు నొగి మృతులగు న
మ్మానవులకుఁ దెలుపుచుఁ గా, శీనిలయంబున వసింతు శివతోడ నృపా!. 291
క. ఎవ్వరైన నిత్య మీ స్తవ, మవిరళమతిఁ జదువ వ్రాయ నాకర్ణింపన్

ప్రవిపులసౌఖ్యవహులై, శిశువులు నీకృపను సన్నుఁ జెందుదు రనఘా! 292

వ. అని యిట్లు పార్వతీవల్లభుండు వినుతించుసమయంబున నింద్రుం డిట్లనియె 293

ఆ. భానువంశతిలక! దానవాధముఁ జంపి, జానపదంబు చేతఁ గొనియె మాదు
సుఖము లవియు నీదు సుప్రసాదంబున, మరలఁ గలిగె నిపుడు మడిసె రిపుఁడు.

వ. దేవత లిట్లనిరి 295

తే. యజ్ఞభాగంబు లెల్లఁ దా నపహరించు, నివ్వఁ డొక్కఁడైన నన్నిచు నిపుడు మీరు
కూల్చుటను మాకు నవి సమకూడె మరల, మానిహృదయాంబుజదినేశ! జానకీశ!.

వ. పితృదేవత లిట్లనిరి 297

ఆ. ఓమహాత్మ! రఘుకులోదధిసంపూర్ణ, చంద్ర! వీఁడు మిగుల సాహసమున
నపహరించి తిను గయాదత్తపిండాదు, లమరె మాకుఁ దొంటియట్ల యిపుడు 298

వ. యక్షు లిట్లనిరి 299

ఉ. వెట్టికిఁ గొట్టి మమ్ము రఘువీర! నితాంతము బాధపెట్టి యి
ట్టట్టును బోవనీఁ డిదియ యానము ప్రాయఁగ మాభుజాగ్రముల్
గొట్టుకపోయెఁ జూడుఁ డిలఁ గూలెను వాఁ డికఁ గానఁ జింత పోఁ
దట్టి త్వదంఘ్రిసేవల ముదంబున నుండెద మింక మాకృపన్. 300

వ. గంధర్వు లిట్లనిరి. 301

తే. ఏము సంగీతనిపుణుల మెప్పుడు నిక
థాళిఁ జదువుచు నిత్యసౌఖ్యమున నుందు
మట్టులు గాదయ్యె నైన దైత్యాధముండు
గ్రుంగుటను దొంటిభంగి నుహ్వాంగఁ గలిగె. 302

వ. అనుచు నివ్విధంబున మహోరగసిద్ధకిన్నరపతత్రిణా ప్రజాపతి ప్రముఖులు వేఱు వేఱఁ బట్టాభిషిక్తులగు నా రాజదంపతుల వినుతింపుచు నయనోత్సవంబుగఁ గనుంగొనుచు నభినందితులై నిజస్థానంబులకుం జనిరి. బ్రహ్మరుద్రాదులు నమ్మహామహాకల్యాణగుణంబులు గానంబు సేయుచు సింహాసనస్థితంబును సీతాలక్ష్మణసమేతంబును నగు నా రాజవల్లభురూపంబు మానసింపుచు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబున. 303

మ. చెలఁగెం దుందుభు లాకసంబున నురల్ సేమంబునం బూలవా
నలు గావించిరి సంతసించిరి మునుల్ నారాయణుం డారమా
లలనాధీశుఁడు రాఘవుం డమరె సాలంకారుఁడై భూమిజా
నిలపుత్రార్కజలక్ష్మణాద్రి[illegible]మానివ్యూహముల్ గొల్వఁగన్. 304

వ. అనుచు మరలి సదాశివుం డంబికతోడ నిట్లనియె నివ్విధంబున సకలలోకసుఖావహుండగు రాఘవేశ్వరుండు ధరణీపాలనధురీణుండై యుండ నయ్యవసరంబున వసుంధర సస్యసంపన్నయయ్యె మహీరుహంబులు ఫలవంతంబులు సుగంధహీనంబులగు కుసుమంబులు సుగంధసహితంబులు నగుచుం జెలువొందె నమ్మహామహుండును శతసహస్రసంఖ్య లగు గజతురంగధేను సముదయంబుల నెల్లవారికి నొసంగెఁ బూర్వంబ నూఱు వృషభంబులును ముప్పదికోటులు సువర్ణంబులును వస్త్రాభరణరత్నాదులును బ్రాహ్మణోత్తములకు సమర్పించె వెండియు. 305

క. భాస్కరతనయున కొసఁగెను, భాస్కరసదృశంబు కనకబహుమణిగణశో
భాస్కరము హార మప్పుడ, భాస్కరకులతిలకుఁ డతికృపన్ వనజాక్షీ!. 306

వ. అవ్విధంబున. 307

క. తారేయున కొసఁగెను రే, యూరంబులు తోన నొసఁగె నుర్వీసుతకున్
దారాధిపకోటిసమము, హారము మణిరత్నఖచిత మంబుజనయనా!. 308

వ. అదియు నవ్వైదేహకన్య కారత్నంబు కరంబునం దిగిచి నిఖిలవానరవ్యూహంబులను రామచంద్రునిం గనుంగొను నవసరంబున నింగితజ్ఞుండగు రఘువల్లభుం డిట్లనియె.

ఆ. ఎవరివలన నీవి టింపు గంటివి వారి, కిమ్ము హార మనిన సమ్మదమున
ననిలజాని కొసంగె నమ్మారుతియు మించె, హారమునను మించు గౌరవమున. 310

వ. ఇట్లు సీతాదత్తంబగు హారంబువలన విరాజమానుండయి కరకమలంబులు మొగిడ్చి యున్న పవమాననందనుం గనుంగొని తద్భక్తితాత్పర్యంబునకుఁ దుష్టచేతస్కుండై రఘువల్లభుండు. 311

ఆ. అనిలపుత్ర! నీహృదంతరేప్సిత మెద్ది?, వేఁడు మనిన వంగు వేల్పులకును
ననుపనట్టిదైన సమకూర్తు ననిన సం, తసము నొంది పవనతనయుఁ డపుడు. 312

ఉ. నామది నీదునామభజనంబునఁ దృప్తి వహింప దింక నే
నీమహిలోన దాని భజియింపుచు సౌఖ్యముతోడ నుందు శ్రీ
రామ! వరం బొసంగిన ధరాస్థలి నిల్పుము మత్కళేబరం
బామహనీయనామము గలంతటికాలము దీని వేఁడెదన్. 313

వ. అనిన రామచంద్రుండును నవ్విధంబున నగుంగాక ముక్తుండవై యుండుము కల్పాంతంబున నాదుసాయుజ్యంబు నొందెద వనుచుఁ గటాక్షించె నంత జనకనందన కృపాహృదయంబున. 314

సీ. వినవయ్య! హనుమంత! వేల్పుమూఁకలు వత్తు రెచట నీ వుండిన నచటి కెల్ల
మాయాజ్ఞ ననిన నమ్మారుతి యతిభక్తితోడుత నాదంపతులకు మ్రొక్కి

చనలేక చనలేక కనుల నానందాశ్రు లొలుక మహాబుద్ధియుతుఁడు గానఁ
దపము సేయఁగ శీతధరణీధరంబున కరిగె రాఘవుఁ డంతఁ గరుణతోడ
తే. గుహునిఁ గన్గొని మత్సఖ! కొమరుమిగుల, శృంగిబేరంబునకు నేఁగు మంగళములు
బ్రార్జితంబులు భుజియింపు మనుదినంబు, ననుభవింపుము సాయుజ్య మొదవుఁ దుదిని.
వ. ఇది యసంశయం బనుచు దివ్యాభరణంబులును విపులంబగు రాజ్యంబును విజ్ఞానం
బును నొసంగిన గుహుండును బ్రముదితమానసుం డై స్వభవనంబునకుం జనియె
భానునందన విభీషణులును దక్కిన వనచరవ్యూహంబులును సమాల్యాభరణవస్త్రా
దుల యథార్హంబుగఁ బూజితు లై నిజనివాసంబులకుం జనిరి. రామచంద్రుండును.
శా. పాలింపన్ ధరఁ దండ్రి భంగిని కృపాపారీణుఁడై లక్ష్మణుం
డాలక్ష్మీవిభుచేతఁ గోరిక యొకింతైనన్ మదిన్ లేకయుం
బాలుం డయ్యును యౌవరాజ్యమునకున్ భవ్యాత్ము లిట్లయ్యుఁ ద
ల్లోలస్వాంతుఁడు గాక యన్న కనుకూలుం డై జయించె న్మదిన్. 317
వ. ఇవ్విధంబునఁ దమ్ముండు సేవలు సలుపఁ బరమాత్ముండు ధర్మాధ్యక్షుండును నిత్య
లుండును గర్తృత్వాదివిహీనుండును నిర్వికారుండును నయ్యు రఘునాయకుండు
నిజానందంబున సంతుష్టుం డగుచు లోకంబుల కుపదేశంబు సేయుచందంబున మాను
షదేహానుసారుం డై విపులదక్షిణల నశ్వమేధాది యజ్ఞంబు లనేకంబులు గావిం
పుచు సకలజనవత్సలుం డై ధరాతలంబు శాసింపుచుండె నక్కాలంబున. 318
సీ. కలుగవట్లే యాపదలు సర్వభయములు విధవలు వ్యాధులు బధిరు లంధు
లరిభయంబులు వృద్ధు లమృతులై యుండంగ బాలురు గ్రుంగుట లాపె సరయు
జనులెల్ల రామపూజాపరుల్ రాఘవచింతకు లస్వకులోక్తశీలపరులు
కాలాంబుదములు మేఘములు పౌరాంగనల్ పతిభక్తియుతులు నిష్పాపు లిట్లు
తే. వెలయ నంద త్రికిని దండ్రి విధముదోఁప, సర్వలక్షణసహితుండు సర్వశక్తి
యుతుఁడు నై రాఘవేశ్వరుం డుర్వియేలె, సోత్సవంబున పదివేలవత్సరములు 319
చ. అనుచు శశాంకమౌళి తుహినాచలనందనతోడఁ బల్కెఁ బా
వనము శుభప్రదంబు ధనవైభవదం (బభిషేక) మెవ్వరై
నను వినిసం బఠించిన మనంబునఁ గల్గెడికోర్కె లెల్లఁ బం
డును గృతపాపసంఘములు డుల్లు ననేకము లైన నిమ్మహిన్. 320
తే. ఇందుఁ బ్రత్యహ మీరాఘవేంద్రభూతి, లాభిషేకంబు వినిన ధనార్థుఁడైన
నమరుధన మింకఁ బుత్రార్థి యైననాఢ్య, సముతసుతుఁడు గల్గు నిస్సంశయంబు.
తే. మొదలనుండియు సద్భక్తి జదువునతఁడు, జీవనుతుఁడును బూజ్యుఁడౌఁ జేరివినిన
వంధ్య యైనను సౌభాగ్యవతియుఁ బుత్ర, వతియు నగుఁ బల్కెఁ గంధరహారి గిరిజ.

సీ. శ్రద్ధ నీయధ్యాత్మరామాయణము వినుసభ్యుండు త్రైలోక్యసమ్మతుండు
నుతలెల్ల సంతసింతురు గర్భమునకు లగుకార్యముల్ గాంచు సౌఖ్యములు గల్గు
రఘునాథుపదభక్తి ప్రబలయౌనతి రజస్వల యైన శ్రీరామచంద్రవిగ్ర
హార్చితస్వాంతయగు యాకన్యను మొనర్చు బాయురారోగ్యసౌఖ్యాభిరతుండు
తే. సుతుండు జనియించు గరంబతిప్రతి యనంగ, బరంగు నెవరైన నిత్యంబు భక్తితోడ
నందన మొనర్చి పూజింపంజెందు రామ, చంద్రునిలయంబు పాపసంచయము లెడలు.
తే. మనుజుం డధ్యాత్మ మఖిలంబు వినినం జనున, వానివలనను జానకీవల్లభుండు
సంతసిలు నస్మహామహాసంతసముల ధర్మసూక్ష్మ కామముల్ దనకుం గలుగు 324
తే. భాస్కరాదిగ్రహంబులు సదయమానలు, నసురులును బీదరులుం ద్వప్పు లగుదుత్తభయ
మనరు నధ్యాత్మరామాయణము పఠింప, శౌర్యలవలనను వినిన సత్పురుషులకును.

మ. వినుం డధ్యాత్మము చిత్ర మొప్పనిన సద్విజ్ఞానవైరాగ్యశో
భనయుక్తంబు సవిస్తరంబు చదువన్ భక్తిన్ వినన్ వ్రాయం దా
రను మోదించిన మానవోత్తములు దుర్దాంతోగ్రసంసారవా
ర్ధి నిమగ్నత్వవిముక్తులై సహసా యాతీరెంగులం గల్గునే. 326

వ. అనుచు సవిస్తరంబుగ 327

తే. వేదరాశిసమస్తంబు వెదకి రాఘు, వేశ్వరుండు తారకబ్రహ్మ మీశ్వరుండు
విష్ణుండను సద్రహస్యంబు వెలయంబలికె, నంబతోడుత త్రిపురారి యతిముదమున.
ఆ. అఖిలసారసంగ్రహ మెఱింగి సంక్షేప, మునను బ్రస్ఫుటముగ మనుజుండైన
దాశరథిని గూడం దత్త్వంబు వినరించి, శైలతనయతోడ శంకరుండు. 329
క. అని శివుం డంబిక కెఱింగించినగతి విధి నారదునకుం జెప్పిన వ్యాసుం
డను నాకుం బల్కె వినుండం, చనియె సూతుండు శౌనకాదిమునులకున్. 330
క. ఫణిభోగిశయన! యగణిత, గుణమణిగణభరణ భరతసుభరణ! భవతా
రణ! దుఃఖహారణచరణా!, రణరంగప్రవణ! రంగరామ! ధురీణా. 331

మాలిని. హరిహరమణితుల్యా! శ్యామలాంభోజనేత్రా!
రిపుకర! శ్రీసీతాధికన్యాకళత్రా!
మురమథుబలకాలాంభోధరోద్యత్సమీరా!
సురనుతవరశౌర్యస్తోమ! శ్రీరంగధామా!. 332

గద్య. ఇది శ్రీమోరుగోటి మున్నీశ్వరప్రసాదలబ్ధకవితాపవిత్ర గోటమరాజు భాస్కర
మంత్రిపుత్త్ర నాగయామాత్యప్రణీతం బైన శ్రీమదధ్యాత్మరామాయణం బను
మహాకావ్యంబునందు యుద్ధకాండము సర్వంబును ద్వితీయాశ్వాసము.

యుద్ధకాండము - సంపూర్ణము.

శ్రీరస్తు.

# అధ్యాత్మరామాయణము

## ఉత్తరకాండము.

---



కంఠపద్మగర్భా
నీకార్చిత! సకలభక్తనివహాదివౌకా
నోకహ! కరుణాకర! ద
ర్వీకరపర్యంకశయన! శ్రీరంగపతీ! 1

వ. దేవా! యవధరింపు మవ్వలివృత్తాంతం బెఱింగించెద. 2

క. ఇనకులతిలకుండు దశముఖ, ఘనదోర్బలహననమూలకారణుండు సనా
తనుండు నితాంతామోదిత, జననీస్వాంతుండు రామచంద్రుం డలరున్. 3

వ. మఱి భువనాలంకారుం డగురఘువల్లభు సుగుణసముదయంబు లాకర్ణించుతలంపున
నిజవల్లభుం గనుంగొని శైలనందన యిట్లనియె. 4

చ. పురదనుజప్రహార! రఘుపుంగవుం డద్దశకంఠరాదిదు
ష్టరదనుజాదులం గునిమి రాజ్యమునొంది జగత్ప్రసిద్ధుండై
ధర నతం డెన్నివర్షములు తా మసియెన్ మఱియేమిచేసె వి
స్తరముగం బల్కవే మిప్పుడు ప్రసన్నుండవై రఘునాథుసత్కథల్. 5

వ. మఱియు సనాతనుండును బరమాత్ముండు నగు నారాజవల్లభు కథామృతంబు గ్రోలం
జేడ్డయు నాస జనియించెడుం బల్కవే యనిన మహాదేవుం డిట్లనియె. 6

సీ. దోషాచరుల నెల్లం దునిమి రామవిభుండు సామ్రాజ్యకలితుండౌ సమయమునను
గశ్యపదూర్వాసగాధేయభృగ్వంగిరసవామదేవాత్రిముసితకణ్వ
ముఖ్యర్షులును దేవమూర్తియౌ కుంభసంభవుండును శ్రీరామభద్రుదర్శ
నార్థులై చనుదెంచి యప్పుణ్యపట్టణద్వారంబునను నిల్చి ద్వారపాలు

తే. రను గనుంగొని కుంభజుం డనియె మీర, లేము చనుదెంచుటను రాఘవేశ్వరునకు
విన్నవింపుండు గనుంగొన వేడ్కం గలదు, వలన దాలస్య మనిన దౌవారికులును.

వ. సభాభవనంబునకుం జని యచట కొలువు వెలయు రఘువల్లభుం గాంచి మ్రొక్కి
దేవా! భవద్దర్శనాభిలాషులై యగస్త్యప్రముఖమునీంద్రులు వచ్చి నిలచియు

న్నవారి నిన వేగంబ తోడితెం డని నియోగించె వారు నట్ల యొనరించి రంత రాఘవుండును. 8

క. చనుదెంచెడు మునివరులను, గనుఁగొని ప్రణతులు నొనర్చి కడువేడ్కన్ సుఖా
సనములును నర్ఘ్యపాద్యము, లును గోగణములు నొసంగి లోకులకరణిన్. 9

తే. కుశల మరసిన వారలు కుశల మనుచుఁ, బలికి యోరాఘవేంద్ర! మద్భాగధేయ
మునను జూడంగఁ గంటిమి దనుజవరుల, నడఁచి రాజ్యాభియుతుఁడవై యలరునిన్ను.

చ. మును దశకంధరాదులను మొత్తి మముం గృపఁ జూడు మంచుఁ బ
ల్కిన తెఱఁ గయ్యె నెమ్మదిని గీల్కొన లోకములన్ సృజింపఁ బెం
పను భరియింపఁ గర్తలగు భవ్యులు సహ్యము మీకు నింకఁ గ
న్గొనఁగను మేఘనాదు ననిఁ గూల్చుట సహ్యమె రాఘవేశ్వరా!. 11

వ. అని పల్కిన భావితాత్ము లగు నమ్మహాత్ముల వాక్యంబులకు విస్మయంబు నొంది హస్తంబులు మొగిడ్చి కౌసల్యానందనుం డిట్లనియె. 12

తే. క్రూరులును బాపు లగునట్టి కుంభకర్ణ, దశముఖాదుల విడనాడి దాశకంఠి
నింత బలుమానిసిని జేయ నేల యనిన, నం దగస్త్యుండు పలికె నిట్లనుచు నపుడు.

వ. రాఘవా! రావణమేఘనాదుల జన్మకర్మచరిత్రప్రకారంబు సంక్షేపంబుగ నెఱింగించెదఁ బూర్వంబు కృతయుగంబునఁ బులస్త్యుం డను చతురాననానందనుఁడు గలం డమ్మహాత్ముండు మేరుధరాధరపార్శ్వంబునఁ దృణబిందునాశ్రమంబున స్వాధ్యాయనిరతుం డై తపంబు సేయుచుండె నిట్లుండ దేవగంధర్వకన్యకలు నృత్యవాద్యవీణాస్వనంబులఁ దత్తపోవిఘ్నంబు గావింపం బూనిన నమ్మహాత్ముం డలిగి మద్దృష్టిగోచరు లగువారలు గర్భంబులు దాల్తు రనుచు శాపం బొసంగె. వారలును దద్భయంబున నొందుదెసకుం జని రవ్వాక్యప్రకారం బెఱుంగకునికిఁ దృణబిందునందనయు నిర్భయంబునఁ జరియింపుచు నిజశరీరంబున గర్భచిహ్నంబు లేర్పడ నతిభయంబునం జనుదెంచి జనకున కెఱింగించిన రాజర్షి యయ్యుండగు నాతృణబిందుండును 14

ఆ. జ్ఞానదృష్టివలన సంయమికృత మంచు, నెఱిఁగి భార్యఁ గాఁగ నిచ్చెఁ దనదు
తనయ నమ్మహాత్ముఁ దగిలి యక్కన్యయుఁ, జేయుచుండె నతనిసేవ చెలియ!. 15

వ. ఇట్లక్కన్యకారత్నంబు సేయు శుశ్రూషలవలనఁ బ్రీతుం డై పులస్త్యుం డుభయవంశవర్ధనుండగు నందను నొక్కని సృజియించి విశ్రవ స్సని యభిధానం బొసంగె నక్కుమారునకు భరద్వాజకన్యవలన విత్తముఖ్యుండగు వైశ్రవణుండు జననం బయ్యె నతండును. 16

చ. తపమున నప్పితామహునిఁ దన్పి ధనాధ్యతయున్ దివౌకసా
ధిపతులు మెచ్చు పుష్పకము తీవ్రమె కైకొని తండ్రిఁ జేరి స
త్కృప నొకచోటు నిల్వ నెఱిఁగింపు మటన్నను లంకవారియం
దు పరులు చేరకుండఁ దగుఁ దుల్యము నాకముతోడఁ జూడఁగన్. 17

వ. తొల్లి నిశాచరసముచయంబుగా విశ్వకర్మ నిర్మించె నిప్పుడును. 18

తే. అందు రాక్షసు లల్ల నారాయణుని సు, దర్శనమునకుఁ జని రసాతలమునందు
జడిసి యుండెద రది నివాసంబు గాఁగ, నిలువు మనినఁ గుబేరుఁ డప్పలుకులకును.

వ. ముదంబంది యాలంకానగరంబున వసియించియుండె నంతఁ గొంతకాలంబునకు రసాతలంబు వెడలి సుమాలి యను రాక్షసపతి తాళనుండు మర్త్యలోకంబునం జరియింపుచుఁ బుష్పకారూఢుం డై విహరించు కుబేరుం గనుంగొని రాక్షసాధిష్ఠితంబగు లంకానగరం బిట్టు లగునే యని చింతింపుచు రాక్షసహితార్థి యై లక్ష్మి యనందగు కైకసి యను నిజనందనం గనుంగొని యి ట్లనియె. 20

తే. యౌవనము నీకు సంప్రాప్తమయ్యె నిది వి, వాహకాలంబు గావున వరుఁడు విశ్ర
వస్సు వరియింపు మిప్పుడు వరసుతులను, ధనదతుల్యులఁ గాంతువు దనరు సుఖము.

వ. అనినఁ గైకసియును సుమాలివచనప్రకారంబున. 22

క. చని యమ్మునిఁ గనుఁగొనఁగను, దనపాదాంగుష్ఠమునను ధర వ్రాయుచు ని
ల్చిన నెవరి దాన వీవన, మునివర! చిత్తమునఁ దెలియ మొనఁగొను మనియెన్. 23

వ. అనిన నమ్మునీంద్రుండు యోగదృష్టి నెఱింగి పుత్రార్థివై చనుదెంచితి విని దారుణంబగు వేళ గావున నతిదారుణులగు రక్కసు లుద్భవించెద రనిన నక్కన్యక యి ట్లనియె. 24

క. మీయంతవారిఁ జెందిన, నీయాలమట లేల యనిన నింతీ! విను నా
రాయణభక్తిపరాయణుఁ, డై యొకనందనుఁడు గల్గు నాతఁడు నిల్చున్. 25

సీ. అని పల్కు సమయమునందున జనించెను బంక్తికంఠుండు నీలమేఘంబో యనఁగ
బలుమేను పదియగు తలలును నిరువదిహస్తము లెవ్వియు నయ్యసురుఁ డవట
పుడమిపైఁ బడినయప్పుడె తల్లడిల్లెను భువనము లన్నియు హేతువులు చాలఁ
గనుపించె నట కుంభకర్ణుండు జనియించెఁ బర్వతం బనఁగ శూర్పణఖపుట్టె
తే. నంతఁ బ్రభవించె శాస్త్రభక్తాగ్రగణ్యుఁ, డమలకర్మానువర్తి స్వాధ్యాయపరుఁడు
సౌమ్యదర్శనుఁ డుపశాంతిశమదమాఢ్యుఁ, డీషణత్రయహరుఁడు విభీషణుండు.

వ. ఇట్లు నిశాచరాహరియును నిరంతరధర్మమార్గానువర్తియు నగుచు జనియించి బాలచంద్రుండునుంబోలె వృద్ధిఁబొందుచు నుండె దశాననకుంభకర్ణులు మూర్ఖాత్ము లై

ఋషిసంఘంబులం దినుచు నతిదారుణులును మహాసత్త్వసంపన్నులును నై ఘోరా
టవుల సంచరింపుచు లోకంబులకు రోగంబులు వృద్ధిఁ బొందుక్రియఁ బెరుఁగు
చుండిరి జానకీవల్లభా! సకలాంతరస్థుండవు విజ్ఞానసదృశుండవు సాక్షివియు నిర్మ
లుండవును నగుచు వెలుఁగు పరమేశ్వరుఁడవు నేను బల్కెడునంతవాఁడనే యైనను
స్వమహిమయగు మాయాగుణంబు ననుసరించి యడిగితివి గావున రక్షోద్భవం
బెఱింగించితి ననుచు నగస్త్యమునీంద్రుండు మఱియు నిట్లనియె. 27

తే. అని యగస్త్యుండు పలుకంగ నాసనమున, మందహాసంబు దళుకొత్త మద్గుణాను
కీర్తనం బిర సజ్జనకీర్తితంబు, ఫలద మని పల్కె రామభూపాలుఁ డపుడు. 28

వ. అనుచు శశిశేఖరుం డవ్వలివృత్తాంతంబు పర్వతరాజనందనతోడ నిట్లనియె నట్లు
దశకంధరాదుల ప్రభావంబు మఱియు నెఱింగించువాఁడై కుంభసంభవుం డిట్లనియె.

సీ. నరనాథ! విను మొకనాఁడు కుబేరుండు పుష్పకారూఢుఁడై పుణ్యుఁడైన
తనతండ్రిఁ గనుఁగొనఁ జనుదేరఁ గైకసి యవ్వైభవముఁ గాంచి యాత్మఁ గుంది
దశకంధరునిఁ జేరి తండ్రి గన్గొను ధనాధ్యక్షుండు నీ విటులగుట లేను
గనుఁగొను టెన్నఁడో యనిన రావణుఁ డిట్టు లనియెఁ జూడుము తల్లి! యాతనికన్న

తే. మిన్న యయ్యెద నటుగాక యున్నసమఁడ, నైన నయ్యెద దుఃఖంబు నడపుమనుచుఁ
దల్లి నటులూఱడించి యాదశముఖుండు, యనుజులనుగొంచుఁ దపము సేయంగఁ జనియె.

వ. ఇట్లు కార్యసిద్ధికొఱకు గోకర్ణం బను పుణ్యక్షేత్రంబునకుం జని వేఱువేఱ సుప్ర
దేశంబు లేర్పఱచుకొని తపంబు సేయం దొడంగి రందు రావణుండు. 31

సీ. దేహంబు దశవర్షసాహస్రములు నొక్కపాదంబునను నిల్చి పంచాగ్నులైనఁ
దినక నిరాహారమున దివ్యసాహస్రవర్షము ల్నిలిచి మున్వర్షములు స
హస్రంబులైనను హవ్యవాహనునియం దొకతలవ్రేల్చుచు నొవర నిట్లు
దలలు తొమ్మిది వ్రేల్చియలయక పదియగు కంధరం బటు ద్రుంచఁ గడఁగునపుడు

తే. వలదు వల దని భారతీవల్లభుండు, వేగఁ జనుదెంచి వత్స! న న్వేఁడు తావ
కేప్సితంబులు కరుణింతు నిప్పు డనినఁ, బలికె దశకంఠుఁ డానందభరితుఁ డగుచు.

వ. దేవా! కరుణించెద వేని సుపర్ణయక్షరాక్షసులవలన నవధ్యత్వంబును నమరత్వంబు
ననుగ్రహింపుము తృణభూతులగు మనుష్యు లెంతవార లనిన వల్లె యని పితా
మహుం డిట్లనియె. 33

క. విను దశకంధర! యనలం, బున వ్రేల్చిననీగుతలలు మునుపటిక్రియఁ గ
ల్గును నక్షయంబు లగుచును, దునిమిన తఱితంగమునను దోడనె యనుచున్. 34

వ. సత్యధర్మపరాయణుండును నిర్మలభాషణుండును నగు విభీషణుసమీపంబునకుం జని
యతనిసాత్త్వికతపంబునకు మెచ్చి యిట్లనియె. 35

తే. వత్స! ధర్మార్థమయ్యె భవత్తపంబు, మేలు వేఁడుము కోరికల్ మిక్కుటంబు
లైనఁ గరుణింతు ననిన నెయ్యమునఁ బల్కె, నవ్విభీషణుఁడపుడు శీతాంశువదన!.
చ. వనరుహగర్భ! కోర్కులు కృపామతి నిచ్చెదవేని ధర్మమం
దునను మనంబు గీల్కొనఁగ దుష్పథవర్తినిగాకయుండఁ జ
య్యనఁ గరుణింపు మన్న సుగుణాకర! యూ వటు లింక వేఁడను
న్నను నమరత్వ మిత్తు నని నామది నీతప మొప్పఁ జేసెడిన్. 37
వ. అనుచు నమరత్వంబు కరుణించి యూర్ధ్వబాహుండై సర్వలోకతాపనంబగు తపం
బుసేయు కుంభకర్ణు సమీపంబునకుఁ జని వరంబు వేఁడు మనిన వాఁడును వాణీ
చోదితుండై యూఱుమాసంబులు నిద్రించుటయు నొక్కదివసంబు భోజనంబును
వలయు ననినఁగమలగర్భుండా వట్ల యగుంగాక యని నిజభవనంబునకుం జనియె సర
స్వతియుఁదద్వక్త్రవినిర్గతయై సత్యలోకంబున కరిగె నంతఁ గుంభకర్ణుండు. 38
ఆ. తెలిసి దుఃఖ మొంది తలఁపు వేఱొక టయ్యె, దైవఘటనమూన్పఁదరమె యనుచు
నూరకుండె నంత వారిజాసనుచేతఁ, బౌత్రు లివ్వరములు వడసి రనుచు. 39

## —ఃః సుమాలి రావణునియొద్దికి వచ్చుట. ఃః—

వ తెలిసి సుమాలియు నిశ్చయంబున రసాతలంబు వెడలి ప్రహస్తాదులం గూడికొని
దశాననుసమీపంబునకుం జనుదెంచి. 40
క. నినుఁ గనుఁగొంటిని దైవగ, తిని మనలంకాపురం బధిష్ఠించు ధనే
శుని వెడల నడిచి యప్పురిఁ, గొనఁదగు నన దశముఖుండు కోపం బొదవన్. 41
వ. మనకుఁ గుబేరుండు గురుఁడును నా కగ్రజుండుఁ గావున వలవ దనిన నవ్విప్రహ
స్తుం డిట్లనియె. 42
క. కాఁ గలవాఁడవు నీ వీ, లాగునఁ బలుకంగఁ దగునె లఘుదార్ఢ్యుఁడవై
యాగిరిభిన్ముఖదివిజుల, తోఁ గడఁగక జ్ఞాతు లనుచుఁ దొలఁగిరె యసురుల్. 43
వ. కశ్యపతనూజు లక్కసెల్లెండ్ర బిడ్డలు గావున శూరులగు వారలకు సౌభ్రాత్రంబు
పనిలేదు సామదానాదిచతురుపాయంబుల శత్రుక్షయంబు గావించు కార్యంబు
నిర్వహించుట రాజధర్మం బనిన దశాననుండు సమ్మతించి చిత్రకూటాచలంబునకుం
దాడివెట్టి ప్రహస్తునిచేత గుహ్యకేశ్వరు వెడలించి యప్పురం బధిష్ఠించి సుఖంబున
నుండెఁ గుబేరుండును బితృవచనప్రకారంబున లంకానగరంబు విడిచి కైలాసంబు
నకుం జని. 44
ఆ. మిగులతపముచేత మెప్పించి శివునితో, సఖ్య మొంది నిత్యసౌఖ్య మొప్ప
నలక యనెడు నగర మవ్విశ్వకర్మని, ర్మింప నిలిచియుండె మించి యచట. 45

వ. ఇట్లు సదాశివభుజపరిపాలితుం డై దిక్పాలకత్వంబు వడసి ధనేశుండు శోభిల్లె దశా
ననుండు వికటరూపి యగు శూర్పణఖ యను తనభగినిని విద్యుజ్జిహ్వుం డను
నొక్క నిశాచరవీరున కొసంగి తాను భువనకంటకుం డై రాక్షసరాజ్యంబు నధి
ష్ఠించియుండె నంత 46

తే. పత్త్రికంధరు శౌర్యసంపదకు మెచ్చి, మయుఁడు దానవవిశ్వకర్మ తనకూఁతు
నొసఁగె మందోదరిని దాన నొక్క శక్తి, నిచ్చె దశకంఠుఁడదియును బుచ్చుకొనియె.

వ. అంత. 48

ఆ. వజ్రమాలి యనెడు వైరోచనునికూఁతుఁ, గుంభకర్ణునకును గోరి పత్త్రి
కంఠుఁ డొసఁగె నంత గంధర్వనాథశై, లూషితనయ నవ్విభీషణునకు 49

వ. సరమ యను పుణ్యచరిత్రను వివాహంబు గావించె నిట్లు ముగ్గురును భార్యలం
గూడి సుఖియింపుచుండి రంతఁ గొంత కాలంబు చనినపిమ్మట మందోదరి యొక్క
నందనుం గనియె వాఁడు జనించునప్పుడు మేఘంబుభంగి మహాధ్వని యొనరించెం
గావున మేఘనాదుం డనం బరఁగెఁ గుంభకర్ణుండు నిద్ర బాధించెడు ననుచు
నొక్క విశాలం బగు గుహ నిర్మింపంజేసి యందు ఘూర్ణమానుండై శయించె
నంత రావణుండు తొల్లిటి గుణంబులు మానక జగద్విద్రావణుం డై మునిజనంబు
లను బుణ్యాంగనలను బాధింపుచుండ నది విని కుబేరుం డిట్లు తగ దని యొక్క
దూతం బనిచిన దశాననుండు. 50

తే. ఆగ్రహంబున నద్ధనదాలయమున, కరిగి బలుసంగర మొనర్చి యతని నోటు
పఱచి యతఁ డజ్జజానిచేతఁ బడసినట్టి, పుష్పకము చంద్రతుల్యంబుఁ బుచ్చుకొనియె.

వ. ఇట్లు కైకొని రథారూఢుం డై. 52

సీ. తటిమి నైర్ఋతియమవరుణాదుల జయించి పాకశాసను గెల్వ నాకమునకుఁ
జని సర్వదేవతాసహితుఁడౌ నయ్యింద్రుతోడ డీకొని క్రేటులాడ నతఁడు
బలుపగ్గములఁ బట్టి బంధించె నది యంత విని మేఘనాదుండు కనలి స్వర్గ
మునకు వేగి మహోగ్రముగఁ బోరి రావణు వదలించి యబ్బంగిఁ ద్రిదశవిభుని
తే. గట్టి నిజపట్టణమునకుఁ బట్టితెచ్చి, సరము లొసఁగంగ నాబ్రహ్మవలన భక్తి
నిలిపి త్రిదశేంద్రు విడిచి యిమ్ముల వసింపు, పొమ్మనియె వింటె వానిశౌర్యమ్ము రామ!.

తే. అంత దశకంధరుఁడును శౌర్యమున మించి, సకలదిక్పాలుర జయించి శైలములను
బాహువుల జిమ్ముచును మహోత్సాహలీల, భువనముల నెల్లఁ జరియించె రవికులేశ!.

వ. ఇట్లు చరియింపుచు నొక్కనాఁడు పరిఘోపమంబులగు నిరుపదికరంబులఁ గైలా
సనగం బెత్తి యచట నరవానరులవలన నాశంబు నొందెద వనుచు లలాటలోచన

భటుం డగు నందీశ్వరునిచేత శాపంబు నొంది యవ్వాక్యంబు గణన సేయక హైహయపట్టణంబునకుం జని యారాజుచేత బద్ధుండయి తండ్రియగు పౌలస్త్యునివలన విడిపింపంబడి యంతట నుడుగక హరిపుంగవుండగు వాలిని జయించు తలంపున నేఁగి యమ్మహాసత్త్వుచేతఁ జతుస్సముద్రంబుల ముంపంబడి కరుణించి విడిచిన నతనితోడ మైత్రి యాపాదించి యప్రతివీరుం డయి చెలఁగొంచె రఘునందనా! దశాననమేఘనాదుల ప్రభావంబు లిట్టివి జగద్రక్షణపరాయణుండ వగు నీచేత మహాచలతుల్యులగు రావణకుంభకర్ణులు తెగటారి రయ్యింద్రజిత్తుండును పుణ్యకీర్తి నుం డగు లక్ష్మణు భుజాసారంబున విసర్జితదార్ఢ్యుం డయ్యె నేమును సకలజనంబులును సుఖంబు గంటిమి మఱియును. 55

సీ. జగముల కెల్ల రక్షకుఁడవౌ నారాయణుండ వీ వఖిలబ్రహ్మాండములను
గరపెంపున నిచ్చరాచరజంతుజాలము లీస్వరూపము జగన్నేత యైన
బ్రహ్మ నీదగు నాభిపంకజంబున నగ్ని వాక్కుతోడుత నీదు వదనమునను
బాహువులను లోకపాలకు ల్చంద్రభాస్కరులు నేత్రములను గర్ణములను
తే. దిగ్విదిశలును బ్రాణము దైలియు నశ్వి, నులును ఘ్రాణంబునను జానువులను జంఘ
లను భువర్లోకమాదిరై తనరులోక, ములను జనియించె నీమహామూర్తి యిట్లు 56

వ. తనరు మఱియుఁ గుక్షిప్రదేశంబువలనఁ జతుస్సముద్రంబులును వక్షోజంబులవలన నింద్రవరుణులును రేతంబువలన వాలఖిల్యాదులును మేఢ్రంబువలన యముండును గుదంబువలన మృత్యువును గోపంబువలనఁ ద్రిలోచనుండగు రుద్రుండును శల్యంబులవలన బర్వతంబులును శిరోజంబులవలన మేఘంబులును రోమంబులవలన నఖిలౌషధులును నఖంబులవలన ఖచరాదులును నుద్భవంబు లయ్యె జానకీవల్లభా! మాయాశక్తిసమన్వితుండ వై గుణవ్యతికరంబుల నానారూపంబులఁ గనుపించు విశ్వరూపపురుషుండవు నీవ మఱియును. 57

సీ. నిన్నాశ్రయించుటనే కదా యమృత మధ్వరమున సురలకుఁ ద్రావఁ గల్గె
నరయ స్థావరజంగమాత్మకం బగుభూమి నీచేతనే కదా నిర్మితంబు
త్వద్భక్త మగుఁ గదా వస్తుసంచయ మెల్లఁ బాలలోపల నెయ్యి పరఁగునట్లు
నంతట నీవు చెల్వొంది యుందువుగదా పరిఢవిల్లెడు చంద్రభాస్కరులును
తే. నీదు తేజంబుననె కదా నీవు వారి, తేజమునఁ గాదు గద యిట్లు తెలియు రెల్ల
జ్ఞానవంతులకే కదా మానవేంద్ర!, యెంత వింతనవచ్చు నీయిట్టిమహిమ. 58
తే. నీదుభక్తి నొకింతైన నిల్పనేని, నిత్యుఁ జిన్మాత్రు సర్వజ్ఞు నిర్వికల్పు
నిన్నుఁ గనుఁగొనఁబోవుఁ గాఁడన్న నొందు, కరణిమనుజుండు నిన్నుఁ గాంచఁగలఁడె రామ!

వ. దేవా! భవదనుగ్రహభాగ్యంబు నగు నాయందుఁ గరుణించి సర్వజ్ఞుండవగు నీ ముంద
టంబల్కిన వాక్యంబులు క్షమియింపవలయు మఱియును. 60

చ. అరసి భజింతు నిత్యుఁ జలనాదివివర్జితు దేశకాలది
గ్వ్యరహితు సర్వగు న్నిగమవేద్యుఁ బరేశు ననన్యు ముఖ్యు న
క్షరు నజు భూతమాయు బరశాంతు ననంతు గుణత్రయాత్మకున్
నిరవధికప్రకాశు హరి నీలనిభున్ రఘువల్లభున్ శివున్. 61

క. తా నిట్లు పల్కి కుమారు, క్ష్మానాయకతనయుతోడ మఱియును దెల్పం
బూనె సదాశివుఁ డవ్వలి, భానుకులాంభోధిచంద్రు పావనగుణముల్. 62

వ. అనుచు వినుతించు కుంభసంభవుం గనుంగొని రఘుపుంగవుం డిట్లనియె. 63

క. తెలియంగ వాలిసుగ్రీ, వులజన్మము వానరత్వ మొప్పుటయును వా
రలు సేయువిక్రమంబులు, బలుకుఁడు కృప ననినఁ గలశభవుఁ డిట్లనియెన్. 64

## వాలిసుగ్రీవుల జననము.

చ. విను రఘువంశభూషణ! సవిస్తర మొప్పఁగ మేరుభూధరం
బున శిఖరంబు స్వర్ణములఁ బొల్పగు నొక్కటి యందు నూఱుయో
జనములఁ బొల్చు నొక్కసభ సారసనంభవుఁ డందు నొక్కనాఁ
డనుపమయోగ మంది కనులంగుల బాష్పజలంబు జారఁగన్. 65

వ. కరంబునం దిగిచి యించుకంత ధ్యానించి విడిచిన నయ్యుదకంబు పుడమిపయిం
బడునంత. 66

క. జనియించె నొకమహాకపి, వనజజుఁడును వానిఁ గాంచి వత్స! సమీపం
బున నిలువు కొంతకాలముఁ, దనరు శుభం బంత ననినఁ దద్వాక్యమునన్. 67

వ. వాఁడు నిలిచి కొంతకాలంబునకు ఫలమూలార్థియై వనంబున సంచరింపుఁడు నొక్క
మణిశిలాంచితం బగు వాపిం గనుంగొని నిక్కిచూచి యందు నిజబింబంబు ప్లవం
గమం బని భ్రమంబు నొంది దుమికి యేమియుం గానక వెడలివచ్చి యప్పుడు. 68

సీ. తన దేహ మొకదివ్యవనితోపమం బైన నతివిస్మయము నొంది యచట నిల్వ
శక్రుండు మధ్యాహ్నసమయంబున సరోరుహాసను బూజించి యరుగుచుండి
కనుఁగొని మోహసంకలితుఁడై వీర్యంబు వదల నవ్వీర్య మవ్వనితవాల
దేశంబునను బడ దేవేంద్రతుల్యపరాక్రమాఢ్యుఁడు వాలి యన జనించె

తే. వాసవుండును వానికి స్వర్ణమాల, యొకటి కరుణించి చనె నంత నుగ్రకిరణుఁ
డట్లు కనుఁగొని మీనధ్వజాస్త్రదళిత, చిత్తుఁడై వీర్యమును వీడ శీఘ్ర మదియు.

క. గ్రీవంబునఁ బడుటను సు, గ్రీవుం డన నుద్భవించెఁ బ్రియుఁ డీతనికిన్

గావలయు నని సమీరజా, ధీవిలసితు నొసఁగి రవిజు దివమున కరిగెన్. 70

వ. అంత. 71

తే. వనిత యవ్వాలిసుగ్రీవు లను తనూభ, వులను గొని నిద్రనొంది సూర్యోదయమున
లేచి తనమేను తొలిభంగి నొచుఁ దనర, నేమి యనవచ్చుఁ బరమేశ్వరేచ్ఛ యనుచు

క. తనయుల నిరువురఁ గైకొని, చని యవ్విధ మెల్ల వనజసంభవునకుఁ బ
ల్కిన నతఁడు చింత వలదని, తనభటు నొకనిఁ గనుఁగొని సుతాత్వపక్ష్యమునన్.

వ. ఇట్లనియె. 74

క. మానుగ ధరపైఁ గిష్కిం, ధానగరము గలదు దేవతలకైనను గ
న్నానఁగఁ బోలదు నీ వి, వ్వానరకులతిలకుఁ జేయు వల్లభు నచటన్. 75

చ. అరయఁగ సర్వభూతవలయమందును గల్గు నజేయులైన వా
నరులు మదాజ్ఞ నీప్లవగు నర్మిలిఁ గొల్తురు గాక శ్రీరమా
వరుఁడు సనాతనుండు జనవత్సలుఁ డెన్నఁడు గౌసలేయుఁడై
ధర రఘునాథమూర్తి యన దా నుదయించునొ నాఁడు వీరునున్. 76

తే. అమ్మహామహునకు సహాయ మ్మొనర్చ, నేఁగెదరు గావుత మటన్న నిట్లు బ్రహ్మ
పలికె నట్టుల యొనరించి తెలియఁ జేసె, మురలి యుద్ధూత పంక్తికంధరవిదారి 77

క. అది మొదలు ముఖ్యవానర, సదనము కిష్కింధ యయ్యె సర్వేశ్వర! మీ
రుదయించితిరి జగంబుల, కొదువలు మాన్పంగ వారికోరిక లలరన్. 78

వ. దేవా! కమలసంభవుండు ప్రార్థించుటవలన మీరు కైకొనిన మనుష్యదేహంబుచేత
లీలయుపోలె సకలభూభారంబు హాననం బయ్యె నింక సర్వభూతాంతస్థుండవు
నిత్యముక్తుండవు చిదాత్మకుండవు నఖండానందవిగ్రహుండవు నగు నీ కివ్విధం
బున నెంత యగు నైనను భవద్యశోవైభవంబు సకలలోకకల్మషాపహంబును
సుఖప్రదంబును గావున లీలామానుషవిగ్రహుండ వనుచు భవద్విషయైకసగుణా
రాధనతత్పరులై పుణ్యు లగువారలు ప్రొద్దుపుత్తురు మఱియును. 79

ఆ. నీకు భక్తులగుచు లోకు లివ్వాలిసు, గ్రీవజన్మకర్మకీర్తనంబు
నేయ వినిన వ్రాయ నాయురారోగ్యంబు, లమరుఁ బాపసంచయములు డుల్లు. 80

## సీతపూర్వవృత్తాంతంబు రామున కగస్త్యుండు చెప్పుట.

వ. రఘునందనా! భవదాశ్రయంబగు నింకొకవృత్తాంతం బెఱింగించెద రావణుండు
జనకనందనం గొనిపోవుకారణంబు వినుము తొల్లి కృతయుగంబున సనత్కుమార
మహేంద్రుం గనుంగొని యతివినయంబున దశాననుం డిట్లనియె 81

సీ. ఏదేవుఁ డలరు దేవేంద్రాదులకు మిన్న బలవంతుఁ డయి ధరాభరణగరిమ
నేపుణ్యుఁ గొలువఁ దా రెదిరించి సంగరంబుల శత్రువుల నుర లొంకుపటతు

శేభవ్య యోగీంద్రు లేప్రొద్దు ధ్యానింతు రెవని భూసురు లెల్లఁ దవిలి కొలుతు
రేమహామహు గుణస్తోమంబు లుగ్రసంసారాంధకారభాస్కరకరంబు

**తే.** లక్ష్మీజగదీశు నారాయణాభిధానుఁ, దెలియఁ బలుకఁడు ప్రేమ నావలన నిలిపి
యనిన దశకంఠుహ్యాత్మసంశయంబు దెలిసి, పలుకఁదొడఁగెను సమ్మానితిలకుఁ డపుడు.

**సీ.** పరఁగ జన్మాదిషడ్భావవర్జితుఁ డౌచు నెవఁ డొప్పు నాఁడు ధాత్రీశ్వరుండు
అతఁడె నారాయణుం డని సురాసురు లెల్ల నుతిసేయుచుందురు ప్రజాపతుల కెల్ల
విభుఁడైన బ్రహ్మ యవ్వేదవేద్యుని నాభికమలంబునను బుట్టెఁ గాంచ నిచ్చ
రాచరాత్మకమగు భూచక్ర మతనిచే నిర్మింపఁబడె దేవనిచయ మెల్ల

**తే.** నమ్మహామహుఁ గొల్చి తా రాహవమున, రిపులనిర్జించు సౌఖ్యంబు లపరిమితము
లొందుచుందురు యోగులు ను ధ్యానయోగములను, భజనయొనరింతు రద్దేవుపాదయుగము

వ. అనిన దశాననుం డిట్లనియె. 84

**తే.** దేవతలచేత నడఁగి యేతెరవు గాంతు, రతఁడు నారాయణుని భీకరాహవమున
మడఁగి పరమంద నెట్టిసన్మార్గగాము, లగుదు రథయులు తెలియుంగ నగు మునీంద్ర.

వ. అనిన సనత్కుమారమునీంద్రుం డిట్లను నాఖండలాది దేవతాబృందంబులచేత
నునుయనువారలు నాకంబు నొంది భోగానుభవంబై నపిదప భ్రష్టు లగుచు భూతలం
బునం బడి పూర్వార్జితంబులగు పాపపుణ్యంబులవలనం బుట్టుచు జచ్చుచు నుందు
దురు మఱియును. 86

**క.** నారాయణుని సుదర్శన, ధారఁ గీటడఁగువారు దఱుగని సౌఖ్యాం
భోరాశిఁ దేలి యారథము, పిరాగ్రణిమూల లెంకి వెలయుదురు సుతా!. 87

వ. అనిన నద్దేవుతోడం దలపడి సంగరం బొనర్చి నిహతుండనై తత్పదప్రాప్తుండ నగు
దుం గాక యనుచుఁ దలంప నమ్మునివల్లభుం డెఱింగి దశకంధరా! కొంతకాలంబు
నైఁపుము నీమనోరథంబు సఫలం బగు నరూపకుండును మహామాయికుండును
నగు నద్దేవునిముఖ్యనిలయంబు లెఱింగించెద నెట్లంటేని. 88

**సీ.** ఓంకారమునను సర్వోర్వీతలంబున సావిత్రివలనను సత్యమునను
స్థావరాదులయందు సకలపట్టణముల నగులయందును జగన్నాయకుండు
చెలువొందు సకలభూవలయంబు భరియించు శేషాహి యారాజశేఖరుండు
పగలును రాత్రియుఁ బర్జన్యుఁడును బ్రహ్మరుద్రాదులును నీసముద్రములును

**తే.** శమనవాతాగ్నిమృత్యువుల్ చంద్రసూర్య, కాలవరుణేంద్రులనుమింకఁగలుగునట్టి
దేవదానవముఖరులు దేవదేవుఁ, డయిన నారాయణుని తావు లని తలంపు 89

వ. మఱియు నివ్విశ్వంబు సృజియించుచు బెంచుచుఁ గాలపరిపక్వం బైనం ద్రుం

చుచు లీలావిగ్రహుండై యుండు సనాతనుం డమ్మహాత్ముండనుం జేకొమ్మది యంతయు నతనిచేత వ్యాప్తం బని యూహచిత్తుండవు గమ్ము మతి యును. 90

సీ. కమనీయజలధరాకార మింపగు మేను నీలోత్పలంబులఁ బోలు కనులు
తొలకరి మెఱుపుతోఁ దులదూఁగు వస్త్రంబు చిఱునవ్వు తళుకొత్తు చిన్ని మొగము
హారకుండలకౌస్తుభాంగదాదివిభూషణాంచితంబగు విగ్రహంబు తీరు
పొలుపొందు బంగరుబొమ్మయో యన లక్ష్మి నొగిఁ గౌఁగిటను జేర్చి యొనరుచూపు
తే. లిట్టి జగదీశు రూపమ్ము నెలమిఁ గాంచఁ, గలుగుదురె దేవభుజగాసురులను నైన
నమ్మహాత్ముని సత్కటాక్షమ్ముఁ గాంచు, సజ్జనుఁడె యింత ఘనయోగశాలి గాక.
తే కలుగ దయ్యజ్ఞదానాదికర్మములను, ఘోరతపముల నైన నవ్వారిజాక్షు
పాదదర్శన మిఁక నొకపగిదిఁ గల్గఁ, గాంచఁగలవేని విను పంక్తికంఠ! యిపుడు.
క. వేదాంతామలదృష్టిని, శ్రీదయితు ముకుందు విష్ణుఁ జిద్ఘను సుజనా
మోదుఁ బరాత్పరుఁ గనుఁగొనఁ, గాదగు మునులాశ్రయించుగతి యిదె పత్నా!
వ. మతియుఁ దద్భక్తుండును దద్గతప్రాణుండును చింతాధూతకల్మషుండును నగు పుణ్యుండు గాంచ నోపు నింక నొక్క సులభమార్గం బెఱింగించెద. 91
సీ. ఆతీర్థ పాదుండు త్రేతాయుగమునందు దశరథనృపతికిఁ దనయుఁ డగుచు
నృపవిగ్రహంబున నిటలాంబకప్రతాపాఢ్యుఁడై జనియించి యఖిలలోక
మాతయౌ నిజమాయతోఁ దండ్రిపనుపునఁ జనుదెంచు దండకంబునకుఁ గాన
సేవింపు మపుడు లక్ష్మీనాథు ననిన నారాయణుం డది యెంద లీవిరోధ
తే. మునకు నారంభమొనరించి తనదు దేహ, హననమున కిట్లు యుద్ధార్థి యగుచు లోక
ములఁ జరించును నటుగానఁ దెలియుమరయఁ, బంక్తికంఠుండు నీపాదభక్తుఁ డనఘ!
క. మనుజులు నీకథ వినినను, వినిపించినఁ దాను జదువ వేడ్కన్ వ్రాయన్
ధనధాన్యపుత్రిసుఖవర్ధను లయి నీపాదభక్తిఁ దనరుదురు భువిన్. 96
వ. అనుచు. 97
ఆ. కలశజుండు సూర్యకులపవిత్రునితోడఁ, బలికె ననుచుఁ దెలియఁ బలికె శైల
తనయతోడ శివుఁడు తదనంతరకథాక్ర, మం బుపక్రమించె మఱియుఁ దెలుప.
వ అప్పుడు కుంభసంభవుండు మరల జానకీపతిం గనుంగొని రఘునందనా! యిం కొక వృత్తాంతంబు గలదు తొల్లి బ్రహ్మలోకంబుననుండి చనుదెంచు నారదమునీంద్రుం గనుంగొని నమస్కరించి దశాననుండు నాకుం బ్రతివీరు నెఱింగింపు మనిన నమ్మానిపర్యుం డించుకంత విచారించి 99
శా. శ్వేతద్వీపమునందు నున్ హరికరాసిం గూలువారున్ జగ
త్ఖ్యాతుం డైన సరోరుహాక్షు చరణధ్యానార్చనప్రక్రియో

చేతు ల్వచ్చి జనింతు ర ట్లగుట త్వద్భీమాహవక్షోణియం
దూఁత మ్మై నిలువంగ నేర్తు రనఁ దా నుప్పొంగి యుద్ధార్థి యై. 100

## రావణుఁడు శ్వేతద్వీపమునకుఁ బోయి భంగపడుట.

క. తో బలములు రహిఁ జెలఁగఁగఁ, గౌబేరం బెక్కి బాహుగర్వసముగ్రుం
డై బిట్టురుగఁగఁ బుష్పక, మాబెడిదపుఁగాంతి కోడి యరుగక నిలిచెన్. 101

తే. దానదం బట్లు నిర్గతదార్ఢ్యమైన, విడిచి చనిచని యాసితద్వీపమునను
బాలికలహస్తములఁజిక్కి పల్కఁబడియె, నెవఁడునిన్నిచ్చటికిఁబంపె నెవ్వఁడనుచు.

వ ఇట్లు హాస్యంబునం బల్కఁబడి యెట్టకేలకుఁ దక్కరవిముక్తుం డై భయాశ్చర్యం
బులు నివ్వటిల నారాయణుం డింతయెుప్ప నే యనుచు నెమ్మనంబున. 103

మ హరిచేతన్ మృతి నొంది పొందెదను బుణ్యంబైన వైకుంఠ మం
దిర మిం కేగతి నారయుడం గనలు నద్దేవుండు నే నవ్విధం
బు రయం బొప్పఁగఁ జేతు నంచు ధరణీపుత్రిన్ బడిం గొంచు నేఁ
గి రమా మానిని లోకమాత యని భక్తిం బెంచె లంకాపురిన్. 104

క. ఇది నిక్కము రఘునందన, మదిఁ బరమాత్ముఁడవు భువనమండనుఁడ వటం
చుఁ దిరంబుగ నెఱుఁగును దశ, వదనుం డిటు లయ్యు నాత్మవధకై చేసెన్. 105

చ. ఇనకులవార్ధిచంద్ర పరమేశుఁడ వాశ్రితబృంద మెల్ల గో
రినగతి జేయుచుందువు ధరిత్రిని గల్గినఁ గల్గుచున్నఁ గ
ల్గను గలయట్టి జీవులకుఁ గారణమూర్తివి సాక్షి వందఱున్
మనుజుఁడ వీ వనంగ నిజమాయ వెలింగెద విట్లు రాఘవా!. 106

ఆ. అనుచు వినుతిఁ జేసి యారాఘవేంద్రుని, చేతఁ బూజ లంది శిష్యజనులు
నఖిలమౌనివరులు నరుదేర స్వాశ్రమం, బునకుఁ జనె నగస్త్యమునివరుండు. 107

వ అంత రాఘవేంద్రుండు సీతాసమేతుం డయి మంత్రిజనమ్ములును తమ్ములును హనుమ
త్ప్రముఖవానరానీకంబులునుం బలసి కొలువ నాసక్తిలేనివాఁ డయ్యును సక్తుండ
పోలె నిఖిలభోగంబు లనుభవింపుచుఁ బరమానందుండు సంసారియు నై చెలువొం
దె. నొక్కనాఁడు పుష్పకంబు చనుదెంచి కుబేరుం డనిన తెఱంగున రఘువల్లభు
తో ని ట్లనియె. 108

చ. నను దశకంధరుండు ప్రధనంబున నోటొరించి నిన్నుఁ గై
కొనె రఘునాథుఁ డద్దశముఖుం దరఁ గూల్చెనా గానఁ దాల్పు మ
య్యనఘుని నవ్విభుండనిలయమ్మున కేఁగిన రమ్మ పొమ్మనన్
మనుజవరేణ్య వచ్చితి సుమంగళవిగ్రహ నిన్ వహింపఁగన్. 109

వ. అనినం గారవించి యేను తలంచు నవసరంబునం జనుదెమ్మనిన నదియు నంతర్ధానం
బు నొందె రఘుపుంగవుండును. 110

ఆ. పౌరకార్యములు కృపాచిత్తుఁడై యథా, న్యాయ మొప్పఁ జలిపె ననుజమంత్రి
వరులు గొలువఁ బుత్త్రమరణాదులును లేక, కలితసౌఖ్య మయ్యెఁ గాల మపుడు.

సీ. శ్రీరమావల్లభుం డారామవిభుఁడు రాజ్యం బెల్ల శాసించు సమయమునను
ధర యెల్ల సస్యసంభరితంబు ఫలవంతములు భూరుహంబులు కలితధర్మ
వర్తనుల్ జనులు స్వధర్మానుకూలురు వనితలు జానకీవల్లభుండు
దినదినంబు విమానమును నెక్కి జనకనందన యంకమున నొప్పఁ దనదు తమ్ము
తే. లును గవిశ్రేష్ఠులును మంత్రులును జెలంగ, ధరణి నెల్లను విహరించుఁ దండ్రియాతఁ
డనఁగఁ బ్రజలను బోషించు నమరు లెల్ల, మెచ్చు కార్యంబు లొనరించు మించుకరుణ.

వ. ఇట్లు విహరించుచు నొక్కనాఁ డకాలమృత్యుండగు నందనుం దోడితెచ్చి విలపించు
బ్రాహ్మణుం గనుంగొని మహాబలుండు గావున నెఱింగి వనంబున నిష్ఠ సలుపు శూ
ద్రుం బరిమార్చి విప్రనందనుం బ్రతికించి యాశూద్రునకు స్వర్గం బొసంగె
నిట్లొసంగి. 113

తే. ఎల్లజనులకు నుపదేశ మిచ్చుభంగి, నిలను గోటులు శివలింగముల నొనర్చి
సకలభోగంబులను భూమిజాసమేతుఁ, డగుచు నొందుచు రాఘవుం డలరె నిట్లు.

వ. అమానుషంబులగు భోగంబు లనుభవించుచు సకలలోకకల్మషాపహంబుగ నిజగుణ
కథనంబు విస్తరించుచు మాయామానుషవిగ్రహుండును లోకవంద్యపదాంబుజుం
డును నేకపత్నీవ్రతుండును రాజర్షియు నగుచు నగ్నిహోత్రాదులు యథావిధ్యు
క్తంబుగా నడుపుచు జనుల రక్షించుచు విధిక్రమంబున రఘునాయకుండు పదివేలవ
త్సరంబులు ధరాతలంబు పాలించె నాసమయంబున. 115

తే. శమదమంబుల నొప్పుచు సాధ్వి యనఁగఁ, బరఁగి రఘునాథుచిత్తంబు పగిది నడుచు
కొనుచు జగదేకమాత యజ్జనకతనయ, సురలు వినుతింపఁ గాలంబు జఱుపుచుండె.

వ. అంత నొక్కనాఁడు సర్వభోగసమన్వితంబగు క్రీడావిపినంబున. 117

## శ్రీరాముఁడు సీతాసమేతుం డై క్రీడావనంబున విహరించుట.

సీ. నీలమాణిక్యసన్నిభదేహు దివ్యాభరణభూషితు సుశాంతుఁ బ్రథసభీము
విద్యున్నిభాంబరు వేద్యు శ్రీరఘునాథుఁ గని సర్వభూషణకలిత యగుచుఁ
గమలాక్షి మిథిలేంద్రకన్య చయ్యనఁ జేరి కరములఁ దత్పాదసరసిజములు
లాలింపుచు స్వభక్తపాలన! యాదిమధ్యాంతవర్జిత! జగదాద్య! దేవ
తే. దేవ! పరమాత్మ! సకలవ్యాప్తస్థిత! యశేష, కారణ! సనాతన! భవాంధకారహరణ!

ఘనచిదానందమయు! సుమంగళి! పరేశ!, యామినీచరసంవర్తకాభిప్రపవన!. 118

వ. మహాత్మా! నిలింపసముదయంబులు నన్నుం జేరి వైకుంఠాగమనం బపేక్షింపుచుం బల్కిన తెఱంగు వినుండు. 119

ఉ. కూరిమిమందిరం బగు వికుంఠము వీడి స్వశక్తివైన నీ
తో రఘువల్లభుండు గుణతోయధి భూస్థలి నిల్చెఁ గాన నేఁ
డారయ నీవు ముందుగఁ బ్రయాణ మొనర్చినఁ దోన వచ్చు నా
భూరమణుండు నిట్లయినఁ బొల్పగు సాధిపమై వికుంఠముల్. 120

వ. అని విన్నవించిరి గావున. 121

తే. తెలియఁ బలికితిఁ జిత్తంబు కోలఁది నవధ, రింపుఁ డిట్టు గా దటంచు శాసింపఁగలనె
యనిన నించుక ధ్యానించి యనియె నిట్లు, జనకనందనతో రామచంద్రవిభుఁడు.

వ. దేవీ! యింతయు నెఱుంగుదు నింతులకు నొక్క యుపాయంబు పల్కెద నీవలన నొక్క యపవాద గలిగిన నమ్మిషవలన భీతుండపోలె వనంబున నిన్ను విడిపింతు నీకును. 123

క. జనియింపఁగలరు వాల్మీ, కిని యాశ్రమమునను గవలు కొమరులు నీకుం
గనుఁగొనఁగ గర్భచిహ్నము, లొనరెను నీమేన నిప్పు డూర్వీతనయా!. 124

ఆ. అంత నన్నుఁ గాంచ నరుదెంచి జను లెల్ల, నమ్మ బాసఁ జేసి నెమ్మిఁ జనుము
కుతలవివరమున వికుంఠధామంబున, కిది యు నిజము మనల కిద్దఱకును. 125

వ. ఏను దోడనె చనుదెంచెద ననుచు నమ్మహాదేవిని విడిచి ముఖ్యజ్ఞానలక్షణుం డగు జానకీవల్లభుండు నిజపరివారంబులు గొలువఁ గొలువునం గూర్చుండి హాస్యప్రౌఢ కథావిశేషంబులం బ్రొద్దుపుచ్చుచుఁ బ్రసంగవశంబున విజయుం డను నొక్క భటుం గనుంగొని యిట్లనియె. 126

చ. నగరమునందుఁ బల్లెల జనంబులు నేమని పల్కుచుందు రిం
పుగ నను మత్సహోదరుల భూతనయన్ దెలియంగఁ బల్కు భీ
తిగ నిఁకఁ బల్కకున్న నను ద్రుంచినయట్టు లటన్నఁ బల్కె వాఁ (?)
డా గడు భయంబు నొంది తెగడు న్నిను లోకము లంచుఁ బార్వతీ!. 127

వ. మఱియు నిట్లనియె నెల్లవారును రామచంద్రుండు దుష్కరంబగు కార్యం బొనరించియు రావణుండు గొనిపోవుట లడుగుపఱచి తొంటిభంగిఁ దనభార్యం గైకొనియె మనము జనంబునకుం దలంప దుష్కర్మంబగు బలియుండగువారల కేమి యనం బోలు నిదియు కాదు. 128

ఆ. ప్రభువు లెట్టివారొ ప్రజ లట్టివా రౌదు, రిది నిజంబు రాఘవేశ్వరునకు

నేమి సుఖము వారు నింత తానొడిగట్టి, తగుదు ననుచు సీతఁ దగిలి యుంట. 129

వ. అనుచు నిశ్చయంబుగఁ బల్కుచు తనివ సుహృజ్జనంబుల నడుగ వారును నట్ల పలుక నందఱఁ గొలువు వీడి చన నియోగించి లక్ష్మణుం బిలిపించి. 130

సీ. అవనిజవలన లోకాపవాద జనించె భరియింపఁ జాల రేపటిదినంబు
నీవు మాయిదినెను నిజముగ వాల్మీకియాశ్రమంబున డించి యతిరయమునఁ
జనుదెమ్ము యొండు పల్కిన నన్నుఁ ద్రుంచినయట్లు లన్నను భీతి నంది లక్ష్మ
ణుండు ప్రాగ్దున లేచి మెండైనరథముపై నెక్కించి మంత్రితో నేఁగి యచట

తే. డించి మాతల్లి! లోకంబు లెంచుమాట, కోడి రఘువల్లభుఁడు నిన్ను వీడఁబనిచె
జనుము వాల్మీకియాశ్రమంబునకు దోస, మెఱుఁగఁజేసితి రామాజ్ఞ నింతవట్టు. 131

ఆ. అనుచు రాఁజేర నరుదెంచి లక్ష్మణుఁ, డంత జనకజయును హారఘూత్త
మా! యటంచు ముగ్ధ యోయని విలపింపఁ, దెలిసి రామచంద్రు లలన యనుచు.

వ. యోగదృష్టివలన రాఁగలకార్యంబులఁ దెలిసి వాల్మీకమునీంద్రుం డతిరయంబునం జనుదెంచి తల్లీ! దైవఘటనకుఁ జింతింప వలవదు జగన్మాతవగు నీకుఁ గొఱంత యేమి? యనుచు నర్ఘ్యపాద్యాదులవలనఁ బూజించి మునికన్యకల నొసంగి వారలు వాల్మీకివాక్యంబువలనఁ బరమాత్మ యగు నారాయణునిలక్ష్మి యని తలంచి యనుదినంబును రాజోపచారంబులవలనఁ బూజింపుచుండి రంత. 133

చ జనకజ లేకయుండుటనె సర్వజగద్వలయేశుఁ డయ్యుఁ దా
ననుపమభోగసంగముల నన్నిటి వీడి విరక్తుఁడై మునీం
ద్రునిగతి మౌనిసేవితపదుండు పరాత్పరుఁ డాదిదేవుఁ డ
య్యనఘుఁడు రాఘవుం గృహమందుల నిల్చె హిమాద్రినందనా!. 134

క. అనుచుఁ దుషారాచలనం, దనకోడ విదేహరాజతనయాధిపు పా
వనకీర్తి నాడి శివుఁ డో, య్యన నవ్వలితెఱఁగుఁ దెలుప నారంభించెన్. 135

వ ఇట్లు జగన్మంగళం బగు నాత్మశక్తివలన రఘుపుంగవుండు మంగళాత్మకంబును నుత్తమంబును నగు రామాయణం బను నిజకీర్తిసుధాకరకిరణసముదయంబు జగంబులం జల్లి పూర్వకాలంబున రాజర్షివర్యులచేత నభిసేవితంబులగు ధర్మమార్గంబులఁ దాను సంచరింపుచు. 136

ఆ. తగు నుదారబుద్ధి యగు లక్ష్మణునిచేత, నడుగఁబడి మహీను గ్రహమున
నృగమహీంద్రునసను బగతిపైఁ దిర్యక్త్వ, మనుభవింపఁ గలిగె ననుచుఁ బలికె.

వ. పావనంబగు నొక్కకథ నుపన్యసించెద ననిన నంత నొక్కనాఁ డేకాంతంబునం గూర్చున్న రమాలాలితపాదపంకజుండగు తనయున్నం గనుంగొని సంపాదితశుద్ధ

భావనుం డయి కరయుగంబులు మొగిడ్చి వినయంబున మరల సుమిత్రానందనుం డి
ట్లనియె. 138

ఉ. ఆరయ సర్వదేహులకు నాత్మ వధీశుఁడ వవ్యయుండవు౯
దూరితవిగ్రహుండవు వినుండవు శుద్ధవిబోధకుండ వీ
తీరగునట్టులైన భవదీయపదాంబుజభృంగనిర్మితో
దారనిజాంతరంగులగు ధన్యులకుం గనుపింతు వీశ్వరా!. 139

ఆ. ఏ నమస్కరింతు మానినాక్షిచయుస, ద్వంద్వములు భవాపవర్గకరము
లైన నీపదముల కజ్ఞాననార్ధి వే, గనుక దాఁటుసగణిఁ గలుపఁగదవె. 140

వ. అనుచు విన్నవించు మూర్ధులత్మునిం గనుంగొని నిఖిలాంతరస్థుండును బ్రసన్నార్తి
హరుండును బ్రసన్నబుద్ధియు నగు జానకీవల్లభుండు సంతసించి శ్రుతిప్రసన్నుం
డును వేదశిరోభూషణంబును నగు విజ్ఞానంబు నజ్ఞానతమోపశాంతి యగుభంగిఁ
బల్కం దొడంగె నెట్లనిన. 141

## శ్రీరాముఁడు లక్ష్మణునికిఁ దత్త్వోపదేశము చేయుట

సీ. మనుజుండు ప్రథమంబు తనయాశ్రమమున విహితములౌ క్రియల సమ్మతి నొనర్చి
పరవిసాధనచతుష్టయసుసంపత్తిభాసురసమాసాదితశుద్ధమాన
సత్వంబుగలిగి స్వేచ్ఛను దత్క్రియల నెల్ల నొకయెడ నిలిపి తా నొక్క గురువు
నాత్మసంప్రాప్తికై యనుసరింపఁగఁ బోలు ననఁగ నేటికి నిట్లు లంటివేని

తే. యాక్రియాఁగోరి యొనరించునట్టివారి, కగును హేతుప్రపంగు దేహమునకవి యు
యగుఁ బ్రియాప్రియములకు ధర్మాధర్ములకుఁ, గారణంబులు వార్ధిగంభీరనిజము.

క. వే యొకతను వొందుచుఁ దొలి, తీరున నే క్రియ లొనర్చి దేహ మగును నీ
తీరున నరయఁగ నీసం, సారము చక్రంబుభాతి సత్యము వత్సా!. 143

ఉ. దీనికి మూలకారణముఁ దెల్పెద జ్ఞానము లేకయున్కి య
ద్దానని నిశ్చయింపఁ బడెఁ దద్దనక్రియ యందు విద్య బ
ల్మానిని తద్భవంబులు తలంపఁగఁ గర్మము లొప్పవెట్లన౯
భానుకులీన! శాస్త్రములు పల్కెడు పెద్దలచేతఁ దద్దయు౯. 144

తే. ఒనర నజ్ఞాన ముడుఁగక యుండెనేని, ద్వేషరాగాదులును గల్గు దోషములను
గర్మ పుట్టించు సంసృతిఁ గదుమఁ దగదు, గాన విజ్ఞానవిచారి గాఁగ వలయు.

వ. వేదచోదితంబును దివ్యభంగిఁ బురుషార్థసాధనంబు గావునఁ బ్రాణభృతుం డగు
వాఁడు సేయవలయు ననుటను నిత్యానపాయిత్వంబునఁ జేయకున్న దోషంబు
గలుగు నని వికృతులు పలుకుటవలన ముముక్షు లగువారల కెల్లకాలంబును గ్రియల

నొనరించుటయ కార్యం బంటివేని స్వతంత్రయు నన్యభృతకార్యకారిణియు నితరాన
పేక్షయుఁ గావున విద్యయ యవలంబనార్హం బదియగునం గాక. 146

సీ. సవనంబు దలఁపంగ సత్యస్వరూపి యయ్యును గారకంబులఁ దనకు వేఱు
లగువానిఁ గాంక్షించు యాజకునకు ఫలం బొసఁగుమాడ్కి నవిద్య యొసఁగు మోక్ష
మమరు వేదోక్తకర్మములఁ గాంక్షించిన యంటివేని కుమార! యట్లు గాదు
మహి నొప్పు దేహాభిమానంబునఁ గ్రియ లహంకృతి పోవ విద్యలు చెలంగు

తే. విమలవిజ్ఞానభూషిత విద్య యదియు, నంత మంతఃకరణావృత్తికారకములఁ
గర్మఁ గాంక్షించు విద్య యెక్కడం బటంచుఁ, గాన ఫలదానార్హ నిగ్రహగ్రాహి వగును.

వ. ఇట్లు విద్యాకర్మ లధికంబగు ద్వేష్టవిరోధంబు గలుగుటం జేసి నీవు పల్కిన తెఱం
గుఁ గంటివేని. 148

ఆ. ఎంతపట్టు పాయ కీదేహములయందు, నాత్మబుద్ధి గలుగు నంతపట్టు
వేదసముదయప్రచోదితార్థములఁ దా, ననుసరించి మనుజుఁ డరుగవలయు. 149

వ. అయినను 150

సీ. జగమునఁ దగుపనిషద్వాక్యములు నిషిద్ధంబయ్యె: గాన నెక్కడంబు గాఁగఁ
బరమాత్మ నెఱిఁగి యేఁ బలికిన నతిఁ గ్రియ లుడలింపవలయు నేసమయమందు
నూఁదుఁ బరాత్మాత్మభేదబాధకమగు విజ్ఞాన మవ్వేళ నెలయుటు
నాత్మసంసృతిహేతు వగు మాయ నిజకారకర్మల నిఁక వేఱుకరణి గాదు

తే. మరలి తొలిపోలిఁ శ్రుతిస్మృతిప్రమాణములను, గాక యది కార్యకారియై గాని యట్ల
తనరు విజ్ఞానమాత్రంబునను విశుద్ధ, యద్వితీయ యనంగఁ గల్యాణచరిత. 151

ఆ. విను మవిద్య యిట్లు జనియింపకున్న న, హంకృతియును బుట్టదట్లు గాన
ప్రీతితోఁ బ్రసిద్ధహేతువ యైన వి, ద్యయ ధరింపఁ బోలు నయవిగుండ. 152

వ. ఇవ్విధంబున సమస్తకర్మంబులకును న్యాసంబు ప్రసిద్ధం బనుచుఁ దైత్తిరీయ
శ్రుతివలన మోక్షంబునకొఱకు జ్ఞానంబకాని కర్మంబు సాధనంబు కాదని వాజ
సనేయశ్రుతివలనను సాధకంబుగఁ బల్కంబడియె నిది యు కాదు. 153

క. కారకములఁ గ్రతువగు నా, తీరున నజ్ఞాన మిట్లు దెలియు ఫలంబు
ల్వేఱగుట విద్యతోడుత, నారయ దృష్టాంత మగునె యధ్వరము మహిజ్ఞా 154

చ. అనఘ! యనాత్మయైన తనువందుల యేనను నాత్మబుద్ధి గ
ల్గు నదియు ప్రత్యనాయ మగుఁ గోరినఁ గల్గ దొకింత తత్త్వద
ర్శనులకుఁ గాన వైర మని చేసెడుభంగి విధానమంచుఁ జెం
దినను నవిక్రియాత్ముఁ డగు ధీరుఁడు కర్మను వీడఁ గాఁ దగుఁజ్ఞా. 155

వ. ఇట్లొనరించి యంత శ్రద్ధాన్వితుండై గురువు సాధనంబున విశుద్ధమానసుం డగుచుఁ దత్త్వమసీతివాక్యంబున జీవపరమాత్మలకు నైకత్వం బెఱుంగ నేని మేరుధరాధరం బునుం బోలె నకంపనుండై సుఖంబు నొందు నిబ్భంగి యొట్లగునంటేని యమ్మహా వాక్యంబు సామవేదస్థంబు గావున సమానాధికరణవాక్యం బని చెప్పవలయుఁ గాదేని యాదియందు మధ్యమపురుషకముపత్తి గల్గు "సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః" ఇతి న్యాయంబున నభిహితాన్వయవాదం బన్వితాభిధాన వాదం బను నివి రెండును నివాక్యార్థప్రసిద్ధియంబున సంభవింప నేరవిం కెట్లనిన "సోఽయం దేవదత్త!" యను వాక్యంబుభంగి నభేదాన్వయవాదంబు సేయవలయు నత్తెఱం గెఱింగించెద. 156

సీ. అమ్మహావాక్యార్థ మబ్బుఁగ వాక్యసంఘటితపదంబులు గాంచఁ దత్త్వ
దార్థంబు నెఱుఁగఁగ నగు మూఁడుపదములు తత్పదంబును ద్వంపదంబు నసి యు
నెడు క్రియాపదము నా నెంచఁ బరమాత్మ మగ్గుటల నౌఁ దత్పదంబునకు రెండ
వది యనఁ దగిన యాత్వంపదంబునకు జీవుఁడు లక్షణావృత్తి వాక్యటీకను

తే. నసి యను క్రియాపదం బైక్య మెసఁగఁ బలికె, జీవపరమాత్మలకు నిట్టి త్రోవవెలయ
వారు వాక్యార్థజిజ్ఞాసపరు లనఁ, దగుదు రె మెచ్చెదను సుమిత్రాతనూజ!. 157

వ. అందగపడని హేతువువలనఁ బరమాత్మయందుఁ బరోక్షత్వంబును బ్రత్యక్త్వంబును నసఁ బ్రతిలోమప్రకాశమానత్వంబు గావునఁ దత్తజ్జీవుని యందునను గల్గుటం జేసి యేతాదృశవిరుద్ధధర్మములు జీవపరమాత్మల కెవ్విధంబునఁ "దత్త్వమసి" యను మహావాక్యం బైక్యంబు బోధించె నంటేని 'గంగాయాం ఘోషః' యనువాక్యంబు జహల్లక్షణంబును 'శోణో ధావతి' యనువాక్యం బజహల్లక్షణంబును ననుసర్థంబులు బోధించుం గాని యివ్వాక్యార్థంబున నాలక్షణంబులు గూడ విం కెట్లనిన "సోఽయం దేవదత్తః" యను వాక్యంబు తద్దేశ తత్కాల ఏతద్దేశ ఏతత్కాలంబు లగు విరుద్ధధర్మంబులు విడిచి భాగత్యాగలక్షణంబున దేవదత్తస్వరూపంబును లక్షించి తదైక్యంబును బోధించినభంగిఁ 'దత్త్వమసి' తివాక్యంబున విరుద్ధధర్మం బులగు పరోక్షత్వప్రత్యక్త్వంబును విడని తత్త్వంపదంబులవలన జహల్లక్షణాపారం పర్యభాగత్యాగలక్షణంబునఁ జైతన్యస్వరూపంబును సంగ్రహించి తచ్చైతన్య స్వరూపాభేదంబును బోధించె నిది యసంశయంబు మఱియును. 158

కలికవృత్తము. కనుఁగొన శబ్దస్పర్శరూపరసగంధములు సూక్ష్మభూతము లై
దును బంచీకృతము లగుచు నయ్యవి స్థూలశరీరజనకములు గా
వునఁ బంచీకృతభూతసంభవం బగు నదియ గలుగుట గాదియుఁ జెం
దిన సుఖదుఃఖము లొందు నటన మీతియున సూక్ష్మశరీర మగుణా. 159

వ. ఇదియు ననాదికర్మజంబును మాయామయంబును నాత్మకు స్థూలోపాధియు ననం
బఱఁగు నపంచీకృతసూక్ష్మతన్మాత్రపారంపత్యముచే సూక్ష్మభూతసంభవంబును మనో
బుద్ధ్యహంకారదశేంద్రియప్రాణపంచకసంయుతంబును భోక్తకు సుఖదుఃఖాద్యను
సాధనంబును నాత్మకు రెండవదియును నన సూక్ష్మదేహం బొప్పు ననాదియు నని
ర్వాచ్యంబును మాయాప్రధానంబును గావున నాత్మకుఁ బ్రథమశరీరం బనఁ గార
ణదేహం బొప్పు మఱియును. 160

క. ఈదేహత్రితయంబునఁ, దాఁ దగులం డనుచుఁ దనదు తనువునఁ దెలియం
గాఁదగు నాత్మను నీక్రియఁ, దాఁ దెలిసిన సౌఖ్యసంభృతస్వాంతుఁ డగున్. 161

వ. మఱియును. 162

చ. ఎఱుపగు పుష్పమందుఁ గదియించిన సుస్ఫటికంబుభాతి నా
త్మ కహితసంగుఁ డవ్యయుఁడుఁ దా నజుఁ డయ్యును గోశయుక్తుఁడై
యొరులకుఁ దత్స్వరూపుఁడుగ నుండును గారణకార్యసంగమం
బరయుఁగ లక్ష్మణుండ! నిజ మభ్రనినాదము (వేదవిద్వరా!). 163

వ. మఱియును. 164

*పంచచామరము. కనుంగొనన్ గుణత్రయాత్మకంబు నైనబుద్ధికిన్
అనంగ నొప్పు జాగ్రదాదు లట్టిమూఁడు వృత్తులం
దు నిజ్జగంబు వెల్గుఁ గానఁ దోఁచ దొక్క టున్న వే
ళ నిట్టు లౌట మిథ్యగాఁ దలంప నౌను లక్ష్మణా! 165

వ. ఇవ్విధం బంతయుఁ దద్వృత్తిత్రితయాత్మకంబగు జగంబు. 166

†మానిని. అవ్యయధాముఁడు నిత్యుఁడు బ్రహ్మయు నచ్యుతుఁడున్ శివుఁ డౌచును దా
నివ్విధి నొప్పు పరేశునియందున నెన్నఁగఁ గల్పిత మౌను జగం
బెవ్విధి నన్నను రజ్జువునందు నహీంద్రము భ్రాంతి జనించినటుల్
దవ్వుల నుండినవాఁడు జగంబును దల్చును నీశునియం దనుజా!. 167

వ. మఱియు దేహేంద్రియప్రాణమనశ్చిదాత్మలను సదసత్పదార్థంబుల కజస్రంబును
సంగంబును బరస్పరమిథ్యాతాదాత్మ్యంబునఁ దమోమూలంబున నజ్ఞానమం బుట్టు
క్రియావృద్ధి యెంతపర్యంతంబు గల్గు నంతపట్టు విద్వాంసుల కయినను సంసారం
బపరిహార్యం బగు నదియునుం గాక. 168

సీ. అరయంగ "నేహ నానాస్తి కించన" యన "నాత్ర కాచనభిదాస్తి" యనఁగఁ
దెలియు "నధాత ఆదేశోన" యనఁగను జెలువొందు శ్రుతివాక్యములను నిఖిల

---

* ఈవృత్తము మూలగ్రంథాధారమున సరిచేయఁబడినది.

† ఈపద్యము మూలాభిప్రాయమున ఛందోనిబంధితమైనది.

ము ను నిరాకృత మయ్యె మనుజుఁ డిట్లగుటచే మామిడిపండున మధురరసము
గొని టెంకయును జర్మమును పాఱవైచిన గతిని వ్యాకృత్మమలమం దతిగుణాఢ్యుఁ
తే. డన సదాస్వాదితసుచిద్ఘనామృతుఁ డగు,నతయ నఖిలంబు విడుచు సత్యంబు నింత
పలుకఁ బనిలేదు తా నిట్లు తెలిసి మనసు, నిలుపఁజాలిన రఘుంశతిలక! నిజము.

వ. మఱియు 'నజాయతే న మ్రియతే' యను వాక్యంబుగ. 170

కలికవృత్తము. వికహితషడ్భావుఁడు ప్రాజ్ఞుండును వికతసమస్తావ యవుఁడు భా
సురుఁ డద్వయుఁడు స్వయంప్రభుఁ డమలుండు సుఖరూపుఁడు సర్వగతుఁడు ని
ట్లరసిన నొప్పు పరబ్రహ్మవలన నతిసుఖుగుఃఖాత్మక మగు ను
స్మరణము గల్గునె యజ్ఞానాధ్యాసవలన సౌమిత్రీ! యాదియుఁగా. 171

క. జ్ఞానంబు గలిగె నేనియు, జ్ఞానాజ్ఞానముల కింపు గలుగదు గానం
దోడనె నశియించును న, జ్ఞానంబునఁ బుట్టినట్టి కార్యము వత్సా!. 172

వ. అన్యోన్యాధ్యాసంబు లెవ్వి యనిన. 173

సీ. ఒకవస్తువును వేఱె యొకవస్తువుగను దా నొకవస్తుధర్మంబు నొండువస్తు
ధర్మంబుగను బుద్ధిఁ దలఁచుట లననివి తగు "నహంకర్తహమో దహతి" యనెడు
వాక్యంబులట్ల నీ వసుధను ధర్మిధర్మాధ్యాస లన సుమిత్రాతనూజ!
మఱియుఁ బల్కెదఁ బ్రథమంబ వికల్పితప్రపంచసా క్షునఁబడు చిదాత్మ

తే. యం దహంకారమునను రాగాదిధర్మ, కంబులగు దానివృత్తులు గల్గె మాయ
నెనయుఁగావునసంసారహేతువులుని, రామయుఁడుపరుఁడునగుబ్రహ్మమయ్యె నిజము

వ. కాని యయ్యహంకారంబును దద్వృత్తులను లేని సుషుప్తిసమయంబున "తమోభి
భూత స్సుఖరూపమే" తీతి "సుఖ మహామస్వాప్సం" మితి శ్రుతివాక్యంబులచేత
సుఖస్వరూపుం డగుచు విభావితుం డగుఁ గావున నహంకారతద్వృత్తిసామాపణం
బునసె కాని విచారింప సంసారం బాత్మయందుఁ గనఁబడదు మఱియును 175

సీ. ఒనర ననాద్యవిద్యోద్భవబుద్ధిబింబితుఁ డగు జీవుని పేర నగు చి
దాభాసుఁ డన వాత్మ యచ్చిదాభాసబుద్ధులకును సాక్షియై వెలయు వేఱ
బుద్ధ్యుపాధికుఁడౌచుఁ బొలుపొందు విజ్ఞానమయుఁడని యజుఁడని మఱియుఁ దలఁచి
బుద్ధిచిద్బింబంబుఁ బోల్పఁ దత్సాక్ష్యాత్మయును మూఁడు నిలుచుట నొకటికొకటి

తే. కైనతాదాత్మ్యమనెడు నధ్యాసమిథ్య, వలన "లోహోదహతి" యనువాక్యమట్లు
లగును నేఁజేతునటయు నాత్మయందుఁ, గాని నిక్కంబుఁ దెలియంగఁ గాదువత్స!.

వ. అవ్విధంబున నెయ్యన్యోన్యాధ్యాసవలనఁ జిదాత్మచేతన్యులకును జడాజడత్వంబులు
గనఁబడును గావున విద్వాంసుం డగువాఁడు గురుముఖంబునను వేదవాక్యంబులవల

నను సంజాతవిద్యావిభవధురీణుండై యాత్మగోచరంబగు జడకార్యం బశేషంబు
నిరసించి యాత్మస్థుండును నుపాధివర్జితుండును నగు స్వాత్మను నెఱింగి యాసమ
యంబున. 177

చ. విరహితుఁడై వినిశ్చితుఁడు విగ్రహుఁడై విగతామయుండు భా
సురుఁడు సదావిముక్తుఁడు విశుద్ధుఁడు నక్రియుఁడై యజుండు సం
భరితయచింత్యశక్తుఁడును భిన్నుఁడు నండు సకృద్విభాతుఁడై
విరహితపాపుఁడై సుఖుఁడు వేద్యుఁడు నంచుఁ దలంపఁగాఁ దగున్. 178

వ. మఱియు నతీంద్రియజ్ఞానుండును సంపూర్ణుండును విశుద్ధవిజ్ఞానఘనుండును వేద
వాదులగు బుధులచేత వ్యాఖ్యానితుండును ననుచు నెల్లయెడల భావన యొనరిం
చెనేని యట్టి యఖండితాత్ముం డగువాని విశుద్ధభావన సదాసేవితం బగు నౌషధంబు
రోగంబుల హరించుపోలిక సకారకంబులతోడ నవిద్యను నశియింపం జేయుఁ గావున.

క. మనుజులు దిరుగనిచోటునఁ, జని విమలాత్ముఁడు ననన్యసాధనుఁడు సుఖా
సనుఁడును విజితదశేంద్రియుఁడును మౌనియు నగుచు మనుజుఁడు నిలువవలయున్.

వ. ఇట్లు నిలిచి. 181

ఆ. ఆతఁ డొకటి యగు పదార్థంబు భావించి, మిగుల జ్ఞానదృశుఁ డగుచుఁ బండి
తుండు నాత్మసంస్థితుండు కావలయుఁ గే, వలము భానువంశతిలక! యిట్టులు. 182

వ. అంత. 183

సీ. తాను జరాచరాత్మకమగు విశ్వ మంతయు నెంచుపరమాత్మదర్శనంబు
కరణిఁ గాంచుచు సర్వకారణుండగు పరమాత్మయందు లయం బొనర్చి
యానందమయుఁడు నత్యంతసంపూర్ణుఁడై యుండెఁ గాఁ దగు నిట్టు లుండెనేని
యతఁ డెట్టివేళ బాహ్యాంతరవస్తునిష్ఠయు నెఱుంగఁడు సంశయమ్ము నిదియుఁ

తే. గాక విజ్ఞానమాత్రంబు గాక జగము, తత్సమాధికిఁ బూర్వంబ తలఁపవలయు
వాచ్య మిదియుఁ బ్రణవం బవాచకంబు, గాదు వేదాంతగతిని నిక్కంబు వత్స!

వ. కావున. 185

క. ఈనిఖిలజగంబున న, జ్ఞానంబును దలఁపఁబడియె సౌమిత్రీ! వి
జ్ఞానంబు గల్గెనేనియుఁ, దోనె దృశ్యాన్య మగుచుఁ దోఁచును నిజమున్. 186

వ. ఇంక నయోంకారం బెట్టి దంటేని. 187

సీ. కలుగు నకారం బుకార మకారంబు లన మూఁడు వర్ణంబు లయ్యె వాని
యం దవస్థలు జాగ్రదాదులు మూఁడు వర్ణనుమానికిని సమస్థలకు విశ్వ
తైజసప్రాజ్ఞులు దగుదనుగ్యులని సమాధికిఁ బూర్వమే భువిఁ దెలియఁబడును
గానఁ బూర్వోక్తప్రకారంబునను విశ్వుఁ డాద్యుఁ డైన యకార మయ్యుకార

తే. మునను దైజసుఁ డాధ్యత్ముఁ డనఁగఁ దగిన, యయ్యుకారంబు నమ్మకారాంతరమునఁ
బ్రాజ్ఞుఁ డాఖ్యాత్ముఁ డెనసు కారంబుల మము, మించుపరమాత్మ యందుఁ గావించవలయు.

వ. ఇట్లు చిత్తమందును గాఢముండును నగు పరమాత్మయందు లయం బొనరించి యంత.

ఆ. ఎవనియందు లయము నేనొనర్చితి నతఁ, డేను నిత్యుఁడను జ్ఞానదృశుఁడ
నెనయ నిత్యముక్తుఁడను గతోపాధినం, ...ను నటంచుఁ దలఁపఁ జను బుధుండు.

వ. ఇట్లు దలంచుచు. 191

క. చలియింపని జలములు గల, జలనిధి తెఱఁగున నరుండు స్వానందమునన్
మెలఁగుచును బరిస్రుతభూ, తలుఁడును ముక్తుండు నగుచుఁ దనరఁగవలయున్. 192

వ. ఇట్లు పరిజ్ఞాతపరాత్మభావుండును నిత్యాత్మసుఖప్రకాశకుండును సదాభ్యస్త సమాధియోగుండును నివృత్తసర్వేంద్రియవృత్తిగోచరుండును విసర్జితాశేషశత్రుండును జితపద్ముజాత్ముండును నయి యుండు మునిపల్లభునకు దినంబును నేను గానం బడుదుఁ గావున నిట్టియాత్మ నహర్నిశంబును ధ్యానింపుచు ముక్తసమస్తబంధనుం డయి ప్రారబ్ధంబున సుఖదుఃఖంబులు గలిగినను నభిమానంబు లేక యోగియగువాఁడు నిలువవలయు నిదియును గాక. 193

తే. ఆదిమధ్యాంతములను నభేద మెఱిఁగి, భేదభయదంబులగు విధివాదచోది
తముల విడనాడి యాత్మయై తనరి సకల, జీవుల వెలుంగు స్వాత్మను జేరవలయు. 194

వ. ఇదియు గాక యాత్మయందు విశ్వం బంతయు నభేదంబున క్షీరంబులయందు క్షీరంబులు గలుపుకరణిని భావింపం బోలు నిట్లయిన నాతోడుతి నభేదుం డగు మతియును. 195

చ. శ్రుతులను సత్ప్రమాణములఁ జొప్పడుయుక్తుల నిజ్జగంబు చం
ద్రతరణులంబుపాత్రలను దద్గుణులై కనిపించుమాడ్కి మా
రితి మగుఁ గాన మానవుఁ డరిందమ! మిథ్య యటంచుఁ దల్పఁ బో
లు తను భవంబున న్నిలిచి లోకులభంగిని నిల్చియుండినన్. 196

క. నరుఁడు మదాత్మయటంచును, బరువడి జగమెల్లఁ గాంచుపర్యంతంబుం
బరమద్విగ్రహసేవా, పరుఁ డయి జరుపంగవలయుఁ బదపడి దినముల్. 197

వ ఇట్లయిన నహర్నిశంబులయందు "తస్యైవ ఆత్మా వివృణుతే తనూం స్వాం" అను శ్రుత్యుక్తప్రకారంబున హృదయగోచరుండు నగుదు నిప్పుడు నీయందుఁ బ్రియంబున నేను బల్కిన రహస్యంబును శ్రుతిసారసంగ్రహంబును నగు నీయర్థంబు నెవ్వరైనను నాలోచనంబు సేయుదు రట్టివారు లనేకపాతకజాలంబుల నైనను నిమిషమాత్రంబున విముక్తులగుదురు మతియును. 198

చ. కనుఁగొన నైంద్రజాలికజగం బపుడౌ నని చూచి విస్మితం
బనుపడె నిట్లు మాయయనుభంగిని నీసదసద్విలక్షణం
బున ఘన మాయచేతఁ బొలుపొందు జగంబును మిథ్య యంచు భా
వనను మదీయతత్త్వము ధ్రువంబుగ నిల్పఁ దగున్ సుపుణ్యుఁడై. 199

వ. ఇట్లు మద్భావనాభావితశుద్ధమానసుండై యానందమయుండును సుఖుండును నిరామయుండును నగుచు నుండవలయు 200

క. అగుణుండ ననుచు నైనను, సగుణుండ నటంచు నైన స్మృతిఁ దలఁపం
దగు నిటు దలఁచిన పుణ్యుఁడు, జగముఁ బవిత్రంబు సేయు జలజహితుక్రియన్.

వ. ఇవ్విధంబున 202

చ. గురుచరణారవిందములకుం బ్రణమిల్లి మనంబునందుఁ బె
ద్దతికము నాదు వాక్యములఁ దద్దయుఁ జేరిచి వేదపారవి
ద్వరుఁ డన నొప్పు నే నెఱుఁగఁ బల్కిన యీతగు వేదసారమున్
గురుతరమైన జ్ఞానమును గోరి భజించినవారు నా సముల్. 203

## ఋషిసమూహము లవణాసురువృత్తాంతము రామునికిఁ దెలుపుట.

వ. అని యివ్విధంబున సుమిత్రానందనున కుపదేశం బొసంగు నవసరంబున యమునాతీరవాసులగు పెక్కండ్రు ఋషులు చ్యవనభార్గవుల మున్నిడుకొని లవణాసురుని భయంబున బఱతెంచి రఘుపుంగవుం గాంచి యభయకాంక్షితులై నిలువ నారాజరత్నంబు వారల మన్నించి పూజనంబులం బ్రీతులం గావించి యిట్లనియె.

క. ననుఁ గనుఁగొనఁ జనుదెంచుట, ఘన మయ్యెను మీదుకోర్కి కడు దుష్కరమై
నను జేతు ననుజు లయినను, దునుముదు బ్రాహ్మణులు దేవతుల్యులు నాకున్. 205

వ. అనిన హర్షంబు నొంది యందుఁ జ్యవనుం డిట్లనియె. 206

సీ. విను రఘువల్లభ! మును కృతయుగమున ధర్మాత్ముఁడును సురధారుణీసు
రాభిపూజితుఁడు మధ్వాసురుం డలరు ఫాలాంబకుం డాతనియందు సుప్ర
సన్నుఁడై శూలం బొసంగి దీనను వైరు లెవఁడైన భస్మమౌ నిల నటంచుఁ
బలికె నాతనికి రావణు చెల్లె లగు కుంభినసికిని లవణుఁ డనంగ నొకఁడు

తే. పాపకర్ముండు జనియించె భవ్యచరిత!, వానిచేఁ బీడితుల మౌచు వచ్చినార
మఖిలలోకేశ్వరుఁడవు నారాయణుఁడవు, నీవు గల వని యొక దృఢనిశ్చయమున.

వ. అనిన వెఱవకుం డిది యెంత కార్యంబు లవణుఁ వధింపఁ జేసెద విగతజ్వరు లయి చనఁబోలు ననుచుఁ దమ్ములం గనుంగొని. 208

ఆ. ఎవరు లవణుఁ ద్రుంచి యియ్యవనీసుర, బృందములకు భీతి డిందుపఱతు

రనిన భరతుఁ డెంతో వినయంబుతోడుత, నిట్లు పలికె రఘుకులేశుతోడ. 209

వ. దేవా! యాజ్ఞ యొసంగెదరేనిఁ బరిమార్చెద ననిన శత్రుఘ్నుండు లేచి నమస్క రించి యి ట్లనియె. 210

చ సితసరసీరుహాక్ష!రఘుశేఖర! లక్ష్మణుచేతఁ జేయఁగా
జతపడె భూరికార్యములు సన్నతియా భరతుండు మిమ్ముఁ బా
సి తలఁపరానిదుఃఖములఁ జెందెను గావున నేను ధర్మదూ
షితుఁ డగునట్టి యాలవణుఁ జేరి వధించెద నాజ్ఞ యిచ్చినన్. 211

ఆ. అనిన సంతసించి యాసుమిత్రాపుత్త్రు, నంకమునను జేర్చి యయ్య! యిపుడె
యధిపుఁ జేతు మధుర కని లక్ష్మణునిచేతఁ, దగుపకరణచయము ముదముతోడ.212

వ. తెప్పించి తలంపకయున్నను నతిస్నేహంబున మధురానగరంబున కభిషిక్తుం జేసి యొక్కదివ్యసాయకం బొసంగి శత్రుసూదనా! యిబ్బాణంబున లోకకంటకుండగు లవణుం బరిమార్పుము వాఁడు సదాశివప్రసాదలబ్ధంబగు శూలంబుఁ బూజింపుచు గృహంబునం బెట్టి నిఖిలజంతుహననోద్యుక్తుండగు విలయకాలుపోలిక భక్షణార్థంబు ఘోరాటవుల సంచరించుం గావున వాఁడు మరలి రాకుండునంతఁ బురద్వారంబున ధృతకార్ముకుండ వై నిలువు మిట్లయిన వధియింపం బోలు నీకు సహాయం బుగఁ బదివేలు తురంగంబులును దశరథ సంజ్ఞికంబులగు శతాంగంబులును నాలు వేల గజంబులును లక్ష పదాతివర్గంబును జనుదెంచు వేగంబ చని వానిం జక్కాడి మధుసంజ్ఞికంబగు తద్వనంబు పట్టణం బొనర్చి యుచ్చాసనంబున రాజధానిగాఁ గైకొను మనుచు మూర్ధాఘ్రాణంబుచేసి వీడ్కొలిపిన శత్రుఘ్నుండు. 213

మ మునివర్య "విజయోస్తు తే" యనఁగ సమ్మోదంబుతో నేఁగి య
న్న నియోగించినభంగి నాలవణునిం జక్కాడి సర్వీతిమై
జను లెల్లన్ వసియించుపట్టణము లిచ్చన్ జేసి తద్రాజ్యపా
లన నై పుణ్యముతోడ నుండె నఁగౌ కల్యాణి! భవానీసతీ!. 214

వ. అనినఁ బార్వతి యిట్లనియె. 215

తే. దేవ! కైలాసవల్లభ! ధృతశశాంక!, లోకపావన! సీత వాల్మీకియాశ్ర
మంబునను నుండి యెటు లేఁగె మఱియుఁ బల్కు, విస్తరంబుగ నద్దివి వాస్తవముగ.

## వాల్మీకియాశ్రమంబునఁ గుశలవులు జనించుట.

వ. అనిన సుమారమణీమణిం గనుంగొని త్ర్యంబకదేవుం డిట్లనియె. 217

చ. విను హిమశైలజా! జనకవీరన్నృపాగ్రణిపుత్త్రి సీత సం
దనులను గాంచె నిద్దఱి నొనర్చెఁ గుశుండు లవుం డనంగ న

మ్మునివరుఁ డంత వారికి సముజ్జ్వలనామము లక్కుమారకు
ల్దనరిరి బాలసూర్యులవిధంబున మించుచు నంత కంతకున్. 218

వ. ఇట్లు వృద్ధిఁ బొందుచు 219

తే. లీల విద్యలు నేర్చి వాల్మీకి యుపన, యన మొనర్పంగ వేదాధ్యయన మొనర్చి
దర్పణప్రతిఫలితులౌ దాశరథులొ, యనఁగ గుణములఁ దనువుల నలరి రచట. 220

వ. అంత వాల్మీకిమునీంద్రుండు వారలకుఁ బూర్వంబునఁ ద్రిపురమర్దనుండు భవాని కెఱింగించిన నిఖిలవేదార్థకలితంబగు రామాయణంబు కావ్యరూపంబునఁ బఠనంబు గావించె నశ్వినులభంగి నతిసుందరులగు నక్కుమారులు స్వరసంపన్నంబుగఁ దంత్రీలయసమాయుక్తంబుగ గానంబు సేయుచు మునిబృందంబుల సంచరింప వారు విస్మయంబున 221

తే. కాల మధికంబు మనమైతె గడపినార, మిట్టి సుస్వరగీతంబు తెలమిఁ జదువ
వింటిమే తొల్లి గంధర్వవిబుధమనుజ, లోకములనైనఁ గర్ణామృతాకరములు. 222

వ. అని యిట్లు. 223

క. మును లనుతింపఁగ నిలిచిరి, ఘనుఁడగు వాల్మీకి మౌనికడ రాఘవుఁ డం
తను గనక జనకనందన, నొసరించి తురంగమేధ మొనరించుటకై. 224

వ. ఉపక్రమింపఁ దద్దర్శనాభిలాషు లయి బ్రహ్మక్షత్త్రియవైశ్యజనంబులును రాజర్షివర్యులును జనుదెంచుచుండ నమ్మునివరుండు. 225

మ. కర మింపొంద నిజోదితంబు నగు సత్కావ్యంబు గానంబు సే
యుచు రఘుశ్రేష్ఠుఁ గొంచు నొక్క ఋషి వాటోపాంతమున్ దేగ న
చ్చరమాద్రి న్మిహిరుండు గ్రుంకఁ నచటన్ సంధ్యావిధుల్ దీర్చి భా
స్వరయోగంబున నిల్చె నక్కుశుఁడు నవ్వాల్మీకి యిట్లుంచుటల్. 226

వ. కనుంగొని తత్సమాధివిరమంబుఁ గాచియుండి జ్ఞానశాస్త్రకథనాంతరంబున నిట్లనియె

క. మునివర వినవేఁడెద నె, ట్లనఘుము సంసారబంధ మగు దేహికి వీ
డును పరల నెట్లు శిష్యుఁడ, నని ననుఁ గరుణించి పలుకుఁ డన మునియపుడున్.

వ. సంతసించి సీతాకుమారా! వినుము బంధమోక్షస్వరూపంబును దత్సాధనంబులును ముక్తియు సంక్షేపంబున నెఱింగించెద నేను బల్కినభంగి నెఱింగి తత్ప్రకారంబున నాచరించితివేని జీవన్ముక్తుండ వగుదు వెట్లనిన విదేహుండగు చిదాత్మకు లింగదేహంబునఁ గల్పితం బయ్యె నాదేహంబు తచ్ఛాయాగ్రాహి యయ్యెఁ దచ్ఛాయయందు నను దనయందునను దదభిమానసారూప్యంబగు నహంకారంబు జనియించె నయ్యహంకారంబున బింబస్థానీయంబగు సాక్షి సోఁడు బరస్పరమిథ్యాతాదాత్మ్యంబువలన స్వచేష్టితంబులగు జడత్వకర్తృత్వాగు లన్నియుఁ దత్సాక్షియందు నారోపించి

తత్సాక్షిచేష్టితంబులను చేతనత్వ ప్రకాశత్వంబులను దనయందు నారోపించుకొని "జ్ఞాతా ద్రష్టా కర్తా" తి వ్యవహారపరిసర్తితుం డగునట్టి చిదాభాసవిశిష్టదేహోపాధి కుం డగుచు సంకల్పంబు లనుశృంఖలంబులచేత సాక్షి యావృతుం డగు నిట్లను చుఁ బుత్ర దారగృహాదుల యందు భోగాపేక్షుం డయి సంకల్పంబు లొనరించుచుఁ దల్లాభ్యాలభ్యంబుల యందు సుఖదుఃఖంబులఁ బొందుచుండు నట్టి సాక్షికి రజస్స త్త్వతమస్సంజ్ఞలయి యధమోత్తమమధ్యమంబులగు మూఁడు దేహంబులు జగత్ స్థితికారణంబు లయి చెలువొందు చుండు. 229

క. ఎనయ తమోదేహంబునఁ, దనుకక నిరతంబు నరుఁ డు తామసకృత్యం బొనరించుం దామసుఁడై, జనియించును గీటకాదిజన్మములఁ దుహిన్. 230

వ. మఱియును. 231

క. విను సాత్త్వికదేహంబున, జననాయక! నరుఁడు సత్త్వసంకల్పుండై తనయను దేహాద్యాకృతు, లను భాస్వదదూరమోక్షలక్ష్మీయుతుండై. 232

వ. మఱియు ధర్మజ్ఞానపరాయణుండును సుఖుండును నగుచు నుండుఁ గడమగజోదే హంబున రజస్సంకల్పుండును బుత్ర దారానురంజనుండును లోభసంభరితుండును నగుచు మనుష్యాదిభావంబుల నొందుచు నుండుఁ గావున నమ్మూఁడు రూపంబులను బరిత్యజించి యాత్మసురితుయం బగుచుండ నఖిలదృష్టాంతగ్ నుంలించు మనంబుచేత మనంబును నియమించి బాహ్యాభ్యంతరంబులు సంకల్పసంక్షయం బొనరించి తత్ప రంబగు పదంబు నొందు మిట్లు గాదేని. 233

క. శతసాహస్రాబ్దంబుల, నతిఘోరతపం బొనర్తు వైనను నీ వీ కృతసంకల్పక్షయ మైనను, జతపడ నేరవు విమోక్షసామ్రాజ్యంబుల్. 234

వ. ఇదియ కాదు పాతాళభూస్వర్గంబుల నుండినను సంకల్పోపశమంబునం గానియొం డుసాధనంబున విముక్తుండ వగుట దుర్లభంబు గావునఁ జేత నయిననంతకాల్తుఁ బురుష ప్రయత్నంబున నవికారంబును బరమపావనంబునగు స్వసుఖంబున సంక ల్పోపశమనయత్నంబు సేయుము మఱియును. 235

తే. కలుగుభావము లెల్ల సంకల్ప మనెడు, తంతువునఁ గాన సంకల్పతతి నడంచి తేని బూసలు త్రాడు రెండైన నీకి, చనెడుపోలిక భావముల్ చనును వదలి. 236

వ. ఇట్లుంగి. 237

తే. క్షీణసంకల్పజాలుఁడౌ జీవుఁ డొందు, నిజము బ్రహ్మత్వమును గాన నీవు దెలిసి చనును యొకాలమున కెద్ది సంభవించు, నట్టి వ్యవహారమున భూమనాగ్రతనయ.

చ. విను మినవంశభూషణ! ప్రవీణుఁడ వై మువికల్పజాల మె ల్లను విడనాడి యాత్మసుఖలభ్యముకై పనవి క్షిప్త మైనే

ఘనపరమార్థ సద్వ్యయ మఖండమగు నై తగు తత్త్వసంబు చూ
య్యనఁ గను చిన్మయం బోలె నా క్షతార్థులు గల్గిన భూమిపాలంబునన్. 239

ఆ. నాకజుండు రామనందనుల దత్త్వ, మిట్లు పల్క నపుడు నిందుమౌళి
శైలతనయతోడఁ జాల బ్రసంగించి, యింపు మీఱ మఱియు నిట్టు లనియె 240

చ. అని యిటు మాటిపల్కి నవ్వ్యాదంతరవిభ్రమ వీడి యుక్కుచుం
డనుపమమూర్తులై బయల నందటి పోలికతోడ మారుతూర్
జని కనకేంద్రనీలమణిసంయుతసౌధ సమీపాగ్రముఁ గాంచి తో
డను జనుదెంచు రాఘవుల దగ్గఱి యిట్లనియెన్ ముదంబునన్. 241

ఆ. తనయులార! మీరు దశరథాత్మజసభా, భవనమునను నిల్చి పాడుఁ డంత
యనువు మీకు నీయవచ్చినఁ గొనవల, దనినఁ గుశలవులును విని ముదమున. 242

సీ. వని తత్స్వరద్వ్యాత్మమున రామచంద్రుండు వినునట్లు సంగీతవిధము మెఱసి
సుస్వరంబుగఁ బాడఁ జొచ్చినఁ దనపూర్వచర్య లెల్లను విని సంతసమున
సభ కేఁగుదెంచి దర్శనకాంక్షులకు సుప్రసన్నతి గనుపింప శబ్దవిదులు
వసుధేశులును జటావల్లభుల్ పౌరాణికులును బండితులును గూడిరాఁగ

తే. నంగుఁ గుశలవులును సభ కరుగుదేర, జనులు గనుఁగొని విస్మయసహితు లగుచు
నహహ! వీరలు రాముని యట్ల యున్న, వారు సౌందర్యమునఁ గాంతి వైభవమున.

క. ఈకరణి జడలు వాగలు, లేమన్న విశేషముగ వెలిఁగెడ రనుచున్
లోకులు పలుకఁగ వల్లకి, నాకోమరులు మీటుచుం బ్రియస్వరములుగన్. 244

వ. షడ్జమధ్యమాదిభేదంబుల సమానుషంబును మధురంబును నగు గాంధర్వంబు ప్రవృ
త్తిం బొనరింప రామచంద్రుండు విస్మయంబు నొంది యుపలాళ్యంబైనఁ
గొలువు వీడి చనుభరతుం గనుంగొని వీరల కయుతధనం బిప్పింపు మనిన నట్లొన
రించినఁ బరిగ్రహింపక కుశలవు లిట్లనిరి. 245

చ. వనమున సంచరించుచును వన్యఫలంబులఁ గ్రోలు మాకుఁ గాం
చనము దలంప నేల యని సయ్యన నేఁగిన రాముఁ డంతయున్
విని జనకాత్మజాత్మజులు వీ రని విస్మయ మంది లక్ష్మణుం
గనుఁగొని వారిఁ గన్గొనెడు కౌతుక మొప్పఁగఁ బల్కె నిట్లుగన్. 246

క. వినుము విభీషణమారుత, తనయసుషేణాంగదులును ధరణీజను దో
డ్కొని వాల్మీకియు నిచటికిఁ, జనుదేరఁగఁ జేయు మంత జనకజయుఁ సభన్ 247

క. జను లెల్లను నిష్కల్మష, యని నమ్మఁ బ్రతిజ్ఞ సేయు నగు నన రఘుప
ర్యుచి వాక్యములకు విస్మయ, మును భయమును బొంది రచటి మునులును జనులున్.

వ. అంత రఘువల్లభుహృద్గతంబెఱింగి వాల్మీకిమునీంద్రుండిట్లనియె. 249

తే. పతియె దైవంబు గురువును భామినులకు, గాన రఘునాథ! మీమదిఁ గల తెఱంగు
నెల్లఁ జేయును జనకజ యిదియు సంశ, యంబు వలదని పల్కి యందఱు నట్లనుచు.

వ. సీత యొనరించు శపథంబు చూచుకొనవలయు నెల్లవారు నెఱుంగవలయు నని యాజ్ఞ యొసంగి రాఘవుం డంతఃపురంబునకుం జనియె నంత మఱునాఁడు కొలువు దీర్చియున్న యవసరంబున బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులును మహర్షులును వానరపుంగవులును గౌతుకంబునం జనుదెంచిరి. వాల్మీకిమునీంద్రుండు జనకపుత్త్రిం దోడ్కొని సభామధ్యంబునకుం జనుదెంచి రామచంద్రునకిట్లనియె 251

## సీతాదేవి భూవివరంబునం ద్రుంగుట

సీ. ఇదియె భూసుత రాఘవేశ్వర! కనుఁగొను ధర్మచారిణి సువ్రత సుచరిత్ర
విడిపించితివి ఘోరవిపినమధ్యమున లోకాపవాదకు నోడి యైన నేమి
యాజ్ఞయిమ్ము ప్రతిజ్ఞ యాచరించెదు వీర సీతాకుమారులు చిన్నికవలు
యేను జేయఁగఁ బంప నీసుకుమారులు నను గూడి తపము లొనర్చినారు

తే. దశరథాధిపపుత్త్ర! సీతాకళత్ర!, నీ వెఱుంగవె దేవి యీనిఖిలమునను
గాన సుచరిత్ర యని బుద్ధి నూనెదేని, గొనుము యిప్పాణ్య నిబ్బంగిఁ గుందనీక.

వ. అనిన రఘువల్లభుం డిట్లనియె. 253

క. మునివర! మీవచనములనె, జనియించె నిజంబు యున్న జనకజయును జే
సెను శపథ మఖిలజనములు, గనుఁగొన ననలంబు సాక్షి గాఁగను లంకన్. 254

వ. అయినను లోకాపవాదకు నోడి నిర్దయుండనై విపినంబున విడిచితి నది క్షమియింపవలయు నిక్కవలవారలు నావలనే జనియించిరి యెఱుంగుదు జనకనందన పరిశుద్ధ గావున నాకుఁ బ్రీతి యయ్యెడు నని దాశరథిభావంబు గ్రహించి కనులగర్భ మున్నిడుకొని పురందరాదిబృందారకులు చనుదెంచిరి భూపుత్త్రియు సంతసించి తజ్జనౌఘమధ్యంబునఁ గట్టినకాశేయంబు శిరంబున ముసుంగిడి క్రిందు చూచుచు కరంబులు మొగిడ్చి యిట్లనియె 255

క. శ్రీరఘువర్యునికన్నను, వేఱొకరిఁ దలంపనేని వివర మొసఁగు మో
ధారుణి! యనఁ దోడుతనె మ, హారవము దలిర్ప వివర మయ్యె ధరణియుఁ దాన్. 256

వ. నాగకన్యలు వింజామరమ్ములు వీవ సింహాసనంబు గైకొని భూదేవియుం జనుదెంచి. 257

చ. కరములు సాఁచి జానకిని గౌఁగిటఁ జేర్చి ముదంబు పల్కి తా
నరిగె రసాతలంబునకు నాగతి సేఁగ సుర ల్విరు ల్వడిన్

గురిసిరి దుందుభు ల్మ్రోసెఁ గొందఱు విస్మయ మంది చూచుచుం
డిరి మదిఁ దోఁచినట్టులు వడి న్నుతి గొందఱు పల్కి రయ్యెడన్. 258

క. కొందఱు గంతిల్లిరి మఱి, కొందఱు భూతలమునందుఁ గ్రుంకెడు ధరణీ
నందనను బొగడుచుండిరి, కొందఱచేతనులభంగిఁ గూలిరి ధాత్రిన్. 259

వ. కొందఱు మహాకాయులగు వానరులు సీతాశపథకారణంబున రఘువల్లభు నీక్షించుచుండిరి ట్లొక్క మహాస్త్రంబు జగం బంతయు సమ్మోహితం బయ్యె రామచంద్రుండు సకలంబు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె భవిష్యత్కార్యగౌరవంబున దుఃఖించి బ్రహ్మచేత బోధితుండై సీతాస్నేహాసుఖంబు లన్నియు స్వప్నంబు భంగిఁ దలంచుచు ననంతరక్రియ లాచరించి ఘనరత్నాదుల ఋత్విక్కులను దక్కినవారలను సంతుష్టులం జేసి వీడ్కొలిపి పౌరులం దోడుకొనుచు సాకేతపురంబు ప్రవేశించె నంత. 260

సీ. అదిమొద ల్మిహిరకులాధీశ్వరుఁడు రాముఁ డిహభోగములను నిస్పృహ వహించి
యాత్మచింతాపరుం డగుచు నొంటిగ నుండ నిటు లుండఁ గౌసల్య హృదయమందు
నితఁడు నారాయణుం డిందిరావల్లభుం డని యెఱింగి ప్రియోక్తు లాడుకొనుచు
నతిభక్తితోడ ధ్యానాలయమునకును జనుదెంచి తనహస్తవనరుహములు
తే. మోడ్చి రఘునాథ! జగము మోహపఱచు, నీదు మాయావృతాత్మనై నీవు నుతుఁడ
వనుచు ననుఁబోంటి సనకాదిమునులకైన, నెఱుఁగఁజాలని పదవి నే నెఱుఁగనైతి.

వ. దేవా! దుగ్ధపారావారోత్తుంగతరంగమధ్యవిలసితభుజంగరాజతల్పంబున యోగనిద్రాయతుండవై పవ్వళించు పురాణపురుషుండవు సచ్చిదానందవిగ్రహుండవు జగంబులకు మొదటివాఁడవు ఆదిమధ్యాంతవర్జితుండవు పరమాత్మవు పరమానందమయుండవు పూర్ణపురుషుండవు ఈశ్వరుండవు నగు పుండరీకాక్షుండ విట్టి నీవు నాయందుం గరుణించి మత్పుణ్యాతిరేకంబున నందనుండవై యుదయించితి విప్పుడు నా కవసానకాలంబు సమీపించెఁ గావున దయాళుండవై మాయాజ్ఞాననివర్తకంబగు జ్ఞానంబు పల్కవే యనిన సంతసిల్లి మంగళవతియు జర్జరితాంగియు నగు కౌసల్యం గనుంగొని ధర్మాత్ముండును మాతృవత్సలుండును బరమదయాసముద్రుండును నగు రామచంద్రుం డిట్లనియె. 262

## శ్రీరాముఁడు కౌసల్యకు మోక్షమార్గ ముపదేశించుట.

ఆ. జననీ! వినుము మోక్షసౌధాగ్రమునఁ జేరఁ, బరఁగు జ్ఞానకర్మభక్తియోగ
ములను మూఁడు మార్గములు మున్నె నే బల్కి, తందు సులభమార్గ మరయ వినుము.

సీ. సకలభూతముల హృత్సరసీరుహములందు వెలుఁగొందు నను జనుల్ వెల్తులగుచు
బయలు నొనర్తురు భక్తిఁ బూజింపుదు రది నాకు సవిసతం బనఁగరాదు
తృప్తి యనఁగరాదు తెలియరు నందఱికిని సతమాస మొనరించి యాత్మ గుండఁ
జేసి చేసిన క్రియల్ సేయరు నన్ను న తృప్తుఁ గావున జనుఁడు నిక్కంబు గాఁగ
తే. నఖిలభూతాంతరస్థుండ ననుచు నెంత, తడవు దెలియఁడో తానంతతడవు ప్రతిమ
లందు స్వకులోచితాచార మనుసరించి, పూజ యొనరింపఁ దగు జగత్పూజ్యు నన్ను
వ. భూతావమానంబు సేయువానిచేత నర్చితుండఁ గాను వినుము. 274

క. ఎవఁడు పరాత్మన్యాత్మల, కనిని భేద మొనఁ గాంచు నాతఁడు భయము
త్ప్యవులను లోఁబడుఁ గావునఁ, గని తలఁపఁగఁ బోల దిటులు కిలలో నైనన్.

వ. మఱియు నిఖిలభూతంబుల నపరిచ్ఛిన్నుండ నై యుండు నన్నెఱింగి జ్ఞానమానంబులను
మైత్రిని నభిన్నబుద్ధియై యర్చింపుచు దినంబును మనంబునఁ గరంబులు మొగిడ్చి
సకలభూతంబులకు నమస్కరింపుచుఁ జేతనుండును శుద్ధుండను నగు నేను జీవరూ
పంబున నున్నవాఁడ నని యెఱుంగుచు శోకానోకసమూహంబున నైనను జీవేశ్వరు
లకు భేదంబొనర్పక విద్వాంసుం డగువాఁడు నిలిచె నేని కృతార్థుం డగు నేనెఱిం
గించిన జ్ఞానకర్మభక్తియోగంబుల నరుంపు శాంతి వహింపు నొక్కటియు చాలు
నది గావునఁ దల్లీ! సర్వవ్యాప్తిస్థితుండ నగు నన్ను భక్తియోగంబున నిశ్చయంబుగ
ధ్యానింపుచు శాంతి నొందు మనినఁ గౌసల్యయు. 276

క. రాముని వచనములకు మదిఁ, బ్రేమ న్నిజహృదయమున వరించి నుతగుణ
స్తోమున్ బ్రాప్తక్షేమున్, శ్యామున్ లోకాభిరాము నభినుతిఁ జేసెన్. 278

తే. హేమవర్ణాంబరావృతు సోమనూర్తి, నతను సంప్రాప్తకాము సనాతనుఁ బర
భావన యొనర్చి సంతోషభరిత యగుచుఁ, బరమగతి నొందె దశరథభార్య గిరిజ!.

వ. ఇవ్విధంబున నెల్లెడల నిజభావన యొనరింపుచు సంసారబంధంబు భేదించి పరమగతి
నొందెఁ బూర్వంబ రఘుపుంగవుచేత భక్తియోగం బెఱింగినయది గావునఁ బరమ
శాంతియు శ్రద్ధాభక్తిసమన్వితయు నై కేకయరాజనందనయును. 279

మ. సజలాంభోధరదేహుఁ బద్మహితవంశశ్రేష్ఠు సీతాప్రియుం
ద్రిజగద్వంద్యుఁ దలంచి మైవిడిచి పంక్తిస్యందనుం గాంచె న
ట్లజగన్మాన్య సుమిత్రయుం దనువు నిర్లిప్త్యంబునం జూచి జే
రఁ జనెన్ స్వప్రియు నింతవింత గలదే ప్రాలేయశైలాత్మజా!. 280

క. అని దశరథభూవిభునకుఁ, దనయుండగు రాము కథలు తాఁ బలికి యుమా
వనితకు నిటలాంబకుఁ డి, ట్లనియెం దదనంతరమున నగుతెఱఁ గెల్లన్. 281

సీ. అతఁడు యుధాజిత్తుఁ డను మాతులునితోడ భరతుండు రఘువర్యుపంపు వడసి
సైన్యసమేతుఁడై చని మూఁడుకోటుల గంధర్వులను ద్రుంచి ఘనుల సుతులఁ
బుష్కలావతి యందుఁ బుష్కలుఁ దక్షశిలాహ్వయంబునఁ దక్షు నధిపుఁ జేసి
మరలి రాఘవుఁ గొల్వ నరుదెంచె రాఘవుఁ డంతట లక్ష్మణు నతిముదమునఁ
తే. జీరి సౌమిత్రి! నీకుమారవరులఁ గొనుచుఁ బశ్చిమదిగ్భాగమునకు నేఁగి
జనవిరోధుల మల్లులఁ జంపి నీవి పౌరులఁ గావించి ననుఁ గొల్వ మరలి రమ్ము
చ. అని తనయన్న పల్కిన రయంబున నచ్చటి కేఁగి మల్లులం
గనిమి ధనాఢ్యులైనట్టి తనూజుల నంగదచిత్రకేతులన్
బనిచి తురంగరత్నబలభర్మచయంబు వారి కిచ్చి చ
య్యనఁ జనుదెంచె రాఘవపదాంబుజసేవ యొనర్ప శైలజా!. 283

## శ్రీరామునికడకు యముఁడు మునివేషధారియై వచ్చుట

వ. అంత సుపుణ్యంబగు తత్కాలంబున నెల్లయెడల ధర్మప్రవర్తిరై చెలువొందు రాఘవేంద్రుం గనుంగొను కౌతుకంబునఁ గాలుండు ఋషివేషధరుండై చనుదెంచి రాజద్వారంబున నిల్చి సుమిత్రానందనుం గనుంగొని 284
క. వినుము లక్ష్మణ! మీయన్నన్, గనుఁగొని యొకపని సేయఁ గాంక్ష గలదు గా
వున నెఱుక సేయుము వేగమె, జనకసుతావల్లభునకుఁ జను మిపు డనినన్. 285
వ. లక్ష్మణుండు రఘుపుంగవు సమీపంబున కేఁగి కరయుగంబులు మొగిడ్చి. 286
క. సుందరగాత్ర! సుందరశర, దిందుయశస్ఫార! వనరుహేక్షణ! దశకం
ఠేంధనదావానల! సుర, వందిత! గుణధామ! రామ! వైరివిరామా!. 287
వ. దేవా! భవద్దర్శనాకాంక్షియై యొక్కమునిముఖ్యుండు ద్వారంబున వచ్చియున్నవాఁ డతనిఁ దోడితెం డనియె నంత నప్రతిహతశక్తుం డగు హుతాశనుభంగి వెలుంగు న మ్మునివరుఁ దోడితెచ్చిన నతండు జయజయశబ్దంబులు పలుకుచుఁ జనుదెంచిన రామచంద్రుండు సుఖాసనం బొసంగి పూజించి భవదాగమనకారణం బెఱింగింపుం డనిన నిట్లనియె. 288
చ. విను రఘునాథ! యిత్తెఱఁగు వేఱొక రెవ్వ రెఱుంగరాదు గా
వున బలవంతు నిప్పుడు నుపుం డిటవాకిట నున్న నప్డు తా
ననుజుని గాంచి లక్ష్మణ! మదాజ్ఞ వహింపుము ద్వారమందు రాఁ
జన దను మెవ్వరిన్ నిజము చచ్చెద వంచనె వచ్చిరేనియున్. 289
వ. అని సౌమిత్రిని వీడుకొలిపి రాఘవుండు. 290
ఆ. మునివరేణ్య! లక్ష్మణుని ద్వారమున నిల్పి, నునుట లెందు కభిమతార్థ మెద్ది

తే. విడిచి జగముల నీకీర్తి విస్తరింపు, మనిన లక్ష్మణుమాటల కవ్విభుండు
చలితమానసుఁ డగుచు మంత్రులవసిష్ఠుఁ, బిలువఁబనిచి సమస్తంబుఁ దెలియనట్లు.

క. తనను ప్రతిజ్ఞయుఁ గాలుం, డనిన తెఱం గత్రిసుతుని యాగమనముఁ బ
ల్కిన వారందఱు నిట్లని, యనిరి రఘూద్వహునితోడఁ బ్రాంజలు లగుచున్. 308

సీ. రఘునాథ! మీచేతఁ బ్రథమంబ భూభారహరణంబు వర్ధిష్ణు మయ్యెఁ గాన
జ్ఞానదృష్టి నెఱుంగఁ జను లక్ష్మణవియోగ మబ్బెంగి లక్ష్మణునందుఁ బ్రేమ
విడువు మింకఁ బ్రతిజ్ఞ విడువకు విడిచిన నగు ధర్మమెల్లను వ్యర్థముగను
ధర్మంబు నశియింపఁ ద్రైలోక్యము నశించు ధరణిఁ బ్రోచెడు ధర్మపరులు మీరు
తే. గాన వేఱొక్కగతి బుద్ధి నూనకిప్డు, డొక్క లక్ష్మణు విడనాడి యుభయలోక
జనులపాలన మొనరింపఁ జను జగంబు, వినుతి యొనరించు నీకీర్తి విస్తరించు 309

వ. అనుచు ధర్మార్థసత్యసమన్వితంబులుగఁ బలుకు వారల వచనంబు లాకర్ణించి సభా
మధ్యంబున సుమిత్రానందనుం జీరి యిట్లనియె. 310

ఆ. మనసు వచ్చినట్లు చనుము లక్ష్మణ! ధర్మసంక్షయంబు గాఁగఁ జనదు వెడల
ద్రొబ్బుటయును శిరము దునుముట రెండును, సమము నాత్మఁ దలఁప సజ్జనులకు 311

లక్ష్మణుఁడు సరయూనదియందుఁ జేరుట.

క. అన దుఃఖాక్రాంతుం డై, తనయన్నకు మ్రొక్కి యంతఁ దడయక సదనం
బును వెడలి సరయువునకుం, జనియెఁ గరంబులు మొగడ్చి శైలతనూజా!. 312

వ. ఇట్లు పరమధార్మికుండగు సుమిత్రానందనుండు కృతాంజలి యై సరయూతటంబు
నకుం జని సకలప్రాణంబులును నియమించి మూర్ధతలంబునం జేర్చి షడాధార
స్వరూపజ్ఞుండును యోగయోగాంగవిదుండును గావున రాజయోగప్రకారంబున
దృష్టిపూర్వకంబున భ్రూమధ్యంబునం జూచుచుఁ గృకాకృకానుసంధానంబులు
మాని సర్వసంకల్పవర్జితుం డై యుద్ది యక్షరంబును బరబ్రహ్మంబును వాసుదేవా
ఖ్యంబును నగు నట్టి పరమస్థానంబు మనంబునం జింతింపుచు మారుతంబుల నిరో
ధించె నాసమయంబున. 313

ఆ. సకలదేవతలును సర్వర్షులును సంత, సమునఁ బొగడి మించు జల్లు గాఁగఁ
గ్రిందుకొలిపి రమలమందారకుసుమముల్ మేఘనాదువైరిమీఁద నపుడు. 314

వ. సుపావనంబగు నమ్మహామహుని శరీరంబును బ్రాకృతజనుల కదృశ్యం బయ్యె
నంత. 315

క. ధీరు సుమిత్రానందను, నైరావణముపయిఁ జేర్చి యాత్మపురికి జం
భారాతి దోడుకొని చని, గారవ మొదవంగఁ బూజఁ గావించె సఖీ!. 316

వ. నారాయణచతుర్థాంశుండగు రామానుజు నచ్చటిదేవత లెల్లను బూజించి రప్పురుష
వర్యుండును స్వీయంబగు భుజంగదేహంబు ధరియించి సత్యంబున కనుగమించె
నప్పుడు. 317

చ. ఘనముగ సత్యలోకమునఁ గల్గు ఋషుల్గములై సురాళి వా
హనయుతులై దివంబున మహాహిశరీరసమేతుఁ డాజనా
ర్దనచతురాంశ లక్ష్మణుని దక్షిణ మింపుగఁ జేసి రేమి చె
ప్పను గిరికన్య! కన్నులకుఁ బండువ య్యె తగ నట్టివేళయున్. 318

ఆ. అనుచుఁ బర్వతునకు నల్లుఁడౌ కైలాస, మందిరుండు ప్రమథబృంద వేష్టి
తైన శైలకన్య కక్కఁకులీనుని, కథలు పలికి పలుకఁ గడఁగె మరల. 319

వ. అంత నచ్చట రఘువల్లభుండు సుమిత్రానందను వీడి నిలువఁదగని దుఃఖంబున
మంత్రులను బంధుజనులను రావించి యందు వసిష్ఠున కిట్లనియె. 320

ఆ. భరతు బుద్ధిమంతుఁ బట్టాభిషిక్తుని, జేతు లక్ష్మణుండు చేరినట్టి
మార్గ మేను గాంతు మఱి యొచ్చరిఁక నాకుఁ, దలఁచి చూడ భ్రాతృధర్మమునను.

ఆ. అనినఁ బౌరజనము లందఱు దుఃఖార్తు, లగుచు మొదలు తెగిన నవని వ్రాలు
నిడుపు మ్రానుకరణిఁ బడిరి కర్ణములను, బడిన మూర్ఛ నొందె భరతుఁ డపుడు 322

వ. ఇట్లు భరతుండు చెప్పిటి తనను దాన నిందించుకొనుచు రామచంద్రునితో నిట్లనియె.

మ. భవదీయాంఘ్రియుగంబు లాన రఘుభూప! శ్రేష్ఠ నిన్వీడి యి
భ్భువి యైనం దివి యైన నొల్ల నిదె నీపుత్త్రుల్ ధరాపాలన
ప్రవిశత్వం బొనరింపు తమ్ముఁడును సద్భక్తుండు శత్రుఘ్నుఁ డం
త వినం జేయును చాటఁ బంపు జగముల్ తత్త్వజ్ఞులౌనట్లుగన్. 324

చ. అని భరతుండు పల్కె జను లందఱు రాముని వీడఁ గల్గునో
యని భయ మంది రంత మహిజాధిపుతోడ వసిష్ఠుఁ డిట్లనున్
జనవర! నిన్నుఁ బాయఁగను జాలక పౌరక్షద రింద ఱిట్లు గా
వునఁ గరుణింపు కూడి చన నుండుసె ని న్విడి యొక్క నిచ్చటన్. 325

తే. అనిన సీతావిభుండు ప్రియంబు నొంది, వారి నందఱఁ బూజించి యడుగవలువ
దేమి కోరిక పల్కుఁడే నిశ్చయము చేతు, ననిన నిట్లని పల్కిరి యంద ఱపుడు 326

ఉ. మిమ్ములఁ గూడి వచ్చుటలు మే లగు మాకు ధరిత్రి కైన స్వ
ర్గమున కైనఁ బ్రీతి యిది కాంతలతోడను బుత్త్రమిత్త్రవ
ర్గములతోడఁ గూడ నన గట్టిగ వీరి మనంబు గల్గినం
చమ్మెయి రండు వల్లె యనె నారఘుపుంగవుఁ డద్రినందనా!. 327

వ. ఇట్లు రమావల్లభుండగు రాఘవేశ్వరుండు మహాప్రస్థానంబునఁ గృతనిశ్చయుం డై
యాదినంబున నిజనందనులగు కుశలవుల రావించి యొనిమిదివేల రథంబులును బది
నూఱులు గజంబులును నాఱువేల తురంగంబులును ననేకులగు పదాతివర్గంబులును
బహుఘనరత్నాదులును వేఱువేఱ నొసంగి వీడ్కొలిపిన నాసీతేయులు జగజ్జనకుం
డగు నిజజనకునకు నమస్కరించి వీడఁజాలక యతిదుఃఖంబునం జని రంత రాఘ
వుండు శత్రుఘ్నుసమీపంబునకు దూతం బనిచిన వాఁడును. 328

పలుకుఁ డెంత మాత్ర పలికె నట్టిని గాను, చంద్రుతోడఁ దుహినశైలతనయ! 291

సీ. కమలాసనునిచేతఁ గార్యార్థినై పంపఁబడి వచ్చితిని రామభద్ర! యేను
సీతనూజాత మాయ నీవు పొందుటచేత జనియించితిని సర్వసంహారుఁడను
గాలుండ దేవర్షిగణపూజితుండను బ్రహ్మ మాతోడను బల్క మునిరొ
స్వర్గంబు రక్షింప సమయ మిప్పుడు చేరె నీ వొక్కరుండవే వీక్షింప జగము

తే. నహుంచి మాయామయుండవై యాత్మజానిఁగ, నన్నుఁ గంటివి యట్టి నాగవిభుని
విచిత్రకలిలాశయుని నొంచిచ్చితివి భాను, వంశభూషణ! సర్వలోకైకకలిత! 292

ఆ. అంత బలపరాక్రమాఢ్యులౌ మధుకైటభులను నిహంచి కీర్తి వెలయు దారి
కల్యములను మొదట శైలసంబాధమౌ, ధరను జేసితివి ప్రధానపురుష. 293

వ. వెండియు దివ్యార్కసంకాశంబగు నాభిపద్మంబునందు నన్నుం బుట్టించి ప్రజాసృష్టిత నొసంగిన నేనును భవదీయశాసనంబు దలఁ దాల్చి సేయుచు మద్వీర్యాపహారులగు రక్కసుల నుక్కడంపుం డని విన్నవించినఁ గశ్యపపుత్రుండవై వామనరూపధరుండ వైతి విప్పుడు. 294

ఆ. పఙ్క్తికంఠుఁ డనఁగఁ బ్రబలాత్ముఁ డొకఁడు, దనుజుఁ బుట్టి సజ్జనాళి కెల్ల
హింస సేయ సురల మెల్ల మిమ్ము భజింపఁ, గరుణతోడ మమ్ము గాపాడించి. 295

వ. దశకంఠహరణార్థినై పదునొకొండువేల వత్సరంబులు మర్త్యలోకంబున నిలువ సమయంబొనర్చితివి జనులెల్లఁ బూర్ణాయువులై యొల్లసిల్లెదరు తొలఁగిన మనోరథంబు సఫలంబయ్యె నవతరించిన కార్యంబు తీరెఁ దిరస్కృత కాలుండవై సుఖరూపంబునఁ జనియించుచున్నాఁడవు రాజ్యంబు ఇపుడిది చాలు నిదరేని శుభంబు నీకును గల్యాణం బగు ననుచు నిర్విఘ్నంబునఁ బితామహుం డానతిచ్చె రఘువల్లభా! జితేంద్రియా! దేవలోకప్రయాణంబునందుఁ జిత్తంబు గల్గెనేని యిసదభ్యస్తులగు బృందారకులెల్లను సనాథులును విగతజ్వరులు నయ్యెద రనుచుఁ జతుర్ముఖోదితంబులుగాఁ గాలుండు పల్కిన నవ్వాక్యంబులు విని చిఱునగవు దళుకొత్త జానకీవల్లభుం డిట్లనియె. 296

చ. సరసిజగర్భవాక్యములు సమ్మతము ల్మది నెంచి నీవు స
త్వరమున వచ్చుటన్ శుభము వాసవముఖ్యులు నాగుభక్తుల
ప్పరముల నెల్లకాలము కృపామతిఁ బ్రోచెదఁ గాన వ్యాఘ్రతం
బరయఁగ సంభవించె నిక సత్యవిచారము లేదు సిద్ధమయ్యెడన్. 297

## శ్రీరామునియొద్దకు దుర్వాసమహర్షి వచ్చుట.

క. అని జానకీవిభుం డిటు, లను వేళ మహోగ్రమూర్తి యత్రేయుండు న

చ్చెను దుర్వాసుఁడు పూజిత, ఘనశైలశరాసుఁ డుగ్రకరభాసుఁడొగిన్. 298

క. చనుదెంచి లక్ష్మణునిఁ గనుఁ, గొని సౌమిత్రీ! మనమునను గొంకకు మీయ
న్నను జూపు మాత్రక్షణంబునఁ, బని గల దనినను సుమిత్రపట్టియుఁ బ్రీతిన్. 299

వ. జ్వలనతేజుండగు నమ్మునిపుంగవుం గనుంగొని మహాత్మా! రామచంద్రుచేత నగు కార్యం బెఱిఁగింపుఁ డేని యొనరించెదఁ గాదేని నిముసంబుఁ సైఁచుఁ డొక్కింత రాజకార్యాంతరంబున సక్తుండయి యున్నవాఁ డనినఁ గ్రోధసంవ్యాప్తుండై యా యాత్రేయుం డిట్లనియె. 3 0

క. ఈతత్క్షణమున లక్ష్మణ!, సీతావిభుఁ జూపకున్న సిద్ధము భస్మీ
భూతులఁ జేసెద నిన్నును, నాతని రఘువంశజుల మదాగ్రహదృష్టిన్. 301

చ. అని పలుకంగ లక్ష్మణుఁడు నమ్మునిరూపము చూచి యింత సే
యును నిజ మింతకంటె నిపు డొక్కనిచావు శుభంబు గాన రా
ముని కెఱిఁగింతు నెట్లయిన ముఖ్య మటంచును నేఁగి కౌసలే
యుని కెఱుఁగంగఁ బల్కె నపరోగ్రుఁగ నత్రిసుతుండు వచ్చుటల్. 302

వ. రామచంద్రుఁ డవ్వాక్యంబులు విని కాలుని వీడుకొలిపి దుర్వాసుని సమీపంబునకుం జనుదెంచి నమస్కరించి మీరు విచ్చేసిన కార్యంబు పల్కుఁ డనిన నమ్మునీంద్రుం డిట్లనియె. 303

తే. ఒనర సాహస్రవర్షంబు లుగ్రతపము, నిరశనవ్రతయుతుఁడనై జరిపి తిపుడు
వాంఛ గలదు భుజింప భూవర! సుపక్వ, మైన యన్నంబుఁ బెట్టింపు మరసి వేగ.

మ. అనినన్ సంతస మంది వేగమె సుపక్వాన్నంబుఁ బెట్టింప న
మ్మునియుం దృప్తి వహించి యేఁగె రఘురాముం డంత సర్వజ్ఞుఁ డ
య్యును మాయాశ్రయుఁ డౌచు నెమ్మనమునం దూహించె సౌమిత్రికై
తను మున్ పల్కిన పల్కు సత్యపథభీతస్వాంతతం బార్వతీ!. 305

వ. ఇట్లు పరమాత్ముండు నిత్యానందుండును జితంతనుండును నయ్యు వికలాంగుండును దీనవదనుండును సత్యవాక్యపీడితుండును నగుచు మొగంబు వంచి మనంబున హితప్రాయునిఁగ లక్ష్మణునిం దలంచెఁ దత్కాలంబున శుభలక్షణాన్వితుండగు లక్ష్మణుండు పూర్వంబ రఘువల్లభుచేత నజ్ఞాననాశనం బగు విజ్ఞానం బుపదేశింపం బడెఁ గావున ధీరుండును వివేకియు గుణవంతుండును భక్తిమంతుండును నింగితార్థవేదియు నగుచు రాఘవేశ్వరు సమీపంబునకుం జనుదెంచి కరయుగంబులు మొగిడ్చి యిట్లనియె. 306

సీ. భవభయదూర! రాఘవ! మీర లిబ్భంగి నెఱుఁగనట్టుల యుండు టేమి యిపుడు
మత్కృతంబగు స్నేహబంధనం బెల్లను విడనాడి నను ద్రుంచివేయవలయు
నిది కాలగతి మున్నె యెఱుఁగుదు మీరు హీనప్రతిజ్ఞుల రైన నరక మగును
నాకు నామీఁదను మీకు సత్కృప గలదేని యధర్ముఁడ నైన నన్ను

తే. విడిచి జగముల నీకీర్తి విస్తరింపు, మనిన లక్ష్మణుమాటల కవ్విభుండు
చలితమానసుఁ డగుచు మంత్రులవసిష్ఠుఁ, బిలువఁబనిచి సమస్తంబుఁ దెలియునట్లు

క. తనను ప్రతిజ్ఞయుఁ గాలుం, డనినతెఱఁగు నిసుతుని యాగమనముఁ బ
ల్కిన వా రందఱు నిట్లని, యనిరి రఘూద్వహునితోడఁ బ్రాంజలు లగుచున్. 308

సీ. రఘునాథ! మీచేతఁ బ్రథమంబ భూభారహరణంబు పరిష్ఠ మయ్యెఁ గాన
జ్ఞానదృష్టి నెఱుంగఁ జను లక్ష్మణవియోగ మబ్బంగి లక్ష్మణునంగుఁ బ్రేమ
విడువు మింకఁ బ్రతిజ్ఞ విడువకు విడిచిన నగు ధర్మమెల్లను వ్యర్థముగను
ధర్మంబు నశియింపఁ ద్రైలోక్యము లడంగు ధరణిఁ బ్రోచెడు ధర్మపరులు మీరు

తే. గాన త్రైలోక్యగతి బుద్ధి నూని కిప్పు, డొక్క లక్ష్మణు విడనాడి యుభయలోక
జనులపాలన మొనరింపఁ జను జగంబు, వినుతి యొనరించు నీకీర్తి విస్తరించు 309

వ. అనుచు ధర్మార్థసత్యసమన్వితంబులుగఁ బలుకు వారల వచనంబు లాకర్ణించి సభామధ్యంబున సుమిత్రానందనుం జీరి యిట్లనియె. 310

ఆ. మనను వచ్చినట్లు చనుము లక్ష్మణ! ధర్మ, సంక్షయంబు గాఁగఁ జనదు వెడల
ద్రొబ్బుటయును శిక్షయు దునుముట రెండును, సమము నాత్మఁ దలఁప సజ్జనులకు 311

## లక్ష్మణుఁడు సరయూనదియందుఁ జేరుట.

క. అన దుఃఖాక్రాంతుం డై, తనయన్నకు మ్రొక్కి యంతఁ దడయక సదనం
బును వెడలి సరయువకుం, జనియె గరంబులు మొగడ్చి శైలతనూజా!. 312

వ. ఇట్లు పరమధార్మికుండగు సుమిత్రానందనుండు కృతాంజలి యై సరయూతటంబునకుం జని సకలప్రాణంబులును నిరోధించి మూర్ధతలంబునం జేర్చి షడాధారస్వరూపజ్ఞుండును యోగయోగాంగవిదుండును గావున రాజయోగప్రకారంబున దృష్టిపూర్వకంబున భ్రూమధ్యంబునం జూచుచుఁ గృతాకృతానుసంధానంబులు మాని సర్వసంకల్పవర్జితుం డై యొద్ది యక్షరంబును బరబ్రహ్మంబును వాసుదేవాఖ్యంబును నగు నట్టి పరమస్థానంబు మనంబునం జింతింపుచు మారుతంబుల నిరోధించె నాసమయంబున. 313

ఆ. సకలదేవతలును సర్వర్షులును సంత, సమునఁ బొగడి మించు జల్లు గాఁగఁ
గ్రింగుకొలిపి రమలమందారకుసుమముల్ మేఘనాదువైరిమీఁద నపుడు. 314

వ. సుపావనంబగు నమ్మహామహుని శరీరంబును బ్రాకృతజనుల కదృశ్యం బయ్యె నంత. 315

క. ధీరు సుమిత్రానందను, నైరావణముపయిఁ జేర్చి యాత్మపురికి జం
భారాతి దోడుకొని చని, గారవ మొదవంగఁ బూజఁ గావించె సఖీ!. 316

వ. నారాయణచతుర్థాంశుండగు రామానుజు నచ్చటిదేవత లెల్లను బూజించి రప్పురుష పర్యంకమును స్వీయంబగు భుజంగదేహంబు ధరియించి సత్యంబున కనుగమించె నప్పుడు. 317

చ. ఘనముగ సత్యలోకమునఁ గల్గు బుధుల్ గములై సురాళివా
హనయుతులై దివంబున మహాహిశరీరసమేతుఁ డాజనా
ర్దనచతురాంశ లక్ష్మణుని దర్శన మింపుగఁ జేసి రేమి చె
ప్పను గిరికన్య! కన్నులకుఁ బండువ యై తగ నట్టివేళయున్. 318

ఆ. అనుచుఁ బర్వతునకు నల్లుఁడౌ కైలాస, మందిరుండు ప్రమథబృంద వేణి
నైన శైలకన్య కక్కఁడులీనుని, కథలు పలికి పలుకఁ గడఁగె మరల. 319

వ. అంత నచ్చట రఘువల్లభుండు సుమిత్రానందను వీడి నిలువఁదగని దుఃఖంబున మంత్రులను బంధుజనులను రావించి యందు వసిష్ఠున కిట్లనియె. 320

ఆ. భరతు బుద్ధిమంతుఁ బట్టాభిషిక్తుని, జేతు లక్ష్మణుండు చేరినట్టి
మార్గమేను గాంతు మతి యెవ్వరికి నాకుఁ, దలఁచి చూడ భ్రాతృధర్మమునను.

ఆ. అనినఁ బౌరజనము లందఱు దుఃఖార్తు, లగుచు మొదలు దెగిన నవని వ్రాలు
సిడుపు మ్రానుకరణిఁ బడిరి కర్ణములను, బడిన మూర్ఛ నొందె భరతుఁ డపుడు 322

వ. ఇట్లు భరతుండు దెప్పిటి తనను దాన నిందించుకొనుచు రామచంద్రునితో నిట్లనియె.

మ. భవదీయాంఘ్రియుగంబు లాన రఘుభూప! శ్రేష్ఠ నిన్నీడి యి
ట్భువి నైనం దివి నైన నొల్ల నిదె నీపుత్త్రుల్ ధరాపాలన
ప్రవిశత్వం బొనరింపు తమ్ముఁడును సద్భక్తుండు శత్రుఘ్నుఁ డం
త వినం జేయును చాటఁ బంపు జగము ల్తత్త్వజ్ఞు లౌనట్లుగన్. 324

చ. అని భరతుండు పల్కు జను లందఱు రాముని వీడఁ గల్గునో
యని భయ మంది రంత మహిజాధిపుతోడ వసిష్ఠుఁ డిట్లనున్
జనవర! నిన్నుఁ బాయఁగను జాలక పొక్కెద రింద ఱిట్లు గా
వునఁ గరుణింపు కూడి చన నుండునె నిన్నెడ యొక్క నిచ్చటన్. 325

తే. అనిన సీతావిభుండు ప్రియంబు నొంది, వారి నందఱఁ బూజించి యడుగవలువ
దేమి కోరిక పల్కుఁడే నిచ్చు చేతు, ననిన నిట్లని పల్కిరి యంద ఱపుడు 326

ఉ. మిమ్ములఁ గూడి వచ్చుటలు మేలగు మాకు ధరిత్రి కైన స్వ
ర్గమున కైనఁ బ్రీతి యిది కాంతలతోడను బుత్త్రమిత్త్రవ
ర్గములతోడఁ గూడ నన గట్టిగ వీరి మనంబు గల్గునం
చమ్మెయి రంతు వల్లె యనె నారఘుపుంగవుఁ డద్రినందనా!. 327

వ. ఇట్లు రమావల్లభుండగు రాఘవేశ్వరుండు మహాప్రస్థానంబునఁ గృతనిశ్చయుండై యాదినంబున నిజనందనులగు కుశలవుల రావించి యెనిమిదివేల రథంబులును నెని నూఱులు గజంబులును నాఱువేల తురంగంబులును ననేకులగు పదాతివర్గంబులును బహుధనరత్నాదులును వేఱువేఱ నొసంగి వీడ్కొలిపిన నాసీతేయులు జగజ్జనకుం డగు నిజజనకునకు నమస్కరించి వీడఁజాలక యతిదుఃఖంబునం జని రంత రాఘవుండు శత్రుఘ్నుసమీపంబునకు దూతం బనిచిన వాఁడును. 328

క. చని కాలురాక యాత్రే, యునిచేష్టయు లక్ష్మణుండు నొగి నీల్గుట రా
మునినిశ్చయంబుఁ బల్కఁగ, విని శత్రుఘ్నుండు శోకవిహ్వలమతి యై. 329

ఆ. ఇంచుకంత చింతఁ గాంచి తోడనె ధైర్య, మూని చంద్రకేతునూను విదిశ
యను పురికిని మధుర కాధ్యు సుబాహునిఁ, జేసి నిజగృహంబుఁ బాసి వెడలె.

వ. ఇట్లు మహాబుద్ధియగు లవణాంతకుండు రాఘవదర్శనాపేక్షుం డయి యయోధ్యా
నగరంబునకు వచ్చి యచ్చట. 331

చ. కనియె దుకూలయుగ్మ నిజకాంతిసమావృతదిక్సమాజు స
న్మునిగణసేవితుం జనమనోహరు భానుకులప్రసూను దు
ర్జనసికరాబ్ధిబాడబు సుశాంతవచోయుతు నింద్రనీలమే
ఘనిభశుభాంగుఁ బఙ్క్తిముఖగర్వహలాహలభీము రాముని౯. 332

ఆ. ఇట్లు రాఘవేంద్రు నింద్రనీలనిభాంగు, జనకజాభిరాము సమరభీముఁ
గాంచి వందనములు కరము మెప్పుఁ గావించి, భక్తితోడ నిట్లు పలికె నపుడు. 333

ఉ. దేవ! మదీయనందనుల ధీరుల రాజ్యమునందు నిల్పి నీ
సేవ యొనర్ప వచ్చితిని జేరిన భక్తుని వీడరా దన౯
భావమునందు నిక్కమగు పల్కని రాముఁ డెఱింగి లెమ్ము ర
మ్మా వెడలంగఁ బోలు దినమధ్యమునం దవి నిల్వ నందఱు౯. 334

## శ్రీరామునికడకు విభీషణసుగ్రీవాదులు వచ్చుట.

వ. అని ధర్మంబులగు శత్రుఘ్నువాక్యంబులకు మధ్యాహ్నంబునఁ బ్రస్థానం బనుచు రామచంద్రుం డాన తిచ్చె నాసమయంబున రఘువల్లభు చికీర్షితం బెఱింగి దేవాంశసంభవులును గామరూపులును నగు ప్లవంగపుంగవులును భల్లూకకులాధీశ్వరులును విభీషణసమేతులగు నిశాచరవర్యులును సహస్రసంఖ్యలగు గోపుచ్ఛులును బుత్రదారాసమేతు లగుచుఁ జనుదెంచి ప్రాంజలు లయి దేవా! భవదనుగమనంబున దృఢనిశ్చయుల మని రంత సుగ్రీవుండును భక్తవత్సలుండగు నారాజవల్లభున కిట్లనియె.

తే. జానకీనాథ! నీపదాబ్జాతయుగము, వీడఁజాలక కనుఁగొను వేడ్కతోడ
నంగదుని వేగ కిష్కింధ కధిపుఁ జేసి, వచ్చితిని నన్ను విడనాడ వలవ దిపుడు. 336

వ. అనినఁ జిఱునగవు దళుకొత్త వల్లె యని విభీషణుం గనుంగొని. 337

సీ. విను విభీషణ! నీవు ధనధాన్యసంపద లెనయ లంకారాజ్య మేలుచుండు
మద్వాక్యమునను సిమ్మహి ప్రజావళి నెంత తడవు దాల్చునో యంత తడవు వేఱె
పలుకకు మిఁక నొండుపగిదిని నామీఁదియాన నీవును జగత్ప్రాణితనయ!
యవనిఁ జిరంజీవి వగుచు నిల్వుము వ్యర్థ మొనరింపకు మదాజ్ఞ వనచరేంద్రు
తే. లార! మీరును వృక్షేశులార! మీరు, రండు నసుఁ గూడి కోర్కులు పండ వేగ
నాయుతిము గం డనుచు నిట్టు లానతిచ్చెఁ, బ్రేమతోడను దశరథరామవిభుఁడు.

వ. అని ప్రభాతసమయంబున. 339

శా. మాయామానుషరూపవంతుఁడును శ్రీమంతుం డనంతుండు నా
మ్నాయాగమ్యుసుఖైకరూపుఁడు జగన్నాథుండు దత్త్వాత్మయుం
ధ్యేయుండుం బురుషోత్తముండు హరియుం ధీరుండు గాన న్మన
స్త్వప్రియం బీజగ మంచు రాముఁడు మహాప్రస్థాన మూఁచె న్మదిన్. 340

వ. ఇట్లు పరమాత్ముఁడును షడ్గుణైశ్వర్యకలితుండును నగు రామచంద్రుండు వసిష్ఠమునీం
ద్రుం గనుంగొని ముందర నగ్నిహోత్రంబులు నడపింపుం డనిన నమ్మునియు మహా
విధానంబుగఁ బ్రస్థానకర్మం బొనరించె నంత. 341

## శ్రీరాముఁ డయోధ్యను విడిచి సరయూనదికిఁ జనుట.

సీ. క్షౌమాంబరుండును సకుశపవిత్రపాణియు నిర్మలుఁడు నై చను నిజపురంబు
వెడలె సీతాభ్రంబు వెడలు చంద్రునిభంగిఁ గలశాబ్ధికన్యయుఁ గరమునందు
రక్తోత్పలము మీఱ రఘువార్యు సవ్యభాగమున నిల్చెను శస్త్రకార్ముకాస్త్ర
విసరంబు లెల్లను విగ్రహంబులు దాల్చె వేదంబులును నట్ల వెలసి కూడ
తే. నడచె దివ్యులు మునులును నడచి రట్లు, ప్రణవయుతముగ వ్యాహృతిత్రయసమేత
ముగను మాత్రలుశ్రుతులును ముందు నిలిచె, నమరె రాఘవప్రస్థానసమయమపుడు

వ. పుత్త్రమిత్త్రకళత్త్రాదులతోడ జనంబు లెల్ల మహాకాంక్షు లయి ధనంబు గొనువారలు
ద్వారంబు నావరించుభంగి లక్ష్మణాగ్రజు నావరించిరి మఱియును 343

క. అంతఃపురజనములు నవ, కాంతవసుఁడును భృత్యజనులు నొప్పులుఁ దనదా
కాంతయుఁ గూడఁగ సీతా, కాంతునితో నడిచె వేడుకను భరితుండుగన్. 344

మ. వెలయన్ రాము రమాసమేతుఁ గని యుర్విం బెల్ వెలుంగొందు వి
ప్రులు సత్క్షత్త్రియ వైశ్య శూద్రులు సతీపుత్త్రప్రియానీకయు
క్తులు సోత్కంఠులు నొచ్చు వచ్చి రతిభృత్యుల్ భానుజాదిప్లవం
గులు శుభ్రాంబరముల్ ధరించి నిజలాంగూలంబులం ద్రిప్పుచున్. 345

వ. మహాప్రయాణగృహీతబుద్ధియగు సమ్మార్గాభిషిక్తుతోడ జయ జయ శబ్దంబులు
పలుకుచు వెడలి రక్కాలంబున. 346

తే. దీనులును దుఃఖభయయుక్తమానసులును, బాహ్యసుఖసక్తులును లేరు ప్రజలసంత
సమునఁ బశుభృత్యపరులై చనుదు రితర, చింతలను వీడి రఘునాథుఁ జేరుకొఱకు.

వ. ఇట్లానందరూపులును విరక్తులు నగుచు రామానుగమనం బొనరించి రట్టివేళ స్థావర
జంగమాత్మకంబులగు భూతంబుల కెల్లను భయంబు గనుపడ దయ్యె నందఱును
విముక్తు లగుచు సాక్షాత్పరమాత్మయు ననంతశక్తివంతుండును బరుండును నీశ్వ
రుండును నగు రామచంద్రునకుఁ దోడు నడచి సకలసంపద్భరితం బగు నయోధ్యాన
గరంబున రఘువల్లభానుగమనులు గాని జను లొక్కరైనను లేరైరి రామచంద్రు

మహాప్రయాణానంతరంబున దత్పురంబును జంతువిరహితం బయి శూన్యం బై
యుండె నంత 348

మ. అతిదూరంబు రఘూద్వహుం డపు డయోధ్యాతీరంబు డై యేఁగి య
ద్భుతమా శ్రీహరినేత్రజాతను నదిన్ పుణ్యప్రదం గాంచి సం
స్మృతిచేఁ బావనుఁ డౌచు సంతతమునం బృథ్వీతలం బెల్ల హ్లాద్
స్థితి మంచుం దలపోసెఁ బర్వవిలసత్కీర్తాంకుబింబాననా!. 349

ఉ. ఆసమయంబునన్ ఋషులు నంబుజగర్భసురేంద్రసిద్ధవి
ద్యాస(మితి)న్ విమానముల నంబరవీథిని నిల్చి రట్లు ప
ద్మాసనముఖ్యదేవతలు దాకొనుటన్ నభ మెల్ల దివ్యతే
జోసహితంబుగా వెలిఁగెఁ జాల దినేశునిలోకమో యనన్ 350

వ. స్వయంప్రకాశులును మహాత్ములు నగు వసిష్ఠాదిపుణ్యమునీంద్రులు వచ్చి నిల్చిరి
మఱియును. 351

సీ. దేవమృదంగముల్ ధిమిధిమిద్ధిమియంచు మొఱసెఁ బూవులవాన గురిసె భూరి
గానం బొనర్చిరి గంధర్వవరు లెల్ల వేడ్కఁ జల్లని గాలి వీచె దేవ
ములం సుగంధసమేతములుగ నొప్పెను రాఘవేశ్వరుం డంతను జలస్పర్శనంబు
సరయూనదిని నిజచరణంబుల నొనర్చి మరలఁ బ్రాక్తనశక్తిగరిమ నొంది

తే. నంత బరమేశ్వరుఁడును బరాపరుండు, నైన రఘువల్లభునకుఁ బద్మాసనుండు
హస్తములు సాఁచి వందనం బాచరించి, భక్తితోడుత నిట్లని పలుకఁ దొడఁగె.

తే. భయరహితుఁడసదానందమయుఁడఁ బూర్ణుఁ,డను బరాత్పరుఁడను విష్ణుఁడను శివుండ
వనుచు నెఱుఁగుదు వైన భక్తాళిఁ బ్రోచు,బిరుదువహియించిచెలువొందుదొరవు గాన.

వ. మనజానిభంగి నుంటి వైన నేను. 354

క. తనయుఁడను సంతతము పద, వనరుహముల సేవ పూజ వదలనిభక్తుం
డను బనుపుతోడఁ బ్రజలను, జనియింపఁగఁ జేయుబుద్ధిసహితుఁడఁ గానన్.355

వ. నాయందులఁ గరుణించి యిప్పుడు. 356

క. నీవును దమ్ములు వైష్ణవ, మై వెలయు శరీర మంది యమరావనమున్
గావింపు ముందు దోఁచిన, నావిధమున నైనఁ బ్రోవు మందఱ మమ్మున్. 357

వ. దేవా! విష్ణుండవు సురాధీశ్వరుండవు నీవ నిన్ను వీడి యన్యపురుషు నెఱుంగము కెం
దామరలఁ గేరు నీదుమృదుపదంబులకుఁ బదివేలు ప్రణామంబు లాచరించెద మఱియు
సాఁగిమ్రొక్కెద నాయందు దయాళుండవు గ మ్మనుచుఁ జతురాననుండు విన్న
వింప నాసమయంబున దేవతల నయనంబులకు దురాలోక్యం బై. 35[illegible]

## శ్రీరామదేవుండు తననిజస్వరూపమున బ్రహ్మాదులకు దర్శనం బిచ్చుట.

సీ. ఘనశంఖచక్రయుక్తంబు లౌ నాలుగు భుజముల నొప్పి నప్పుణ్యతనువు
దనరె నద్భుతభోగధారి యౌ లక్ష్మణుఁ డీశ్వరతల్పుఁ డై యొసఁగె శరుఁడు

భరతశత్రుఘ్నులు దశరథాంగంబు లై లక్ష్మి యయ్యెను సీత లక్షణాంగి
నారాయణుండు రఘునందనుండు పురాణపురుషుఁ డయ్యెను శైలపుత్రి! యిట్టు
తే. లైరి వారలు పూర్వదేహములతోడ, దివ్యతేజోయుతాంగు లై భవ్యచరితు
లై విభూషణకలితు లై యాయుధాస్త్ర, లై స్వభక్తదయాళు లై యద్భుతముగ 359

వ. ఆసమయంబున. 360

చ. వనరుహగర్భమౌనిగణవాసవముఖ్యులు స్తోత్రము ల్సపూ
జనములు చేసి మ్రొక్కిలిడి సంతస మందుచుఁ బ్రాప్తకాము లై
తనరిరి యీశుఁ డవ్యయుఁడు తా నగు విష్ణుఁడు బ్రహ్మతోడ ని
ట్లనియె నిజానుగమ్యు లగునట్టి జనంబులయందు సత్కృపన్. 361

క. కానగ తిర్యగ్జంతువు, లయినను నను వీడలేక యరుదెంచెడు మె
చ్చా నివు మద్వికుంఠముతో వీరికి సామ్యపదము దొరకొల్పు మొగిన్. 362

చ. అని హరి పల్కినన్ సరసిజాసనుఁ డిట్లను దేవదేవ! నీ
యనుపమనామకీర్తనము లారయ సాంతనికాఖ్యలోకముల్
పనుపడఁ జేయు నంత్యమునఁ బామరుఁ డైనను సంస్మరింపఁ గా
వున నిను గాంచు వీరి కవి యొప్పుట సందియ మూనె చూడఁగన్. 363

వ. అని ద్రుహిణుండు పల్కె నంత 364

చ. పొలుపగు వేడ్కతోడ హరిపుంగవు లెల్లను స్నానము న్నదీ
జలములఁ జేసి దేహముల సంగతి వీడి సమస్తదేవతాం
శల మును పెవ్వ రెట్లయిరి చయ్యన వారలు వారియందునం
గలసిరి ధూతసంసరణకల్మషు లై గిరిరాజకన్యకా! 365

వ. సుగ్రీవుండు ప్రభాకరవీర్యజుండు గావున నద్దేవు నొందె నరు లెల్లను సరయూ
జలంబులఁ గృతస్నాను లై మనుష్యదేహంబులు పరిత్యజించి విమానంబుల నెక్కి
సత్యలోకంబునకు మీఁదు నై బహుభోగంబులఁ జెన్నొందు సాంతనికాఖ్యలోకం
బుల నొందిరి తిర్యక్ప్రాణిసముదయంబులును రామచంద్రు శుభవీక్షణంబున జలం
బుల మునింగి దివంబు నొందిరి తక్కిన పల్లెలజనంబు లెల్లను జనుదెంచి రామచంద్రుం
గనుంగొని ముక్తసంగు లగుచు లోకగురుండును బరేశుండును నగు హరిని స్మరియిం
చుచు జలంబుల నంటి స్వర్గంబు నొందిరిట్లు. 366

సీ. పలుకంగఁ బడె నింతపర్యంతమును రామచంద్రు సత్కథ యశేషంబు గాఁగ
శంభునిచే శైలజకుఁ గాన నమ్మహాదేవియును రఘునాథు భావమునను
స్మరియింపుచును భూరిసంతోషభరిత యై తనరె నియ్యాఖ్యానమును మహోత్కృ
ష్టవు గాధిసుతునిచేత విరచితం బయ్యెఁ గాఁగల కార్యంబు భోగిభరణా
తే. చేతఁ బల్కిన యది గాఁగఁ జేరి వినినఁ, గౌసలేయుండు రంజనకారకుండు
దశరథేశ్వరతనయుండు ధార్మికుండు, మించు వేడుకతో సంతసించఁ గలఁడు 367

క. రామాయణకావ్యము హిమ, ధామనిరాత్మజను భోగిభూషణుఁ డెఱుఁగం
గా మిగులఁ బల్కెఁ గావున, శ్రీమంతులు వినిన వారు చేరి దివంబున్. 369

తే. దినము పాపము లొనరించుచును నరుండు, దనరుభక్తిని బద్ధుఁడైనను బఠింప
నఘములను బాసి మోక్షము లందఁగాని, రామసాలోక్య మంగును బ్రేమ నతఁడు.

తే. అనఘ యధ్యాత్మరామాయణము లిఖింప, వినిన వినిపింప శ్రీరామజనవిభుండు
సీతతో గూడ వేగంబె చేరి భాగ్య, మాయురారోగ్యమోక్షంబు లొసఁగఁ జేయు. 370

తే. ప్రబలవిజ్ఞానమార్గైకభాస్కరంబు, జానకీనాథచరితంబు సమ్మతింబు
ఘోరపాతకసంఘముల్ పాయుదోలు, నక్షరం బొక్కటైన సత్యంబు మహిని. 371

* కలికవృత్తము:—

జనమనోహర మాదికావ్యము జలజభవముఖదేవతా
వినుత మధ్యాత్మికనుసంజ్ఞము వినినఁ జదువ నెఱింగినన్
జనులు సంసరణాబ్ధి దాఁటి సుసమ్మతంబును దేవతా
వినుత మగు సత్పథము గాంతురు విష్ణుకరుణాదృష్టిచేన్. 372

క. అని శివుఁ డంబిక కెఱిఁగిం, చినగతి విధి నారదునకుఁ జెప్పిన వ్యాసుం
డును బల్కె నావిధుఁ డం, చనియెను సూతుండు శౌనకాదిమునులకున్. 373

చ. జనహిత! భక్తహృత్సరసిజాతదివాకర! పుండరీకలో
చన! హరి! నీలదేహ! దితిజ(వ్రజమర్దన!) దేవ! రం
గనశుభవస్త్ర! భావభవశాసనమిత్ర! మహాహితల్ప! చం
దనకలితాంగ! భూరిభవతాపనివారక! రంగనాయకా!. 374

మాలిని. జలరుహనిభపాదా! సత్యమార్గానుమోదా!, జలదనిభశరీరా! శక్రవైరిప్రహారా!
సులలితశుభభావా! శర్వవంద్యప్రభావా!, కలితదరరథాంగా! కౌస్తుభోపేతరంగా!

గద్య. ఇది శ్రీమోరుతోఁటము క్షీశ్వరప్రసాదలబ్ధకవితాపవిత్రకోటమరాజభాస్కర
మంత్రిపుత్ర నాగయామాత్యప్రణీతం బైన శ్రీమదధ్యాత్మరామాయణం బను
మహాకావ్యంబునం దుత్తరకాండము సర్వంబును నేకాశ్వాసము.

## అధ్యాత్మరామాయణము - సంపూర్ణము.

శ్రీః

---

[illegible]లక్షణము స్పష్టముగఁ దెలియఁబడలేదు.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము —1925.